# మన కర్తవ్యము

రచయిత
తత్వానందస్వామి

ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ (రిజిష్టర్డు)
తెనాలి :: మద్రాసు
1948

 [ వెల రు 1-4-0

# పరిచయము

గాంధిమహాత్ముడు భారతజాత్యుద్ధరణకు మాత్రమేగాక మానవజాత్యభ్యుదయమునకై జన్మించిన మహాపురుషుడు. భారతజాతిని దాస్యశృంఖలములనుండి తొలగించుట మహోత్కృష్టమగు కార్యమైనను మహాత్ముని జీవితాదర్శముల నాలోచించినచో నది యొక స్వల్పాంశమనియే చెప్పతగియున్నది. సత్య అహింసలను లోకమునందు వ్యాపింపజేసి లోకమున సర్వత్ర శాంతమును సమకూర్చి లోకకళ్యాణము నొడగూర్చుట యను మహదాశయమును ముందుంచుకొని అందుకు తొలిమెట్టుగ భారతస్వాతంత్ర్యము సంపాదించుటకు కాంగ్రెసు అను మహాసంస్థను చేతబట్టుకొని దేశమును మేల్కొల్పి స్వరాజ్యకాంక్ష పురికొల్పి శాంతిసమరమును సాగించి సత్యఅహింసాసాధనలనే ఆయుధములుగా బూని మహాబలిష్ఠ మగు ఆంగ్లేయప్రభుత్వమువారు భారతభూమిని వదలిపోవునట్లు చేయగల్గిరి.

భారతస్వాతంత్ర్యసముపార్జనమాత్రమున భారతజాతి సర్వతోముఖమగుసమర్థత పొందజాలదని గుర్తించి శాంతిసంగ్రామముతో పాటు సాంఘిక, ఆర్థిక, నైతిక విషయములందుగూడ నభివృద్ధిపొందుటకు పలయు మార్గముల నాలోచించి నిర్మాణకార్యక్రమమును సాగించి మతసఖ్యత, అస్పృశ్యతానివారణము, ఖద్దరు మొదలగు విధానములను నడపుటకు కృషిసల్పుచుండెను.

ముసల్మానులు తాము ప్రత్యేకజాతివార మనియు తమరందరు ప్రత్యేకించి భారతభూమిలో నొక ఖండమును విభజింపకొని పాకిస్థానమను నొక ప్రత్యేక రాజ్యమును స్థాపించుకొనవలెనని మహాప్రయత్నము గావించి ఉత్తరహిందూస్థానమున పంజాబులో పశ్చిమభాగమును, బంగాళములో తూర్పుభాగమును, మరి కొంత దేశమునుగూడ భాగించి విడిపోయినది మొదలు అతిక్రూరములును అమానుషములునగు ఘోరహత్యలు ప్రారంభమై ముసల్మానులును హిందువులుగూడ నొకరి నొకరు స్త్రీలు, పురుషులు, బిడ్డలు నను విభేదములేకుండ నాశనము చేసుకొనుట ప్రారంభించిరి. ఒక కొంతకాలము రక్తము ప్రవాహమై పారెనో యనునట్లు భయంకరస్థితులేర్పడెను. మహాత్ముడు ఈ ఘోరదురంతములను సహింపలేక తూర్పుబంగాళమునందలి నౌఖాళిలో తగులబడి నిర్జనముగావింపబడి స్మశానవాటి

కలవలెనున్న గ్రామములలో విద్వేషపూరితులైన జనులమధ్య నొంటరిగ, తనకు నంతవరకు సహాయమొనర్చుచున్న అనుచరులకు దురంతములచే బాధితులైన వారి కష్టోపశమనవిధులనిర్ణయించి వేరువేరుస్థానముల కంపి తాను పరులమధ్య నేకాకిగ నివాసముజేయుచు గ్రామగ్రామమునకును పొలములగుండ ముళ్ళ త్రోవలను బట్టి కాలినడకనుబోయి ప్రేమరసపూరితములగు శాంతోపదేశముల గావించుచు సాముదాయికప్రార్థనలను రామ రహిమానులను భేదము లేదని తెలుపు భజనలు గావించి ముసలమానుల హృదయములను ఆకర్షించి సమత శాంతులను నెలకొల్పెను. బీహారున చెలరేగిన హైందవప్రకోపప్రతీకారములవలన నేర్పడిన మహోపద్రవములను విని సహింపజాలక నచ్చటికిబోయి వారు గావించిన దుండగములను గర్హించి నెమ్మది నెలకొల్పెను. కలకత్తా, ఢిల్లీనగరములలోని భయంకర కలహకల్లోలములు అతిఘోరములుగ పరిణమించుటచేత నచ్చట నిరశనవ్రతములనుబూని ప్రజ్వలితద్వేషజాలములను చల్లార్చెను.

ఇట్టి మహత్తర కార్యభారముల తలను మోపుకొని యిరువది యెనిమిది సంవత్సరముల పైకాలమునుంచి నిద్రాహారములను లెక్కింపక మహోగ్రద్వేషజ్వాలలమధ్య ఘోరతపంబుగావించిన మహాత్ము డాకస్మికముగ హంతకుని చేతి గుండుదెబ్బచే హతుడగుటవలన లోకమంతయు నొక్కసారిగ మహాదుఃఖసాగరమున మునిగి మహాత్మునకు జోహారులొనర్చెను. హంతకుడు హైందవుడే యగుట హైందవజాతికి తీరని కళంకమేర్పడెనని హిందూసంఘము లజ్జాపూరితమయ్యెను. మహాత్ముని సత్యఅహింసల ప్రభావమును లోకము గుర్తించి పూజించిరి.

ఇట్లిన్ని సంవత్సరములుగ మహాత్ముడు గావించిన మహోద్యమముల సందర్భమున వారు వచించిన వాక్యములును, వారొసంగిన మహోపదేశములును, వారు నడచిన మార్గములును అపూర్వములు, అనన్యములు. వానిని శ్రీ తత్వానంద స్వాములవారు 'మన కర్తవ్య'మను ఈగ్రంథమున నుదహరించి మహోపకారము గావించిరి.

ఇంతకాలము లోక సంగ్రహణార్థముగ మన మధ్యమున పడరాని యిడుముల బడుచు, తన ప్రాణోపద్రవములనైన లెక్కింపక కృషిసలుపుచు నిర్మలాంతః

కరణతో వారు బోధించిన బోధలు వారు తలపెట్టిన కార్యములు వారి నిర్యాణముతో నంతరింప జేయుటయా లేక వానిని పూర్ణవిశ్వాసముతో చేతబూని సాగించి కార్యసిద్ధి బడయుటయా అను సమస్యకు "మన కర్తవ్య" మను ఈ గ్రంథము చక్కని సమాధానము నిచ్చుచున్నది.

ఇప్పటికి స్వరాజ్యము ఆయన మనకు సంపాదించిపెట్టిరి. ఇంకను మనము సర్వతోముఖముగ వర్ధిల్లు మార్గములు తలపెట్టి కొంత సాగించిరి. కాని అవి యాకస్మికమరణముచేత పరిపూర్తి గావించుటకు వారికి అవకాశము లేక పోయెను కావున అసంపూర్తిగ వదలిపెట్టబడిన కార్యవిధానమును ఉచితమార్గమున నడిపి జయప్రదము గావించి ప్రపూర్ణ సామర్థ్యమును సముపార్జించి మహాత్ముడాశించినట్లు లోకకళ్యాణమునకు మనము సాధనభూతులమై కృతకృత్యు లగుటయే మనకు పరమధర్మము. ఈ విషయమే శ్రీ తత్త్వానందస్వాములు తమకు సహజమగు గ్రంథశైలిని తేట తెలుగున సుబోధకమగునట్లు మహాత్ముని అమూల్యములగు బోధనలను వివరించి వారి కార్యాచరణ మార్గములను తేటపరచి ఆంధ్రలోకమునకు "మనకర్తవ్య" మను గ్రంథమూలమున మేల్కొల్పిరి. కావున ఆంధ్రులెల్లరును తమ కర్తవ్యమును పూర్ణముగ గుర్తించి మహాత్ముని సందేశమును నిర్వహించి ధన్యత గాంచెదరుగాక యని ఆశించుచున్నాను.

గుంటూరు<br>౧౫—౪—౪౭ }

(Sd.) కొండ వెంకటప్పయ్య

# పీ ఠి క

మన ప్రియమాతృభూమి రెండువందల సంవత్సరములు విదేశపరిపాలన మున బానిసతనమున మునింగి. యెనలేని యగచాట్లు గుడిచినది. వైరులు పన్ను జిత్తులకు లోనై భారతప్రజలు భ్రమల జెంది పరప్రభుత్వమునకే ముఱిసిపోయి స్వధర్మమును మఱచి సుషుప్తింబడియుండిరి. అట్టిదశలో గాంధీజీ దేశవిముక్తిని సాధించుటకై కంకణముం గట్టుకొనిరి. ఉపన్యాసములతో, ప్రచారములతో, సభలతో, ధర్మబోధనలతో, తోడిదేశీయులను మేల్కొలిపిరి. అనేకులు వ్యక్తిగతముగను, పత్రికాప్రచారముల జేసియు, సంఘములం గూర్చియు, గాంధీజీకి తోడ్పడిరి. "స్వయముగ ప్రయత్నశీలురగు వారికి దైవము తోడ్పడును." ఎట్టకేలకు భారతీయులు మేల్కొనసాగిరి. అర్థప్రబుద్ధత్వమునం గర్తవ్యనిరూపణము గావించుకోనోడిరి. పరస్పరనిందలకుం గడంగిరి. ఘోరచర్యలకు బాల్పడిరి. అట్టితఱి గాంధీజీ సత్యాహింసల బోధింపసమకట్టిరి. దౌర్జన్యక్రియలవైఫల్యమును దేటపఱచిరి. అసత్యము పిఱికితనమును బెంచి దుర్బలుల గావించి బతితులను జేయునని చాటిరి. భారతజాతీయమహాసభను (National congress) ఆశ్రయించి తీవ్రప్రబోధమును సాగించిరి. "స్వజాతి నుద్ధరించవలయును; లేదా మరణించవలయును. (Do or Die) అని శపథము బూనిరి. గాంధీజీపట్ల రెండును సఫలమైనవి. భారతీయులను కర్తవ్యోన్ముఖుల గావించినాడు. దానిని సాధించుటలో ప్రాణముల నర్పణముగావించినాడు.

గాంధీజీతో సమానముగను, వారిని మించియుం ప్రబోధములు గావించినవారు లేకపోలేదు. ఉపదేశముల జేసినవారును, సమాజములను, మఠములను, నాశ్రమములను స్థాపించి, తద్వారా ప్రచారములజేసినవారును నెందఱో కలరు. కాని, విజయలక్ష్మిని జేపట్టజాలరైరి. కారణ మేమి ? వారిప్రయత్నము లన్నియు నాడంబరప్రదర్శనములతో నంతరించినవి, ఉద్యమములు నశించినవి. వానిలోనుండవలసిన చైతన్యశక్తి కానబడదయ్యెను. గాంధీజీ నెలకొల్పిన సంస్థలందును, గాంధీజీ సలిపిన ప్రయోగములందును, జీవశక్తి కలదు. ఆయన తనజీవమును వానియందు బూరించెడివాడు. ఆయాసంస్థల కార్యము లన్నిటియందును, గాంధీజీ సంకల్పప్రభావమును, నాయన కర్మకౌశలమును ప్రత్యక్షములై యుండెడివి,

గాంధీజీ, యెవరి సేవని జేయుదని సలహా నిచ్చినను, నాయన తాను జేసియే చెప్పెడివాడు. "రండు పోదము, రండు చేయుదము" అనెడువాడేగాని "మీరు పొండు, మీరు చేయుడు" అనువాడు కాడు. ఎవరిచేత సేవని జేయించినను దాను పూర్ణబాధ్యతను వహించెడువాడు.

గాంధీజీ వైదములన్నింటికి సత్యము పునాది. సత్యము వారికి సాధ్యవస్తువు. అసత్యము వారికి సాధనముకూడ నైయుండును. అసాధనమునందు దాను ప్రత్యక్షమైయుండును, కావున సాధనలం దెల్లెడలను అహింసాధర్మము నిండి యుండును. అది సహజము. ఎవ్వడును హింసను గోరుకొనడు గదా ! ఈ యహింస అభావరూపముగ గోచరించినను, నయ్యది ప్రేమయొక్క భావైరూప ముగ బరిణమింపజేసియున్నాడు. ఆయన సాగించిన సహాయనిరాకరణము నందును ప్రేమతత్వము విమిడ్చియున్నాడు. బ్రిటుషువారి నెదిర్చినను, పాకిస్థాను స్థాపకుల కష్టము దగిలినను, నెదిరివారి క్షేమమును భంగపఱచకుండుటేగాక, వారి క్షేమమును ప్రేమపూర్వకముగా నాకాంక్షించెడివాడు.

హింసచేతను, క్రోధముచేతను సాధింపందగు కార్యములు లేవని గాంధీజీకి దెలియును. ద్వేషము ద్వేషమును బెంచును. బలయుతుడు క్రోధమూని బల హీనుని నిర్జించినను, దనశత్రువు తృప్తిజెందిగాని లేక నిస్పృహతోగాని ద్వేష మును మానుకొనునటుల జేయజాలడు. ఆ ద్వేషము, లోలోన బెరుగుచునే యుండును. వాని యపజయము, వాని దుఃఖము, వాని హృదయమునందలి ద్వేషమును నిలిపియుంచి పెంపుజేసి ప్రజ్వరిల్లు నవకాశమునకై నిరీక్షించునటు లనే చేయునుగాని సమయింపదు. కావున బలాఢ్యుని విజయము ద్వేషనాశనము గావించుటయందపజయమే యగును. అటులగాక యెవడేని అహింసాధర్మమును వహించి, ఎదిరి పెట్టుబాధల సహించి ప్రేమ యనెడు ఆయుధమునే ప్రయోగించు చుండునెడల, వానికి విజయము దూరముగనుండినను నాలస్యముగనైన లభింప వచ్చును. కాని, రాకతీరదు. వచ్చిన పిమ్మట నది సుస్థిరమై వఱగును.

ఈ సిద్ధాంతము మన హృదయమున సుస్థిరముగ నిలువవలయునవినచో అపరిగ్రహము ప్రధానము. నీవు సర్వదా, సర్వధా పరుల కుపకారమునే చేయ జూచుము. ఉపకారమును స్వీకరింప జూడకుము. ఒకవేళ నుపకారమును స్వీక

రించితివా ? తుల్యమగు ప్రతిఫలమును నొసగుట మఱువకుము. ఎంతటి ఘనున కైనను, నెంతటి యల్పుడైనను సాహాయ్యము జేయగల ఘట్టములు సంభవింపక పోవు. జాగరూకులమై నిరీక్షించుచుండవలయును. చిట్టెలుకను తృణీకార భావముతో విడచివేసిన సింహము, వలలో జిక్కుకొనినతఱి, నావలను దెగగొరికి, సింహమునకు స్వేచ్ఛను, ప్రాణరక్షణమును బ్రసాదించిన చిట్టెలుక కథ మనకు గొప్ప గుణపాఠమును నేర్పగలదు.

ఈ సూత్రములన్నింటిని కార్యరూపమున నిరూపించుచు, గాంధీజీ తన యుద్యమముల నడపియున్నాడు. ఇందులకు దీర్ఘకాలశిక్షణము, గమ్యమునందు విశ్వాసము నవసరములు. ప్రారంభములో నిరాడంబరములుగా గోచరించును. కాని, ఫలితార్థములు ఘనములే యగును. ఇరువదియైదేండ్లనుండి యజ్ఞాతప్రభావముతో సాగుచువచ్చిన చర్ఖాసంఘము, హరిజనసేవాకార్యము, గ్రామపరిశ్రమోద్యమము, నయీతాలీము ప్రతిష్ఠాపనము మున్నగువాని మహిమ మీనాడు గోచరించుచున్నది. విశ్వాసము కుదురుచున్నది. గాంధీజీ ఘోరమరణమును సాకుగ జూపి, వారి సిద్ధాంతములు విఫలములైనవని కొందఱు వాదింతురు. నేలలో గ్రుక్కి యదృశ్యమైన బీజము వ్యర్థమైపోయెనను భ్రాంతిని బోలునదియే యీ వాదన. బీజరూపము గోచరించకున్నను, దానిఘనతరప్రభావము, దానినుండి పుట్టిన వృక్షమునందును, నా వృక్షఫలరాశియందును గాన్పించునుగదా ? అటులనే గాంధీజీయాత్మబలిదానము పూర్ణఫలరూపమే యనవలయును. ప్రపంచమంతయును గాంధీజీయహింసాసిద్ధాంతమును, సాత్త్వికనిరోధవిధానమును, సామ్రాజ్యతృష్ణానిరసనమును, నధికాధికముగ దెలిసికొన నుద్యుక్తమగుట గాంధీజీ విజయమునకు నిదర్శనమే యగును. చేతిబాంబువిసరి చంపదలచుకొన్నవానిపై, గాంధీజీ చూపిన క్షమాభావము, కరుణ లోకమునకెల్ల గుణపాఠమును గఱపుటలేదా ? అపకారికి నెప మెన్నక యుపకారము జేయుట సద్ధర్మమని కోటియుపన్యాసముల జేసినను ఫలముండునా ? మరణమాసన్నమైనను [illegible]మ గమ్యమునందు విశ్వాసమును, దైవభక్తియు, విడనాడరాదనుటకు నిద[illegible]ు గాంధీజీ శాంతిమయనిర్యాణమువలన వేవిధముల బ్రకటనమగుటలేదా ?

ఈ నడవడి నలవఱచుకొనుటయు, నదను లభించినప్పుడెల్ల నవలంబనము జేయుటయు మన కర్తవ్యమని గాంధీజీ యుపదేశించెను. తన జీవితమున విద

ర్శనముల జూపెను. తత్ఫలితమును లోకమున నిప్పుడు మనము జూచుచున్నాము. ఆ సిద్ధాంతము విఫలమైనటుల దోచువారియందు. దాని ప్రయోగము చాలక యింతను దీవ్రముగ బ్రయుక్తము కావలసియున్నదనియే గ్రహింతుము గాక. రోగమునకు దగిన యౌషధమైనను దగినంతకాలము సరియగు పరిమాణములో సేవించి నప్పుడేగదా రోగనివారణయగుట. ఇప్పుడు లోకమును బీడించుచున్న పరస్పరావిశ్వాసము, క్రోధము, పరహింస, దుఃఖము ననువాని నివారణకు గాంధీజీ నిర్మాణకార్యక్రమమే తగిన ప్రణాళిక. దానిని మన మాచరించుట, ప్రపంచమున బ్రచారముచేయుట మన కర్తవ్యమగును. అపుడు గాంధీజీ నిరీక్షించిన విశ్వవ్యాప్త "రామరాజ్యము" నకు స్థిరతమములగు పునాదు లేర్పడగలవు.

గ్రంథకర్త.

# వి ష య సూ చి క

## మొదటి భాగము



## రెండవ భాగము

మూడవ భాగము



నాలుగవ భాగము



జై హింద్

•

# మన కర్తవ్యము

## (శ్రీ గాంధిజీ ప్రబోధము)

### 1. భారతదివ్యస్వరూపము

మన దృష్టిని ఐదారుశతాబ్దముల వెనుకకు మరల్చుదము. అప్పుడు మన భారతదేశ మెట్లున్నది? పూర్వార్ధభూగోళము నందే గాక ప్రపంచమంతటిలోను మహోత్కృష్ట దేశమై యొప్పినది. నేటి నాగరికతయొక్క తళుకుబెళుకులు లేకుండిన లేకపోవుగాక! ఆనాటి భారతదేశమును ఆనాటి యితరదేశముల తోడనే పోల్చి చూడవలయును. ఆనాడు ప్రపంచ మంతయు, ముఖ్యముగా యూరపుఖండవాసులు భారతదేశ మన స్వర్గసీమ యనియే భావించుచుండిరి. భారతదేశ మానాడు సకలసంపదలకు నిలయమై, సమస్తవిద్యలకును నాలవాలమై, దైవసములగు నీతిమంతులకు నివాసమై యొప్పెను. ఈ దేశముతోడి మైత్రియే, యీ దేశముతోడి వ్యాపారమే, యీ దేశముతోడి యేసంసర్గమైనను ధన్యత చేకూర్చునని లోకులెల్లరు నువ్విళ్లూరుచుండెడివారు. ఆలాటి యాశలతో ప్రేరేపింపబడి డచ్చివారు, పోర్చుగీసులు, పరాసులు, బ్రిటిషుద్వీపవాసులు ఒకరితో నొకరు పోటీలుపడుచు, పరుగులిడుచు వచ్చి, యెవరు భారతదేశమును ముందుగ జేరుదుమా యని స్పర్ధలు బెంచుకొనుచుండిరి. ఆ కాలమున భారతదేశమునుండి రత్నరాసులను, సన్నని సుందరములగు వస్త్రములను, అరుదగు సుగంధ ద్రవ్యములను,

ఒంటెలమీద వేసికొనిపోయి, ఆసియాఖండపశ్చిమప్రదేశములవారు యూరపుఖండముతో గొప్ప వ్యాపారము సాగించి, యచ్చటి రాజులయు, శ్రీమంతులయు నైశ్వర్యములను కొల్లగొట్టుచుండిరి. ఆ వ్యాపారము నంతయు తమ చేతులలోనికే దీసికొని ధనాఢ్యులుగా నెంచు యూరపువర్తకులు వసతులు లేక కుందుచుండిరి. ఆకాలమున యూరోపియనులు భారతదేశమునకు రాగోరు నెడల ఆసియాఖండపు పడమటి భూభాగములను దాటి మెట్టప్రదేశముగుండా పయనించి ఖైబరు, బోలను కనుమలలోనుండి హిమాలయపర్వతములను దాటి రావలసియుండెను. వేరు త్రోవలు లేవు. ఆ త్రోవనుబట్టి రావలయు నన్న, ఆ యా ప్రాంతములవారు ముఖ్యముగా మూరులు, అరబ్బులు, తురుష్కులు, పారశీకులు, ఆఫ్ఘనులు, యూరపియనులను రానీయరు. అటుల రానిచ్చుచో తమ వర్తకము కుంటువడిపోవునుగదా !

అప్పుడప్పుడే భూమి గోళాకారముగ నుండె ననియును, ప్రాచ్యులు పడమరముఖముగా భూమార్గమున వచ్చి యూరపుఖండమును చేరునటులనే యూరపియనులును నింకను పశ్చిమముఖముగ పయనించి సముద్రమార్గమున వచ్చి ఆసియాఖండస్థమగు భారతదేశమును చేరవచ్చు ననియును భూశాస్త్రజ్ఞులు యూరపుఖండమున బోధలు సాగించిరి. ప్రజలాబోధలు నమ్మక, అట్టి విపరీతసిద్ధాంతములు చేయువారిని పెక్కు రీతుల హింసించి వధలపాలు చేసెడివారు. కొందరు విశ్వసించి, సాహసించి పయనములు మొదలుపెట్టిరి. ఆ కాలమున స్టీమర్లు లేవు; ఆకాశ విమానములు లేవు. గట్టియోడలు లేవు; సముద్రయానము చేయక భారతభూమిని చేరగల సులభమార్గములు పొడగట్టుట లేదు.

సముద్రముమీద దూరప్రయాణములు చేయుటను వా రెరుగరు. తుపాను లనియును, అవరోధములు కలిగించు ఓడదొంగల దోపిడి యనియును, తప్పించుకొని సురక్షితముగా యాత్రలు సాగించు తెన్ను లేదనియును భయపడుచుండిరి. అయిన నేమి? ధనాశాప్రేరితుల నిరోధింపగల యుపాయము లుండవు.

ఒక నావికాసంఘము ధైర్యము చేసి ఆఫ్రికాఖండపశ్చిమ తీరమువెంట పయనించి ఆ ఖండముయొక్క దక్షిణాగ్రము చేరి యచట హిందూమహాసముద్రమును ప్రవేశించుప్రాంతమున, దురదృష్టవశమున తుపానుగాలులలో జిక్కి, సాహసము చెడి తిరిగిపోవలసినవా రైరి. కొంతకాలమునకు మరొక సంఘమువా రెల్లెట్లో తిప్పలుపడి, కష్టముల కోర్చి ఆ త్రోవనే వచ్చి దక్షిణ భారతదేశముయొక్క పశ్చిమతీరమును చేరిరి. అచ్చటి ప్రభు వగు జామొరినను వారి ననుగ్రహించి యాదరించినాడు. వారు నెమ్మదిగా వర్తకమును ప్రారంభించిరి. ఆప్రాంతమున దొరకు మిరియాలు, లవంగాలు, దాచినిచెక్క, ఏలకులు మొదలగు సుగంధవస్తువులతోడను, సుందరవస్త్రములతోడను, కాలికట్టు రేవునుండి వ్యాపారము చేసెడివారు. కాలికో అనెడు వస్త్రి నామమును పాశ్చాత్యులు కాలికట్టునుండి వచ్చు గుడ్డ యనెడు అర్థముతో వాడుట గల్గినది.

ఈ వర్తకసంఘములవారి లాభముల గాంచి యూరపునందు ఇతర సంఘములు బయలుదేరినవి. కాని ప్రారంభమున వచ్చిన సంఘములవారు తాము కనుగొనిన మార్గముగుండా రానీయ రైరి. కావున ఒక నావికాసంఘమువారు సాహసించి వేరొక పశ్చిమమార్గము ననుసరించి పోయి ఆ యా సముద్రి

ప్రవాహములకును, ఋతుపవనములకును లోనై, తిరుగుళ్ళు వడి యెట్టకేలకు అమెరికా తూర్పుతీరమున నున్న ద్వీపగణ మును జేరిరి. వీరి నాయకుడే అమెరికాను కనుగొనిన సుప్రసిద్ధ కొలంబసు. ఈతడు కనుగొనిన దీవులందును భారతదేశపు తీరమునందలి లక్షణములు గోచరించుటచేత తాను భారత భూమినే సమీపించినటుల నిశ్చయించి ఆ ద్వీపగణమునకు 'భారతద్వీపగణ' మని పేరుపెట్టుట తటస్థించినది. పిమ్మట చాలాకాలమునకు కొలంబసు చేరినది అమెరికాఖండతీరపు లంకలే గాని భారతదేశమునకు సంబధించినవి గావని కను గొనబడినప్పుడు వానికి 'పశ్చిమభారత ద్వీపగణ' మను పేరు నిర్ణయింప బడినది. ఈ యుదంతము లన్నియు యూరపువాసు లాకాలమున భారతదేశముంగూర్చి యేలాటి రూపకల్పనలు చేసికొనెడివారో, యెట్టి స్వర్ణస్వప్నములు గాంచెడివారో స్పష్టముగా తెలుపగలవు.

అనేకపాశ్చాత్యదేశముల వర్తకులు సంఘములుగా నేర్పడి భారతదేశవ్యాపారమువలన నెవరికి వారే లాభము లన్నిటిని గుత్తగొననెంచి, మార్గమధ్యమునను, భారతదేశమునను పోరా టములుసయితము సాగించిరి. ఈ పోరాటములు తుదకు ప్రెంచి వారిని, బ్రిటిషువారిని భారతదేశమున స్థిరపరచినవి. కాలక్రమ మున వీరిలోగూడ బ్రిటిషువర్తకులదే పైచేయి యైనది.

వీరు వేరువేరు రేవులద్వారా మనదేశమున ప్రవేశించి ఆయా ప్రదేశములందలి ప్రభువుల యనుగ్రహమును బడసి, ఒక్కొ క్కప్పుడు విడివిడిగను, ఒక్కొక్కప్పుడు సమాఖ్య లేర్పరచు కొనియు వ్యాపారము చేయుచుండిరి. పోటీలు, స్పర్ధలు, తదను

గుణ్యాము లగు పరస్పరద్వేషములు పెచ్చుపెరిగినవి. చివరకీ స్పర్ధలు వీరినభిమానించి యాదరించిన ప్రభువులనుగూడ నావహించినవి. ఈ వర్తకసంఘములమధ్య చెలరేగిన పోరాటములలో దేశీయప్రభువులును చిక్కుకొనుట తటస్థించినది. వ్యాజ్యములుగాని, జూదములుగాని అసలు కక్షిదారులకంటె వారి నభిమానించు ప్రేక్షకులను తీవ్రావేశపరుల జేయును. అటులనే ఫ్రెంచివర్తకులకును, బ్రిటిషువర్తకులకును ఏర్పడిన కక్షలు వారి కాశ్రయ మిచ్చిన ప్రభువులనే ప్రత్యక్షసంగ్రామములయందు దింపినవి. రణశిక్షణయందును, ఆయుధప్రయోగములందును, హెచ్చుచాతుర్యము గల విదేశీయులు భారతసేనలకు శిక్షకులును, అధినేతలును నై, కాలక్రమమున తామే దేశీయసేనలకు యజమానులుగా పాటింపబడిరి. తమ సేనలను దేశీయప్రభువుల ప్రయోజనముల దీర్చుటకై సహాయముగ పంపగలవారైరి. ఆ ప్రభువులు వీరిసేనల పోషణార్థము విరాళములను, మండలాధిపత్యములను ప్రసాదించుచు వచ్చిరి. క్రమక్రమముగా ఈసైనిక శిక్షకులు సేనాపతులును, స్వతంత్రపరిపాలకులును, రాష్ట్రనాయకులును, సామంతప్రభువులును నై పరిఢవిల్లిరి. ఈ క్రమమునంతను వివరించుట కిది తావుకాదు. వర్తకులకు సహజమగు భేదతంత్రమును సంపూర్ణముగ ప్రయోగించి, బ్రిటిషువారు తామే అధినాథులయి దేశీయప్రభువులను తమకు సామంతులుగ చేయగలిగిరి. ఓడలు బండ్లుగను, బండ్లు ఓడలుగను పరివర్తనము గాంచిన దైనది. బ్రిటిషుజాతి ప్రపంచములో నుత్తమ వణిక్ప్రభుజాతి యని పేరెన్నిక గాంచినది. ఇంగ్లండురాజునకు 'వణిక్ప్రభుడు' (**Prince of merchants**) అనెడి బిరుదుకూడ కలదు. అది వారి విశిష్టగౌరవచిహ్నము.

## 2. వరాలే వైరాలైనవి

బ్రిటీషువర్తకులు భారతదేశమున బ్రవేశించిన విదేశవర్తకులలో చివరివారు. తుదకు వీరే ప్రధానులైరి. ప్రారంభమున వీరు కడు దీనావస్థ నుండిరి. బహువినయముతో దేశీయప్రభువులవద్ద పలుకుబడిగల పెద్దమనుష్యులను వెదకి కనుగొని, వారి ద్వారా ప్రభువుల నాశ్రయించి వివిధములగు కానుకలచే వారిని సుముఖుల గావించుకొనిరి. అందు బ్రిటీషువర్తకుల చాతుర్యము అద్భుతమైనది. భారతదేశప్రభువుల ఔదార్యమునగా సుప్రసిద్ధము. వారి కటాక్షమును సంపాదించు అదృష్టవంతులకేలాటి కొదువయు నుండదు. పాశ్చాత్యులకును, ప్రాగ్దేశీయులకును ఒక ప్రస్ఫుటభేదము గలదని యొకకవివరు డనియున్నాడు. ఒకని యోగ్యత రుజువగువరకును వానిని సంశయాస్పదునిగ జూచుట పాశ్చాత్యుని లక్షణము. ఒకని అయోగ్యత రుజువగువరకును వానిని యోగ్యునిగనే చూచుట ప్రాగ్జనుని లక్షణము. తదనుగుణముగ దేశీయప్రభువులు విదేశవర్తకులను ధారాళముగ నాదరించిరి. నిరాధారులయిన విదేశవర్తకులు ప్రథమమున కొన్ని తావులందు సరకుల కొనుగోలుచేసుకొను వసతులను మాత్రము కోరుకొనిరి. పిమ్మట వస్తూత్పత్తిచేయువారు తమకొరకై సరకులను సిద్ధము చేయు వసతిని, ఆ పిమ్మట ఆ వస్తువులను తమకొరకే ప్రత్యేకముగ తయారుచేసి యిచ్చు నిబంధనలను కోరుకొనిరి. కాలక్రమమున వారికిగాక ఇతరుల కొరకు సరకులను తయారు చేయుట నేరముగ పాటింపబడినది. వారి వ్యాపారము వ్యాప్తి గాంచినకొలదిని వారి అవసరములు పెరుగజొచ్చినవి. వారి అవసరములు పెరుగజొచ్చినకొలదిని

ప్రభువులును హెచ్చు సౌకర్యముల నంగీకరించిరి. ఈవిదేశీయుల వ్యాపారమువలన తమ ఆదాయము పెరుగుట గాంచి సంతుష్టులయిన ప్రభువులు స్వదేశీవర్తకులకు మించిన సముపాయములను వారికి గూర్చుచుండిరి. వారు కొనుగోలు చేయు సరకులను దాచుకొనుటకై గిడ్డంగులు, కొనుటకు స్థలములను నొసగిరి. వారి సరకులమీద విధింపబడు సుంకములను తగ్గించిరి; కొన్ని సందర్భములందు బొత్తుగా రద్దుచేసెడివారుకూడను. గిడ్డంగుల సంరక్షణార్థము భటవర్గమును నియమించుకొనిచ్చిరి. ఆభటులు ఆయుధములను నిరాటంకముగా ధరించుటకు అంగీకరించిరి. పెద్దవర్తకులు తమగిడ్డంగులను కోటలుగా మార్చుట చూచి యుపేక్షించిరి. వారు సామంతరాజులవలె పరిపాలనములు సాగించినను నుపేక్షించిరి. ఈతీరున చంద్రగిరిరాజు ఒసగిన చన్నపురిలో సెంటుజార్జికోట వెలసినది. బెంగాలు నవా బొసగిన కలకత్తాలో ఫోర్టువిలియం వెలసినది. ఇట్టి ఉదాహరణము లింకెన్నియో కలవు.

ఈవర్తకులు తమతో వ్యాపారము చేయువారినిగూర్చిన నిబంధనావళిని వారే కల్పించెడివారు; తగవులు తీర్చు న్యాయస్థానములనూ వారే నెలకొల్పిరి. నిరంకుశప్రభుత్వములను సాగించిరి. దేశీయప్రభువులు తమలో తమకు యుద్ధములు పొసగినప్పుడు విదేశవర్తకుల భటవర్గముయొక్క సాహాయ్యము కోరసాగిరి. మొదట వారికాశ్రయమును ప్రసాదించిన రాజులే వారినాశ్రయించుట విపరీతము. తమ వీలు ననుసరించి ఈ వర్తకులు రాజులపక్షము చూచి విజయలాభములను పంచుకొనెడివారు. యుద్ధఫలితములందు వారికి బాధ్యత లేదు. వాటముగా నున్నంతవరకు ఒక పక్షమున పోరినవారే, వాటము తప్పినప్పుడు

వారివైరిపక్షమున నిస్సంకోచముగ చేరుచుండిరి. ఒక్కొక్కప్పుడు వారే ప్రధానులై యుద్ధములను సాగించిరికూడ. స్వదేశ ప్రభువులు విదేశవర్తకుల చేతిలో కీలుబొమ్మలై పోయి, తమ పక్షమునయుద్ధములుప్రకటించుటకును,రణములసాగించుటకును, సంధులు జరుపుటకును, లాభనష్టములు నిర్ణయించి పంచుటకును సర్వాధికారములను దత్తముచేసెడివారు. పాశ్చాత్యులకు వర్తకముతోపాటు యుద్ధకార్యములవలనను, పరిపాలనాధికారము వలనను హెచ్చులాభములు రాసాగినవి.

తమదేశపువర్తకులు భారతదేశపు సంగ్రామములలో జోక్యము కల్గించుకొనుటను గురించియు, భారతదేశపు ప్రభువులలో కొందఱితోడి విరోధములకు పాల్పడుటను గురించియు వింత వింత కథలు ఆంగ్లదేశమునకు చేరుచుండెను. అచ్చటివారు భీతిల్లసాగిరి. రాజకీయములందు జోక్యము తీసికొనక, వర్తకమును మాత్రమే దృష్టిలో నిడుకొని ప్రవర్తించు డని ఆంగ్ల పార్లమెంటువారు మందలింపులను, హెచ్చరికలను భారతదేశమందలి తమవారికి అందచేయుచునే యుండిరి. ఐన నేమి? వారి పోకడ వారిదే. దేశీయప్రభువుల యుద్ధములలో జోక్యము తీసుకొనుచునే గెలిచినవారియొద్ద పారితోషికములను, ఓడిన వారివలన నష్టపరిహారములను పుచ్చుకొనుచు అపారధనరాసులను ఆంగ్లప్రభుత్వమునకు భారతీయు లిచ్చు కానుకలుగ బంపుచుండిరి. భారతరాజకుటుంబముల ఐశ్వర్యములను దోచుకొని వానినికూడ ఇంగ్లాండునకు బంపుచుండిరి. అందు తమకు జిక్కగల భాగమును తాము పరిగ్రహించుచుండిరి. ఇచ్చట ఓడిపోయిన రాజులను పదభ్రష్టుల గావించుచు వారి స్థానమున దూర స్థలములనుండి తీసుకొనివచ్చిన పాలకులను తమ కిష్టమైనవారిని

పట్టాభిషిక్తుల జేయుచుండిరి. ఇప్పుడున్న భారతదేశసంస్థాన ప్రభువు లందఱు నిటుల బ్రిటిషువారిచే సృష్టిచేయబడినవారే ! ఏప్రభువుగాని తాను పాలించు సంస్థానమునకు చెందిన వంశము వాడు కాడు. ఆ సంస్థానక్షేమలాభములను తనవిగ జూడగల వాడునూ కాడు. విజాతిప్రభువులవలెనే వీరును ఆ సంస్థాన ప్రజలను దోచుకొని అవకాశము లున్నంతవరకు తమ కుటుంబ మును, తాము భోగము లనుభవించుటే లక్ష్యముగ పెట్టు కొనినవారు. ప్రజ లాక్షేపించుచో వారిని రాజద్రోహులుగ శిక్షించుట పరిపాటి అయినది. వీరికి సదా బ్రిటిషుపాలకుల అండ యుండనే యున్నది. కొంతకాలమునకు భారతదేశపు ఆంగ్ల వర్తకులు భారతదేశపాలనయందును, సంగ్రామములయందును విధిగా పాల్గొనవలసియుండుననియు, లేకున్న దేశము శతధాభిన్నమై నశించుననియు దేశీయప్రభువులచేతనే విన్నపములను చేయింప సాగిరి. పార్లమెంటువారికి చెవు లున్నవేగాని కండ్లు లేవుగదా! ఈదేశమున నున్న తమ వర్తకులు చెప్పినదే వారి కాధారము. స్వయముగ కండ్లార జూడగల అవకాశము ఆఱువేలమైళ్ళ దూర మున నున్నవారికి సాధ్యము కాదయ్యె. కావున ఇచ్చట స్థానిక ముగ నుండి పరిపాలనము నడుపువారికి నిరంకుశాధికారమును నిడునక తీరినది కాదు. ఎంత విపరీతము! దీనులై సామాన్య వర్తకులుగా వచ్చి దేశీయప్రభువుల ప్రాపకము సంపాదించు కొని, దేశమున కాలూనగల్గి ధన్యతగాంచినటుల భావించుకొనిన బ్రిటిషుబేరగాండ్రు సేనాధిపతులై, సామంతులై, రాష్ట్రాధి పతులనిర్మాతలై, స్వతంత్రప్రభువులై, సామ్రాజ్యము నొకదానిని సృష్టించిరి. దేశీయప్రభువుల ఆశ్రితులు వారిపైన అధినాథులైరి. వారి ప్రాపకము సంపాదించుకొనినవారు వారిపై శత్రుత్వము

వహించి వారిని నిర్జించి యదలించి పట్టిరి. మొదట వరప్రసాదములైనవి తుదిని వైరములకు మూలములైనని. ఆంగ్లప్రాంతీయవారి ఆమోదాధికారమును బడసిన భారతదేశమందలి బ్రిటిషువర్తకులు పరిపాలనము సాగించు ప్రభువు లయిరి. వణిక్ప్రభువులకు తృప్తి యనునది చాలదూరము. నిరంకుశాధికారమిప్పుడు వారిచే జిక్కినది. దేశీయప్రభువులు పరస్పరము సఖ్యతలేనివారైరి. మరియు నిరంతరయుద్ధములవలన దుర్బలురై పోయిరి. చాలామంది మొహమాటమువలన బ్రిటిషువారికి తనచర్యలను అరికట్టరైరి. మఱికొందఱు వారిబలగములచూచి భీతిల్లిపోయి వారిచేతులలో కీలుబొమ్మలై మెలగుచుండిరి.

ఇట్టిసందర్భమున ప్రజలస్థితి దుర్భరమనుట నిస్సంశయము. వారి మొఱ లాలించువారు లేరు. అందరికిని పైయధికారులు బ్రిటిషువా రనియు, ప్రజల సుఖదుఃఖములు బ్రిటిషుపరిపాలకుల చేతిలోనుండు ననియు వెల్లడియైనది. ఆ బ్రిటిషుపరిపాలకులు సేనలలో చేరిన భటులను, ఉద్యోగులను, దేశీయవర్తకులను, కార్మికులను, కృషికులను ఎల్లరను నిర్దాక్షిణ్యముగ చూడసాగిరి. ప్రజ లేవిధమునను సంఘీభావముతో మెలగుట వారికి గిట్టదయ్యెను. విభజించి పరిపాలించు డను సూత్రమును సోదాహరణముగ ప్రయోగించుచుండిరి. పరిపాలన మంతయు కేంద్రీకృతమై గవర్నరు జనరలు చేతిలో నుండెను. అతడు గాని, ఉన్నతోద్యోగులు కాని ప్రజలకు సులభముగ సమీపింప వీలుగానివారైరి. భిన్నభిన్నములై యున్న ప్రజలు కేంద్ర ప్రభుత్వమునెడ నందరకును గల సామాన్యద్వేషము వలన వాస్తవమగు నైక్యభావము లేకున్నను ప్రభుత్వము మీద తిరుగుబాటు చేయుటకై ఏకీభవించిరి. బహిరంగముగ విప్లవము

సాగించుపాటి ధైర్యసాహసములును, వసతులును లేని వారు గావున రహస్యపు తిరుగుబాటు నేర్పాటు చేసుకొనిరి. ఈ తిరుగుబాటులో సిపాయిలు ప్రధానపాత్ర వహించిరి. ప్రభుత్వసేనలయందు హిందువులు, ముసల్మానులు, శిఖ్ఖులు, తదితరులు అందరున్నను దేశీయసేనాపతుల తెలివి తేటలవలన నెవరికి వారే చేటలోని వెలగపండువలె నుండిన కారణమున వారివిప్లవము భిన్నమైనది. ఈవిజయమును సాధించిన సర్ జాన్ లారెన్సుప్రభువు వైస్రాయిగ నియమింపబడెను.

సర్ జాన్ సిలీ 'ఇంగ్లాండువిజృంభణము' అనుగ్రంథమున "ఇండియాలోని వివిధసంఘములవారిని ఒండొరులయెడ వైరులుగా నొనర్చుటమూలముననే చాలవరకు విప్లవమును అణచగలిగితిమి అని మీరు గ్రహింతురుగాక" అని వ్రాసియున్నాడు. బ్రిటిషుగవర్నమెంటువారు భారతదేశమునందలి వివిధసంఘములవారిని కేంద్రీకరించి గుమిగూర్చి యైక్యతను సాధించి ఏకజాతిని నిర్మాణమును చేసి రనుచు వాదించువారీ సిలీమహాశయుని ప్రవచనమును జ్ఞప్తియందుంచుకొందురుగాక. విప్లవము భగ్నమైనపిమ్మట సర్ డబుల్యూ డబుల్యూగారిట్లు వ్రాసియున్నారు. "ఇప్పుడు సైనికోద్యోగములు ముసల్మానుల కెంతమాత్రమును చిక్కకుండ చేయబడినవి. ఉత్తమవంశీయులగు ముసల్మాను లెవరునూ సైనికగణములలో చేర వీలులేదు. కొంతమంది ముసల్మాను పెద్దమనుష్యులు మాత్రము గవర్నరు జనరలుగారినుండి కమీషనులు పొందగల్గిరి. అయినను నాకు తెలిసినంతవరకు విక్టోరియా మహారాణిగారినుండి కమీషనులు పొందినవారు లేరు."

సిపాయివిప్లవానంతరము ముసల్మానులెట్లు వృద్ధికిరాకుండ గవర్నమెంటువారివలన నిరోధింపబడిరో గ్రహించుటకు నిదర్శనము లింకను గలవు. ఈ సిపాయిపితూరిపిమ్మట విక్టోరియారాణి భారతదేశపరిపాలనమును ప్రత్యక్షముగ చేపట్టినటుల మహాప్రకటనము నొకదానిని చేసినది. భారతప్రజల నెల్లరును సమముగ జూతుమని వాగ్దానము చేసెనది. కాని ఆరాణియొక్క ప్రతినిధులై భారతదేశమున పరిపాలనము జరుపువారు సూత్రము ముసల్మానుల నడచిపెట్టియే యుంచిరి. తమకు పూర్వమున్న చక్రవర్తుల వంశమువారని, వారి బంధువులునగు ముసల్మానులను నమ్మజాలక ఒకకంట గనిపెట్టుచునే యుండిరి.

## 3. రక్షణప్రాకారములు

సిపాయివిప్లవమువలన భారతప్రజలు బ్రిటిషువారిపరిపాలనమును ప్రేమించుటలేదని పార్లమెంటువారు గ్రహించిరి. భారతప్రజను లాలించినగాని తమ వ్యాపారము సరళముగ సాగదని తెలిసి విక్టోరియారాణియే భారతదేశపరిపాలనమును చేపట్టుననియు, నిష్పక్షపాతముగ నెల్లఱ నాదరించి సమత్వముతో పాలించుననియు మహాప్రకటనమును చేయించిరి. విదేశవర్తకులు స్వదేశవర్తకులతో నక్రమపు పోటీలు చేయకుండ నాపుదుమనిరి. సైనికోద్యోగములందును, సివిల్ ఉద్యోగములందును, తగినయోగ్యత లున్నచో విచక్షణలేక యెల్లరు నన్నింటికి నర్హులుగ జూడబడుదు రనిరి. మతవిషయములందును, సాంఘికాచారముల సందర్భముననను, దొరలనమువారేలాటి జోక్యమును కల్పించుకొన రనిరి. సంస్థానాధిపతు లెల్లరును సామంతప్రభువులుగ పాటింపబడి కేంద్రప్రభుత్వముక్రింద స్వతంత్రులై

వర్తింపగల రనిరి. ఇంత యేల? భారతదేశక్షేమమే బ్రిటను దేశపు క్షేమముగ నెంచబడు ననిరి. సంతతసంగ్రామములతో నలసి విసిగి వేసారియున్న సంస్థానాధీశ్వరులును, దేశముయొక్క కల్లోలపరిస్థితియందు వ్యాపారముసాగక చితికియున్న వర్తకులును, పక్షపాతములకు లోనై పీడల పాలగుచున్న ఉద్యోగిగణమును, పేదలై పనిపాటలు సాగక కుందుచున్న ప్రజాసామాన్యమును సంతసించిరి. రాణీగారి మహాప్రకటనమును మహాప్రసాదముగ నఖిలజనులును స్వీకరించిరి.

బ్రిటిషుసింహాసనము భారతభూమిని నెలకొనుట యసామాన్యపు టదృష్టమని భావించిరి. ఈయద నెఱింగి బ్రిటిషు సింహాసనము సుప్రతిష్ఠితమై, సురక్షితమై యుండునటుల బ్రిటిషు వారు సప్తప్రాకారములను నిర్మించుకొని రననగును.

ఈ ప్రాకారములలో మొదటిది సంస్థానాధిపతుల శ్రేణి. ఈ సంస్థానప్రభువులు తమతమ సంస్థానములలో విదేశీయులై ప్రజల యభిమానములేనివారు. మరియు వారు బ్రిటిషుప్రభువులవలన సృష్టింపబడినవారు. గారాబంపు మొఱటు బిడ్డలు తల్లిచుట్టూ చేరి అల్లరుచేయుచు, శత్రువుల భయము కల్గినప్పుడెల్ల తల్లినిగూర్చి వాపోవునటుల వీరు నిరంతరమును విలాసపరాయణులై ప్రజలయెడ తమధర్మ మేదియో గ్రహింపక వర్తించుచుందురు. ప్రజలవలన అలజడి గలిగినప్పుడు కేంద్ర ప్రభుత్వమువైపు చూచుచుందురు. ఈ తీరున భారతప్రజలలో సుమారు సగమువరకు సంస్థానాధిపతులద్వారా బ్రిటిషు ప్రభుత్వస్వాధీనమై పడియుండిరి. ఈ సంస్థాన ప్రభువుల యునికి భారతదేశమున బ్రిటిషుసింహాసనమును స్థిరముగ

నుంచుటకును, సకలవిభూతులతో తళతళ లాడుచు తౌరయు టకును సాయపడుటచేత వీరిని కేంద్ర ప్రభుత్వమువారు మిక్కి ప్రేమతో పెంచుకొనుచుందురు. సామ్రాజ్యసభలందు ఉత్తమ స్థానముల నలంకరింప జేయుచున్నా, ఆడంబరము లగు బిరుదావళుల ప్రసాదించి, తత్సంబంధమగు సలంకారములతో కంట్లు మిఱుమిట్లుగొల్పుతీరున వెలుంగజేయుదురు. వారు చూపు ప్రభు భక్తి ననుసరించియు, వారుచేయు ప్రభుసేవల ననుసరించియు, తారతమ్యసరళిని గౌరవములను, నధికారములను, స్వాతంత్ర్యమును నొసగుచుందురు. సంస్థానాధిపతు లీ సౌకర్యసంపదల చూచుకొని పొంగిపోవుదురు. తమసంస్థానప్రజల నెట్లు పీడించినను కేంద్రప్రభుత్వపదవికి హాని లేనంతవరకు ప్రమేయము కల్పించుకొనకుండుట గాంచి తాముస్వా సామ్రాట్టుల మని భ్రమింపుదురు. ఈ సంస్థానాధిపతులు తమలో తాము ప్రేమించుకొని, గౌరవించుకొని, మైత్రిసలుపుకొను వసతు లేమాత్రము లేవు. వారిలో ఒక్కరిద్దరు కలియుటగాని, సంభాషించుకొనుటగాని, సంబంధబాంధవ్యముల నెఱపుకొనుటగాని కేంద్రప్రభుత్వప్రతినిధి అదుపులోనే! వాని అనుమతి లేదా తమయభీష్టము వదలుకొనవలసినదే. ఇట్టి సంస్థానాధిపతులు—ధోటా సామ్రాట్టులు, దాదాపు ఆరువందల యరువదిమంది యున్నారు. వీరి రాజ్యములలో, హైదరాబాదు, బరోడా, మైసూరు, తిరువాన్కూర్ సంస్థానములు పెద్దవి. మిక్కిలి చిన్నవి ఒక్కపల్లెయంతవైనను నుండవు. వాని ప్రభుత్వాదాయము వందరూపాయలకు మించదు. ఐనను వీరందరును భారతదేశమున బ్రిటిషువారు కట్టుకొనిన కోటలకు బలము

నొసగు బురుజులే యనందగును. బ్రిటిషుపాలకులు భారతదేశ మును వీడిపోదురనిన వీరిగుండె యావటిలిపోవును.

విదేశవర్తకులు, మిషనరీలు రెండవప్రాకార మనందగును. వర్తకుల ననుసరించి మిషనరీలు, మిషనరీల ననుసరించి వర్తకులు ప్రవర్ధనము గాంతురు. ముందుగ నీవర్తకుల ప్రాధాన్య మెట్టిదో చూతము. ఈ వర్తకులయెడ పాలకులకు ప్రత్యేకాభిమానము గలదు. బ్రిటిషువారికి వర్తకాభివృద్ధికి మించినదిగాదు ప్రభుత్వగరిమ. కావున బ్రిటిషువర్తకులు విశృంఖలముగ వర్తింపగల్గుచున్నారు. శాసనసభలందు వీరికి ప్రాతినిధ్యము మెండు. ఏశాసనము చేసినను వీరివాణిజ్యప్రయోజనములు భంగపడరాదు. వారిసమపాయములకొఱకై, రైళ్ళు, హార్బర్లు, రోడ్లు, సైనికదళములు, నన్నియు నిర్మాణమైనను, పోషింపబడినను, వృద్ధిచేయబడినను. కాని ఇవన్నియు భారతప్రజానీకముయొక్క సౌకర్యముల కొఱకే యని చాటుచుందురు. అందువలన వీని నిర్మాణమున మితిలేని ధనరాసులు వ్యయముచేయబడుచున్నవి. ప్రాకృతజనులును, విదేశవర్తకులక్రింద దళారులుగా దిరుగు స్వదేశవర్తకులును ఈ ప్రకటనలను నమ్మెదురు. సత్యమా? విదేశసరకులు దేశమున వ్యాపించుట కనువగు రీతిని రేవుస్థలములనుండి యా సరకులను దేశములోపలి పలుదిశలకు తీసికొనిపోవుటకు రైలుచార్జీలు తక్కువ. అటులనే ముడిపదార్థములను విదేశములకు బంపునెడల వానిని దేశములో పలుతావులనుండి సముద్రపురేవులకు చేర్చుటకు రైలుచార్జీలు కూడ తక్కువయే. కాని సిద్ధవస్తువులను దేశీయులు విదేశములకు బంపు నిమిత్తము నౌకాశ్రయములకు చేర్చవలయునన్న రైళ్ళమీద ముడిపదార్థములకన్న తక్కువ స్థలమాక్రమించినను

బరువుపందు భేదము లేకున్నను చార్జీలు హెచ్చు. ఉదాహారణము నొకదానిని తెలిపెదము. నాగపూరునుండి టన్ను నూలను బొంబాయి చేర్చుట కెంత చార్జియగునో, అంతకన్న టన్నునూనెగింజలను చేర్చుటకు రైలుమీద హెచ్చుస్థలమే యాక్రమించినను కూడ చార్జీలు చాలతక్కువ. టన్ను విదేశీ నూలను బొంబాయినుండి నాగపూరునకు చేర్చుటకుకూడ చార్జీలు తక్కువయే. ఈ విచక్షణ దేశీయ పారిశ్రామికులు ముడిపదార్థములనే విదేశములకు బంపి వానితోడ తయారైన సిద్ధవస్తువులను తాము దిగుమతి చేసికొనుటే లాభప్రదముగ నొనర్చును. ఇచ్చటనుండి పంపిన నూనెవిత్తులనుండి నూనెను తయారుచేయు పరిశ్రమను నష్టదాయకముగ చేయును. దేశములోని వాడుకకొఱకై నూనెను వివిధభాగములకు రైళ్ళమీద హెచ్చుచార్జీలను భరించి పంపు వ్యాపారమునకన్న నూనెగింజలను తక్కువచార్జీలతో విదేశములకు దీసుకొనిపోయి నూనెను సిద్ధముచేసి తెచ్చి, తక్కువ రైలుచార్జీలతో దేశమందు వ్యాపింపజేసి తక్కువధరకు విక్రయింపజేయు విదేశముల వ్యాపారము లాభకర మగుటవలన దేశీయపరిశ్రమలు పరోక్షముగ నిరుత్సాహపరుపబడుచున్నవి. మఱియును విదేశపరిశ్రమలు ప్రత్యక్షముగా ప్రోత్సహింపబడుచున్నవి. ఇదియొక్క ఉదాహారణముమాత్రమే.

హార్బర్లు మొదలగువానికి అశేషధనరాసులను భారతదేశ ప్రభుత్వము వ్యయముచేసి నిర్మాణముచేయించినను వానిపరిపాలనమున విదేశీయులదే సర్వాధికారము. వారు వాని నిర్మాణమునందును, పరిపాలనమునందును విచ్చలడిగ హెచ్చు ధనరాసులను ఖర్చుచేయుదురు. ఏ దేశమునందును లేనంత హెచ్చు

జీతముల నిచ్చి తమవారిని ఉన్నతోద్యోగములందు నియోగింతురు. వీనియుపయోగము ప్రధానముగా విదేశవర్తకులదే.

రైళ్ళ నిర్మాణము, పరిపాలనముకూడ విదేశీయుల హస్తమందే యుండును. అందుకగు వ్యయ మంతటికిని విదేశీయములగు కంపెనీలు పెట్టుబడి పెట్టుచున్నారు గాన నటు లగుట న్యాయమే అందురు. వా రెంత వ్యర్థావ్యయములు చేసినను తమవారికే యున్నతోద్యోగముల నిచ్చుకొనుటయు, హెచ్చు జీతముల నిచ్చుకొనుటయు మన మాక్షేపింపదగిన కార్యములు కా వందురు. కావున భారతశాసనసభ్యులు తమసలహాల నిచ్చిన నీయవచ్చునే గాని, రైళ్ళసంబంధమైన బడ్జట్టులను (ఆదాయ వ్యయముల పట్టికలను) మార్చుచేయు నధికారమును కోరుట న్యాయము కా దందురు. చూపుల కీవాదన సమంజసముగనే తోచును. ఈవాదన కంతకును పెట్టుబడిధనము విదేశీయకంపెనీల దనుటయే ఆధారము. ఈపెట్టుబడులు కోట్లకుకోట్లుగ నున్నమాట నిజమే. అధనము విదేశీయవాటాదారుల దెట్లగును నదో విచారింతుము.

విదేశీయు లనగా బ్రిటిషువారే ప్రధానులు. ఈ దేశమున రైళ్ళు, వ్యాపారము, కార్ఖానాలు, సిలిమందుచేలు మొదలగువాని కగునిధులు బ్రిటిషువారిపేర నుండుట నిజము. ఉన్నతోద్యోగు లెందరో ఆరువేలమైళ్ళదూరమునుండి వచ్చి భారత ప్రభుత్వసేవయందు పనిచేయుచుండుటయును నిజమే. ఇంత త్యాగము చేసినవారికి అవాంతరము లేనైన వచ్చి నష్టములు రాకుండ గాచుటకొరకై సంరక్షణనిధిని భారతప్రభుత్వము వారు లండనులో నుంచుచుండు. ఈనిధి కొన్నివేలకోట్లు దాటినది.

ఈధన మంతయును భారతప్రజ లిచ్చుకొను శిస్తులు, పన్నులు మున్నగువానినుండి గైకొనబడినదియే. ఇక రైళ్ళు మొదలగు నవి ఎవరిప్రయోజనముకొరకను విచారణను అటుంచి వానిపెట్టుబడి బ్రిటిషరులది గాన, దానికి హామీ యుండవలె ననుటను విచారింతము.

భారతీయులను నమ్మి కోటానుకోట్ల ధనరాసులను భారత దేశమున వెచ్చించుటకు బ్రిటిషరులు వెనుకాడరట! వారిని ప్రోత్సహించుటకై లండనులోని భారతప్రభుత్వనిధినుండి స్వల్పపు సుమారు 20% వడ్డీకి బ్రిటిషుకంపెనీలవారికి అప్పుల నిచ్చిరి. అటుల అప్పుపెట్టిన ధనమును ఆకంపెనీలవారు భారత దేశమున తమపేర పెట్టుబడిగా పెట్టి రైళ్ళు మున్నగువానిని నిర్మించి పరిపాలించుచున్నారు. ఈపెట్టుబడిసొమ్ము ఎవరిదో! దానిరహస్య మిటు లున్నది. ఇకను ఈ వ్యాపారమున నష్టము వచ్చునెడల బ్రిటిషుకంపెనీలు భరించి పడవలసినదే గదా ? అటుల గాదు. ఉదారులగు భారతప్రభుత్వమువా రుండిరి. ఆకంపెనీలకు నష్టములు వచ్చునెడల హానినంతను భరించుటకే గాక ఆపెట్టుబడిమీద నూటికి నాలుగు, అయిదు చొప్పున లాభమును కట్టియిచ్చుటకును హామీ (గ్యారంటీ) నిచ్చిరి! ఇక నేమి ? ఈరైళ్ళు మొదలగువాని పరిపాలనమున మితిలేని దుర్వ్యయములు సాగుచున్న వనిన నాశ్చర్య మేమున్నది ? అన్నికర్చులందును దుబారాలే !

ఇక మిషనరీల విషయ మొకింత చూతము. వీరును విదేశ వర్తకులకు అండగా వచ్చినవారే. వీరు మతప్రచారముపేర జాతీయభావములను, ఐకమత్యమును రూపుమాపిరి. వ్యక్తి

స్వాతంత్ర్యము పేర సహకారసానుభూతులను శూన్యము చేసిరి. తమమత మొక్కటియే సత్యమనియును, తక్కిన మతము లన్నియును మూఢవిశ్వాసరాశి యనియును బోధింపుచు ప్రభుత్వము తమ కొసగు గౌరవస్థానమును, ప్రాధాన్యమును అంకెగాగొని, ఇతరుల కెవరెకిని లేని యుత్తమార్హతల నవ్యారిగ ననుభవింతురు. భారతదేశపు మతసంస్థలకు సాయపడగోరునెడల 'ప్రభుత్వము మతవిషయములందు జోక్యము తీసికొనరా' దను మిషతో నిరాకరించు బ్రిటిషుఇండియా ప్రభుత్వము మిషనరీలకు సర్వవిధముల సాయపడుదురు. ఆయారాష్ట్రములం దుండు బిషప్పుల జీతభత్యములను దొరతనపు బొక్కసమునుండి యొసగుదురు. దేశీయులందు జాతీయాభిమానమును పెకలించివేయు మిషనరీలు రాజభక్తిని ప్రచారము చేయుదురు. పాలకజాతి 'భగవంతుని ప్రియజన'మనియు, తత్కారణముననే బ్రిటిషు సామ్రాజ్యమున నెన్నడును సూర్యుడ స్తమింపజాలనంతగా దేవుడు వారిని అనుగ్రహించు ననియు చాటుదురు. మిషనరీలును తాము పాలకజాతికి చెందినవార మనియో, వారి సంబంధీకుల మనియో గర్వము జూపుచు పాలితజనముపట్ల నిరసనభావము చూపుచుందురు. దొరతనమునెడ జూపునంత భయమును ప్రజలు వీరియందును జూపుచు వీరలు చూపు నిరసనమును భరింతురు. వీరివలన మతాంతరులుగ చేయబడిన దేశీయులు సయితము వీరిబలమును చూచుకొని పూర్ణముగ నర్ధముగాని, జీర్ణముగాని చేసికొనజూడని మతబోధల సాకుబెట్టుకొని స్వజాతి సోదరులను నిరసనముతో జూతురు. తాము కేవలము పాలకజాతివార మని భ్రాంతిపడకున్నను భారతీయులకన్న నుత్కృష్టజాతిలోనికి ఉద్ధరింపబడితిమన్న భావముతో వేఱుపడి

జీవింతురు. ఇట్టి మతాంతరస్వీకరణముచేయువారు ముఖ్యముగా నిమ్నజాతులవారు గాన మిషనరీలు విజయవంతులమాట్కి— లోకమున వెలుగుచున్నారు. 'సూనాసముగ మతము పుచ్చుకొన్నవారికి సీమాలు పుండు' అను సామెతగలదు. తదనుగుణ్యముగ దేశీయక్రైస్తవులు దేశీయులను హేళనము చేయుటలోను, దేశీయాచారములను నిందించుటలోను, పరదేశీయప్రభువులయెడ రాజభక్తిని నల్లసించుటలోను, అసమానులనదగి వర్తింతురు. ఈతీరున విదేశీవర్తకులును, మిషనరీలును బ్రిటీషుపాలకులకు పెట్టనికోటగా గణనకు వత్తురు.

మూడవరక్షణప్రాకారముగా విదేశవ్యాపారము చేయు దేశీయవర్తకులను చెప్పుకోదగును. వర్తకులెక్కడ నున్నను వర్తకులే. వారికి ధనసంచయమే ప్రధానము. ఈదినములలో పాశ్చాత్యనాగరికతయొక్క సంస్కరణము గలిగినపిమ్మట 'ధనమూలమిదం జగ' త్తను సూత్రము భారతదేశపు జనసామాన్యమును, అందు ముఖ్యముగా వర్తకసంఘములను నావేశించినది. విదేశవర్తకులు వచ్చుటకు పూర్వము సిరలే దేశీయవాణిజ్యమును నడుపుట మితిలేని కష్టమని భావింపుచుండిరి. బ్రిటిషువర్తకులు దేశమున స్థిరపడి, దౌరతనమువారి అనన్యసామాన్యాభిమానమును చూరగొని విదేశవాణిజ్యమునంతను తమచేతులలోనికే దీసికొనిరి. దేశీయవర్తకులకు వచ్చుచుండిన లాభములను వారికి ముట్టచెప్పుచు తమక్రింద ఏజంట్లుగా నుండుటకై ఒడంబడిక చేసికొనుట వారి కంత కష్టమైనపనిగా లేదు. వీరికిని ఆఏర్పాటు సుఖప్రదముగనే తోచినది. కొంచెము హెచ్చుతగ్గులుగా పూర్వపు లాభములు తమకు వచ్చుట నిశ్చయమని గ్రహించి వీరు తృప్తిపడిరి. ఇప్పుడు ప్రధానులగు

వ్యాపారులు బ్రిటిషువారు. విదేశవ్యాపారముకొరకై దేశమున వస్తూత్పత్తి మున్నగు కార్యములన్నియు వారినిమిత్తమే జరుగుచుండెను. సరుకులను సిద్ధముచేయువారితోడ చేసికోవలసిన ఖరారులు, వ్యాపారమునకు సంబంధించిన నిబంధనలు అన్నియు దేశీయవర్తకసంఘములద్వారా అమలుజరుగుట దేశభాషల నెఱుంగని విదేశవర్తకులకు సుకరముగనుండెను. దేశీయశిల్పులు, పారిశ్రామికులు, కర్షకులు మొదలగువారికిని విదేశవర్తకులకును మధ్య దళారులుగా నుండు దేశీయవర్తకులు విదేశీయజమానుల తృప్తిపరచుటకై అన్యాయములు చేయుటకుసయితము సంకోచింపరైరి. గిట్టుబాటుకాని కూలికి గుడ్డ నేసి యీయగలమను ఖరారుపత్రములపై అక్షరజ్ఞానములేని సాలీలచేత వ్రేలిముద్రలు వేయించి, ఆవరతులచొప్పున సరకులను సిద్ధముచేయని పక్షమున వారిని శిక్షింపచేయుటలో తోడ్పడెడివారు. న్యాయస్థానములు విదేశీవర్తకులకొఱకై వారిజాతీయులేయగు ప్రభుత్వోద్యోగులతో నిర్మింపబడినవని యీసందర్భమున జ్ఞప్తియందుంచుకోవలయును. ఇక ప్రజల మొఱల నాలించువా రెవరు? నీలిమందుచేలలో సేద్యము చేయుటకు, కాఫీ, టీ, తోటలలో పనులు చేయుటకు కుదిరిన కర్షకులయు, కూలీలయు గతియు నిట్టిదే. ఇవి యుదాహరణములుమాత్రమే. ఈవ్యాపారసరళి బ్రిటనుకు లాభదాయకమును, భారతప్రజలకు వినాశదాయకమునై సాగినది. ఈ ఘోరపరిస్థితిని, అందు దేశీయులగు దళారుల దుష్కృత్యములను వివరించుచు విపినచంద్రపాలు డిట్లనెను:

"బ్రిటనుకు లభించిన ప్రతిదమ్మిడీలాభమును భారతదేశము కోల్పోవలసినదే. భారతదేశమునకు లభించు ప్రతిదమ్మిడీ లాభము బ్రిటను కోల్పోవలసినదే. ఇట్లుండ ఈరెండుదేశముల

మధ్య జరుగు వ్యాపారమునకు న్యాయము జరుగుచు లేదు. కాల క్రమమున స్వదేశీపరిశ్రమలు క్షీణించుటకును, దేశమున దారిద్ర్యము తాండవించుటకును, విదేశీయులు పెద్దఎత్తున దోపిడులు గావించుటకును, చీకటిబజారులు పెరిగిపోవుటకును, విదేశీసరకులు దేశమంతటను మూలమూలల వ్యాపించుటకునూ పాయపడిన మనసహకారులతోపాటు ఈ దేశములోని బ్రిటిషు ప్రభుత్వమునకు దుర్భాగ్యముగ నేటి నేర్పడిన సమూహ, నిట్లు సూచన చేసిన చాలును. యుద్ధసమయమున ధరల నమితముగా పెంచి, ప్రజలకు తిండిపదార్థములు సుతము కరవగు నటుల జేసి తాము కుబేరులు గాగాంచిన దేశద్రోహులు లనిన దోషమూ! వీరి యాటల సాగనిచ్చుచు లక్షలకొలది ప్రజ మరణించుచున్ననూ చోరతనమునకు దుస్తులతో చూచుచుండిరి."

భారతసైనికగణములు మఱొక దుర్గము. ప్రపంచసంగ్రామమునందు పరరాజభయంకరమై సుప్రసిద్ధిగాంచిన మనసేనలు మొట్టమొదట విదేశీయ రక్షకుల సంఘముల గాచుటకు నేర్పడిన భటవర్గమే యని సూచించియుంటిమి. అవి బ్రిటిషువారి ప్రయోజనముల రక్షించుటకొరకు నేర్పడినవే గాక దేశప్రజల నడంచిపెట్టుటకును నుపకరించినవి. విదేశీయప్రభువులు ప్రారంభమువలన నంగీకరింపబడిన రక్షకభటసంఘములు వారిని పద భ్రష్టుల గావించుటకు సాధనము లైనవి. వారున్నస్థితి తెలియు నెడల మాతృదేశవినాశమునకు తోడ్పడుట సంభవించునని యోచించిన విదేశప్రభువులు సైనికులను జనసామాన్యముతో కలసిమెలసి యుండకుండ వారి నివాసములను, వారి ప్రచార స్థానములను, వారి జీవనచర్యలను భిన్నముగ చేసి దూరముగ నుంచుచుండిరి. ఎవరికన్నను వారి వ్రేలితోనైన తాకుచుట సాధ్య

పడదుగదా ! కాని యీకార్యమును బ్రిటిషుపాలకులు భారత దేశమున చేయజాలిరి. సేనలు భారతప్రజతో నేర్పడిన వైనను వారు భారతప్రజను పెరవారలనుగను, విజాతివారిగను సర్వవిధ ముల సంశయదృష్టితో చూడదగినవారినిగను భావించునటుల వారికి కడుచమత్కారముగ శిక్షణ నొసగెడివారు. ఇతర యుద్యోగిగణమున కొసగు జీతములకన్న హెచ్చుజీతములను సైనికుల కొసగుదురు. అనేకములగు సదుపాయములను చేకూ ర్తురు. వారు సలుపు అత్యాచారములను సామాన్యముగ మన్నింతురు. విధిలేని పక్షమున తేలికదండనలతో విడిచి వేతురు. వారిని అత్యధికముగ పొగడుదురు. సామ్రాజ్యవైభవ మంతయూ వారిదే యనునటుల విచిత్రప్రదర్శనములు గావిం తురు. చిత్రవిచిత్రాలంకారములతోడను, బిరుదములతోడను సైనికోద్యోగులను భ్రమింపచేయుదురు. 1857 సం॥ న సంఘ టిల్లిన పెద్దసిపాయిల విప్లవమును భారతసైనికులచేతనే అణంచ గల్గిరనిన వేఱుగ చెప్పవలసిన దేముండును ? ఆవిప్లవము నణంచుటలోను, అందు పాల్గొనిన వీరులను పలువిధములుగ హింసల పాలుచేయుటలోను సాయపడిన వారిని బహుభంగుల బహూకరించిరి.

## 4. రక్షణప్రాకారములు

సివిల్ప్రభుత్వోద్యోగులు ఐదవరక్షణశ్రేణి యనదగును. ఈ ఉద్యోగులు విదేశీవారైనను భారతీయులైనను ప్రభుభక్తి ప్రధానముగా జీవించువారే. ప్రభుత్వము ప్రజోపయోగము కొఱకు ప్రజానుమతితో నేర్పడవలసియుండగా, భారతదేశము నందలి బ్రిటిషు ప్రభుత్వము ఇంగ్లాండు క్షేమముకొఱకు

ఈ దేశీయుల పీడించునదిగా నేర్పడియున్నది. ఉద్యోగులకు ప్రజాసేవ ప్రధానముగా నుండవలసియుండగా ప్రజానురాగము లేని విదేశప్రభుత్వమునెడ భక్తి ప్రధానదీక్ష యైనది. ఉన్న తోద్యోగములలో ప్రధానములగువానియం దెల్లెడను విదేశీయులే నియమింపబడుదురు. తక్కిన యుద్యోగు లందఱును ఈ యున్నతోద్యోగుల కింకరులై మెలంగుచు, నోరు మెదపక వారియాజ్ఞల నెట్టివైనను నెరవేర్చుచుందురు. ప్రభుత్వనిర్వహణమునందు ప్రజల కెంతమాత్రమును నధికారము లేకున్నను ధారాళముగా విమర్శించి సంసస్కరణమార్గములు చూపు నధికారమును లేదు. మీదు మిక్కిలి ఉద్యోగకార్యాలయములయం దేమిజరుగుచున్నదో తెలిసికొను నవకాశములును లేవు. ఉద్యోగులు ప్రభుత్వకార్యాలయములలో జరుగుదానిని ప్రజలకు వారు కోరినను తెలుప వీలులేదు. ప్రభుత్వోద్యోగ రహస్యరక్షణ శాసన మొక్కటి ఎల్లరి వాక్కును బంధించి వేసినది. ప్రజలు అజ్ఞానాంధాకారమున మునింగి విదేశీయుల పోటీవలన వృత్తులు, వసతులు కోల్పోయి, నిస్సహాయులై కుందుచుండిరి. ప్రభుత్వోద్యోగు లెవ్వరును ప్రజలను లక్ష్యపెట్టరు; వారి యోగక్షేమములు విచారింపరు; వారివంకజూడరు. ప్రతియుద్యోగియును భారతదేశపరిపాలనకు సారథి యగు "సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా" యనుపేర లండనులోనుండి కేంద్రప్రభుత్వాధికారమును నెఱపు నుద్యోగి యొక్క యంశభూతుడై పరిగును. ఏయఖియోగము సంభవించినను సరియే, ఒకపౌరునికిని ఒకఉద్యోగికిని తగవు వచ్చినయెడల న్యాయస్థానములో ఆయుద్యోగి వ్యక్తిత్వేనగాక "సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా" యొక్క ప్రతినిధిగా ధీరుడై నిలచును.

ప్రతి చిన్న ప్రభుత్వచర్యయును కేంద్రప్రభుత్వచర్యలోని యంశముగా పాటింపబడును. అట్టిచర్య ఎంత స్వల్పమైనను ప్రజలు దాని నెదిరించుట దుర్లభము. ఏయుద్యోగిచర్యనైనను నాక్షేపింప సాహసించి ఆప్రభుత్వోద్యోగు లధిష్ఠించు న్యాయస్థానమున దురదృష్టవశమున రుజువు చేయజాలకపోయినచో అతడు రాజద్రోహిగా పరిగణింపబడును. ఎందరెందరో దేశాభిమానులు ప్రభుత్వపు లోపములను సవరింపబూనిన సాహసమునకై దశాబ్దులకొలది కారాగారవాసులు కావలసివచ్చినది. కావున ఉద్యోగులు ప్రజానురాగమునుగాని, వారిసదభిప్రాయమునుగాని లక్ష్యముచేయరు.

గ్రామపు వెట్టివారికిసయితము ఎంతటి గౌరవాస్పదుడైనను నేపెద్దమనుష్యునిగాని లక్ష్యముచేయ నవసరము లేదు. వాడు కరణమువైపు మాత్రము చూచును. కరణము రెవెన్యూ ఇన్‌స్పెక్టరువంక, అతడు తహసీలుదారువంక, తహసీల్దారు కలెక్టరువంక, కలెక్టరు గవర్నరువంక, గవర్నరు వైస్రాయి వంక, అతడు సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా వంక అతడు ఇంగ్లాండుపార్లమెంటువంక దృష్టిని పైపైకి నిగుడించునే గాని, ప్రక్కకుగాని క్రిందికిగాని ప్రజలవంకగాని చూచు ఉద్యోగిలేడు. ఇట్టి రక్షణప్రాకారము మఱేదేశమునందును, ఏలోకమునను గానరాదు. భారతదేశమందలి ఉద్యోగులు పుచ్చుకొనునంతటి హెచ్చుజీతములు ఏదేశమందును లేవు. వీరి జీతభత్యములకును, దేశపౌరుల జీవితాదాయములకును పరిమాణసంబంధ మేయెడను లేదు. భారతదేశమునకే స్వపరిపాలనము లభించినచో ఈయస్వాభావికతంత్రము సాగదను

భావముతో ప్రభుత్వోద్యోగులు సామాన్యముగ దేశహిత సౌభాగ్యాభ్యుదయములను కోరుట సంభవించదు. ఈకోటల బారును బలిష్ఠమైనదే.

ఇక ఆఱవ ప్రాకారమును విచారింతము. ఇదివరకు స్థూలముగా నైదు ప్రాకారములగూర్చి ప్రస్తావించినాము. వాని యందు విదేశీయుల ప్రమేయము గోచరించినది. ఈ ప్రాకార నిర్మాణమున వారి జోక్యము సుస్పష్టముగ గోచరింపకున్నను నిదియు వారితంత్రమున ముఖ్యాంశమై యున్నది. ఇది ఆంగ్ల విద్యాలయముల స్థాపన. ఈమాటను భారతీయ విద్యాధికుల లోనే యనేకులు నిరసింతురు. వారు నమ్మరు. బ్రిటిషువారు రాకపూర్వము భారతదేశము అజ్ఞానాంధకారమున మునిగి యున్నదనియును, మూఢవిశ్వాసములతో బంధింపబడి యున్నదనియును, ప్రజలు పశుప్రాయులై నీతియన్న నెఱుంగ కుండిరనియును వాదింతురు. వారు నేర్చిన పాఠము లట్టివి. వారు చేయు ప్రచారములుకూడ నట్టివే. ఏడుసార్లు నీ వొక అబద్ధమును వినినను, ఏడుసార్లు నీ వొక అబద్ధము పలికినను తుదకు నీవే అసత్యమునే నమ్మెదు వని యొక ఆంగ్లకవివరుఁడు నుడివియున్నాఁడు. అది నిజమే. ప్రభుత్వమువారు దేశమున వ్యాపకముచేయుచుండిన విద్యకు రాజకీయప్రయోజనము ప్రధానము, ప్రభుభక్తిగమ్యము, స్వజాతినిరసనము సాధనము, ఆత్మవిశ్వాసభాగము పర్యవసానముగ నుండెను. గవర్నమెంటువా రేమాత్రమో అనుగ్రహించి తమసేవలోనికి దీసి కొనినతప్ప, విశ్వవిద్యాలయములలో పట్టభద్రులైననుగూడ నిరాధారులై స్వశక్తిపై నాధారపడి జీవనోపాధిని కల్పించుకో

జాలకుండిరి. కావునసే ఆవిద్యావిధానము నిష్ప్రయోజకుల సిద్ధముచేయుట కుపకరించు నందురు. ఆంగ్లవిద్యల గఱచిన వారు తమ మాతృభాషలో ఒకయుత్తరమునైనను వ్రాయ గల్గుట యరుదే. ఇట్టివారు పాశ్చాత్యవిజ్ఞాననిధులను భారత దేశమునకు గొనివచ్చి భారతప్రజలకు బంచియిత్తు రన్నమాట వృధాప్రగల్భముగాక మఱేమి! అదేమి చిత్రమో, ఆంగ్లభాష నొకింత నేర్చినం జాలును! ప్రతివాడును పాశ్చాత్యుల ననుక రించి జీవింప నెంచునేగాని, స్వజాత్యభిమానమును చూపడు. ఏవిషయమునైనను నీవేల మంచి దందు వనిన, ఆదొర మంచి దనినాడు గావున నను; ఏ యాచారమునైనను నీ వెందుకు చెడ్డ దనెద ననిన, ఈ దొర దానిని చెడ్డదని చెప్పినాడుగావున నను. వీని అభిప్రాయముల కన్నింటికి ఏ దొరముద్రయో పడవలయును. ఏ జాతినైనను స్వాధీనముచేసికొన నెంచుచో వారి మాతృభాషను దొలగించి, విజేతల భాషను ప్రవేశపెట్టినం జాలు నందురు. ఈ రహస్యము భాతరభూమియందు ఆంగ్ల విద్యావిధానమును బ్రవేశపెట్టిన "మెకాలే" ప్రభువునకు బాగుగ దెలియును. "భారతీయుడు పాశ్చాత్యవిద్యల గఱచు నెడల, అతనిచర్మము మారదేగాని, వానిబుద్ధి బ్రిటను సంప్ర దాయముల నవలంబించును. అతడు ఆంగ్లమానసపుత్రుడై యొప్పు" నని, వేఱొక పాశ్చాత్యప్రముఖుడు పలికియున్నాడు. ఆంగ్లసింహాసనమునకు భారతదేశమున సుస్థిరత్వ మేర్పరచిన రహస్య మిదియే.

భాషయొక్క ప్రభావము భావముపై ప్రబలముగ నుండును. ఆంగ్లభాష నేర్చిన ప్రవీణులు దేనింగూర్చి వ్రాయ తలపెట్టి ననూ ముందుగ ఇంగ్లీషున భావరచనను గూర్చుకొని దానిని

మాతృభాషలోనికి తర్జుమా చేయగల్గుచున్నారు. కాబట్టి స్వభాషలో స్వతంత్రరచనాశక్తి వారికి పూజ్యమగునని తెలియును. ఈ కారణములచేత తరుచుగా ఆంగ్లభాషాకోవిదులగు భారతీయులును, ఆ భాషరాని భారతీయులును బంధు గృహములందుగాని, సమాజములందుగాని సమావేశమగుపట్ల నొండొరులతో దీర్ఘకాలము పరస్పరసంభాషణ సాగింపనోడుదురు. ఒకరి నొకరు అర్థముచేసికొనజాలక వేర్వేరు సంఘములుగ గూడుట మనము సర్వసామాన్యముగ చూచుచున్నారము. మఱియు భాష ననుసరించి వేషము మారుటయూ అరుదుకాదు. ఆంగ్లభాష నేర్చినవారు ఆంగ్లదేశ వస్త్రివస్తుజాలమునుగూర్చి వ్యామోహితులై వారివాణిజ్యమునకు ఏజంట్లై నిలుతురనిన విచిత్రము కాదు. జుట్టు, కట్టు, బొట్టు, కత్తి ఆంగ్లవైఖరి ననుకరించును. విదేశభాషావేషముల ననుకరించు భారతీయులు తాము తోడిప్రజలకన్న శ్రేష్ఠులమని యెంచుకొనుట తటస్థించుచున్నది. ఆంగ్లపాఠశాలలలో చదువు బాలికలుగూడ నిట్లే తమ సోదరబాలికలను, స్త్రీలను మూఢజాతిపరదేశీయులుగ భావింతురు.

ఆంగ్లభాష రాని భారతీయులు నీ యభిప్రాయమునే సమ్మతితో గైకొని, భాష రాకున్నను వేషములోనైనను విదేశీయుల ననుకరింప బూనుదురు. క్రాపింగులు, ముఖధూాళులు. టీ కాఫీ త్రాగుళ్ళు, మెడమడుపులు, లాగూలు, టోపీలు, బూట్లు, మున్నగునవి మారుమూలల కుగ్రామములకు ప్రాకిన వనిన వేషప్రభావము నూహింపవచ్చును. అందువలననే బ్రిటీషు పరిపాలనముపై సాగిన పెద్దపెద్దవిప్లవములును, కడుస్వల్ప కాలములోనే సమసిపోవుట తటస్థించెను. విద్యార్థులు ప్రభుత్వ

పాఠశాలల విడువు డన్న విడువరు. ఉద్యోగులు ప్రభుత్వో ద్యోగశాలల బహిష్కరింపరు. సామాన్యప్రజలును విదేశవస్తు బహిష్కారము చేయనొడంబడరు. ఆంగ్లప్రజలు భారతదేశ మును వీడిపోయినను, వారి సంసర్గమును భారతీయులు మాను కొనినను మితిలేని దీనదశ ప్రాప్తించు నని బెగడందుదురు. ఈ భ్రాంతి మాతృభాషాకోవిదుండును, మనీషాగ్రణియు, బహుళ చతురుడును నగు శ్రీరామలింగారెడ్డిగారియంతటి మహాశయుడు తన పాలనముననుండిన ఆంధ్రవిశ్వవిద్యాలయమును ఆంగ్ల భాషాసాహాయ్యము లేని, మాతృభాషామూలమున నడుపుట దుస్సాధ్య మని వచించి రనిన చాలును. ఆంగ్లవిద్యాలయము లెంతటి బలముగల కోటలవరుసయై బ్రిటిషుపరిపాలనమును సంరక్షించుచుండెనో గ్రహించుడు. బ్రిటిషరులు భారతదేశము నుండి నిర్గమింతు రనిన ఆంగ్లభాషాకోవిదులగు భారతీయు లెల్లరు దిగులందుచున్నారు. ఆంగ్లభాషా మూలమునకాక దేశ భాషామూలమున చదువులు సాగించు డనిన ఉపాధ్యాయ సమితి యుస్సురను చున్నారు. కోర్టువ్యవహారములందు ఆంగ్ల భాషాప్రయోగమును తొలగింతుమనిన ప్లీడర్లు బెగడందుదురు.

అన్నింటను ప్రబలతమమును, భారతదేశము స్వారాజ్యము పడయుటలో దుర్లంఘనీయము నగు అవరోధమును నై నిలుచు సప్తమప్రాకారము సులభగోచరము గాదు. అభావరూపమగు నది; ఘోరాతిఘోరఫలితార్థములను నొసగునది; ప్రస్తుతము దేశనాయకాగ్రగణ్యులను వ్యథలపాలు చేయునది! సాంఘిక విద్వేషమే అది.

## 5. మిత్రభేదతంత్రముయొక్క నిగూఢఫలము

బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల వైరములును, సవర్ణ అవర్ణ విభేదములును, స్పృశ్య అస్పృశ్యవివాదములును, హిందూముసల్మానుల తగవులును ఒక్కసూత్రముపై నడతుమని ప్రతినలు బూను కాంగ్రెస్‌గోత్రీకులకుసయితము కళంకము నాపాదింప గల్గుచున్నవి. ఇవన్నియూ రాజకీయతంత్రముచే కల్పింపబడినవియే. 'విడదీసి వశము చేసుకొను' భేదోపాయఫలితార్థములే. ఈనాడు భారతభూమి నంతటిని నంధకారబంధురము చేసివేయుచున్న హిందూముసల్మానుసంఘవిద్వేషములను గూర్చి యొకింత విచారింతముగాక.

ముసల్మానులు విదేశములనుండి భారతదేశమునకు ద్రోపుడులు చేయుటకై వచ్చిరి. మొట్టమొదట కొన్నిరాజ్యములపైబడి అధిక ధనరాసులను కొల్లగొట్టుకొనిపోయిరి. అటుల కొల్లగొట్టుకొనిపోయిన ధనరాసులచే నాకర్షింపబడి మఱలమఱల దండెత్తివచ్చుట సాగించిరి. తుదకు గోరీవంశీయులు భారతదేశముననే నివాసముల నేర్పఱచుకొని యక్కడనే స్థిరపడిరి. రాజ్యస్థాపనకు గడంగి భారతభూమినే మాతృస్థానముగ జేసికొనిరి. ఈముసల్మానుల చరిత్రయందు యుద్ధములు తరుచుగా జరుగుచూ వచ్చినటుల చదువుచున్నాము. ఆయుద్ధములు రాజకీయకారణములమూలమున రాజకుటుంబములకు మధ్య ఘటిల్లినవేగాని సామాన్యప్రజలజీవితముతోగాని, మతభేదములతోగాని సంబంధించినవి కావు. ముసల్మానుప్రభువులు ముసల్మానుప్రభువులతోడను, హిందూప్రభువులు హిందూప్రభువులతోడను ఘోరరణములు జరిపిరి. సాంఘికాచారములచేతగాని, మత

ద్వేషములచేతగాని ఈ సంగ్రామములు ఘటిల్లిన వనలేము. అట్టి యుద్ధములలో ముసల్మాను వీరులు హిందూరాజుల సేనలం దుండియు, హిందూ వీరులు ముసల్మానురాజుల సేనలం దుండియు, వైరిపక్షమున నున్న స్వమతస్థులతో పోరాడి యుండిరి. మరియు పరమతసహనమును, పరమతాదరమును ఉభయపక్షములవారును చూపుచువచ్చిరి. హిందూముసల్మానుసంఘములు తోడేళ్ళు, గొఱ్ఱెలవలె సహజవైరము గలవారనియు, నెన్నడునూ సఖ్యతతో కలసి జీవింపజాల రనియును చెప్పు వాదన ఆకాలమున లేదు. అనేకములగు పట్టణములందును, పల్లెలందును సయితము హిందూదేవాలయములును, ముసల్మానులమసీదులును దఱిదాపుననే నిర్మింపబడియుండుట జూడ నిట్టివాదమునం దెంత యాథార్థ్యముగలదో యెవరైనను గ్రహించుట సులభమే. ఔరంగజేబు చక్రవర్తి అన్నయగు దారాషికో సంస్కృతభాషయందును, హిందూతత్వశాస్త్రములందును ఎంతయో ఆదరము చూపెడివాడు. ఉపనిషత్తు లనేకము పార్షీభాషలోనికి తర్జుమా చేయించియున్నాడు. భగవద్గీతయొక్కయు, యోగవాశిష్ఠముయొక్కయు పార్షీ అనువాదములు గలవు. రామాయణమహాభారతాది గ్రంథములు అక్బర్ చక్రవర్తి తర్జుమా చేయించి యున్నాడు. 'రామా' అనినను 'రహీమ్' అనినను నొక్కటే యని చాటిన భక్తు లుభయమతస్థులందు ననేకులు గలరు. హిందువులను ఔరంగజేబు, హైదరాలి, టిప్పుసుల్తాన్ చాలగా హింసించి రని మనము బడులలో చదువు చరిత్ర పాఠములు వట్టి దబ్బఱలు. వారలు హిందూ పండితుల నాదరించినటుల నిదర్శనము లనేకములు కలవు. వారు హిందూదేవాలయముల కర్పించిన జాగీరులు, కానుకలు

రథములు మొదలగునవి నేటికిని ఆ యా హిందూ దేవాలయములందు కాననగును. సోమనాథ దేవాలయమును దోచుకొనిపోయిన ముసల్మాను ప్రభువు కొలువులో హిందూసేనా నాయకు లుండిరి. ముసల్మానులపీర్లకు మొక్కులు చెల్లించు ఆచారము ఈనాడునూ హిందువులలో గలదు. మొగల్ చక్రవర్తుల గర్భశత్రువగు శివాజీ మసీదులకును, ఫకీరులకును ఖురానుప్రతులను పంచిపెట్టించెడివాడు. హిందూరాజుల గర్భశత్రువని ప్రసిద్ధిగాంచిన ఔరంగజేబు దర్బారులో యశ్వంతసింహునివంటి రాజపుత్రవీరు లుండిరి. ఆంధ్రదేశమున గోలుకొండ నవాబులు తెలుగు కబ్బములను అంకితముగొని వానిని రచించిన హిందూ కవులనెంతగనో గౌరవించియుండిరి. ఇందుకు భిన్నముగా మనము బడులలో చదువు హిస్టరీపాఠములు కలకత్తాచీకటికొట్టువంటి బూటకపువ్రాత లనుటకు సందేహము లేదు.

ఈనాడు ప్రచారములో నున్న రెండుజాతుల సిద్ధాంతమునకు మూలపురుషు డనబడు సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ గారునూ ఖాయదే ఆజమ్ జిన్నా గారునూ బ్రిటిషుగవర్నమెంటుచే నటుల తయారుచేయబడినవారే! మొట్టమొదట కాంగ్రెస్‌తో చేతులు కలిపి దేశాభ్యుదయముకొరకు పాటుపడినవారే వారునూ!

సర్ సయ్యద్‌గారు వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఇట్లుపన్యసించినారు:—

'జాతి' యనగా హిందూముసల్మాను లుభయులు నని నే నర్థముచెప్పుదును. ఆమాటకు నేను చెప్పగల అర్థము అది

యొక్కటియే. వారిమతవిశ్వాసము లెట్టివి యని విచారించుట ప్రయోజనకారి కాదని నాయభిప్రాయము. మనము కండ్లార గాంచున దిది. మేము ఒకేదేశమునందు నివసించువారము; ఒకేతీరు గవర్నరుల్రకింద ఒకేరీతిపాలనములో పౌరులముగా నున్నాము. ఎల్లరకు గల భాగ్యాధారములును నొక్కటియే. క్షామపీడల ననుభవించుటలోను మేము సమభాగస్థులమే. ఇండియాలో నివసించుచున్న ఈ రెండు జనసంఘములును 'హైందవులు' అను నొకపేర పిలువబడుటకు గల కారణము లివ్వి: హైందవు లనగా హిందూస్థానమున నివసించు ప్రజలని అర్థము. నేను లెజిస్లేటివ్ కౌన్సిల్లో నున్నకాలమున ఈ సమష్టి జాతియొక్క సమష్టిక్షేమముకొఱకు సదా శ్రద్ధ దీసికొందును.

అటుల వక్కాణించియున్న సర్ సయ్యద్‌గారు హఠాత్తుగా 1885 వ సంవత్సరమున మారిపోయినారు. తాను మున్ను వచించిన ధీరోక్తులకు భిన్నముగా వాదింపబూనినారు. రాజకీయ తంత్రమునందు ప్రజ్ఞానిధియని ప్రఖ్యాతిగన్న బెక్ దొరగారు బ్రిటీషురాజకీయప్రయోజనములకొఱకై సర్ సయ్యద్‌గారిని మార్పగల్గినాడు. నాటినుండి సర్ సయ్యద్‌గారు హిందూ ముసల్మానులు రెండు వేర్వేరుజాతులవా రని, తాను బెక్ దొరగారివలన నేర్చినపాఠమున కనుగుణముగా ప్రచారమును సాగించియున్నాడు. 1893 వ సంవత్సరమున కేవలము ముసల్మానుల క్షేమలాభముల కని 'మహమ్మడన్ ఆంగ్లో ఓరియంటల్ డిఫెన్స్ అసోసియేషన్ ఆఫ్ అప్పర్ ఇండియా' అనెడు సంస్థను బయలుదేరదీసి ఈ బెక్‌దొరగారే దానికి కార్యదర్శియై కథను నడుపసాగినాడు.

పదునైదుసంవత్సరములు సర్ సయ్యద్‌గారికి చేదోడువాదో డుగా వర్తించిన అల్లమాషిబ్లినూమనిగారు వారింగూర్చి యిటుల వ్రాయుచున్నారు:

"ఇండియన్ మ్యూటినీ అను గ్రంథమును రచించిన మహా సమర్థుడగు రచయిత—ప్రజలను మిలిటరీకోర్టులలో విచారణ చేయుచుండిన యాకాలమున ఆగ్రంథమును ప్రకటించిన సాహసికుడు—పంజాబు యూనివర్సిటీబిల్లును గూర్చిన లిట్టను ప్రభువు ప్రతిపాదనను తుత్తునియలు చేసివైచుచు, కాంగ్రెసువారు ప్రయోగించిన తీవ్రమైన భాషను మించిన భాషలో వ్యాసత్రయమును ప్రకటించిన పురుషసింహుడు—ఇండియనులు, బ్రిటనులు కూర్చుండు పీఠముల నమర్పుటలో సరిసమానత్వమును చూపలేదనుకారణమున ఆగ్రాదర్బారునుండి వెడలిపోయిన నిర్భయశీలుడు (సర్ సయ్యద్ అహమద్ ఖాన్‌గారు)... ......జాతీయోద్యమమునందు తమవంతు బాధ్యతను ముసల్మానులు వహింపకుండ వారిని వెనుకకు లాగిపట్టుటకు హేతువేమి? ఏమి సంభవించినది? హఠాత్తుగా వారిని (సర్ సయ్యదుగారిని) తలక్రిందుగా మార్చిన దేది?"—బెక్‌దొరగారి తంత్రము ధ్వని యిందు గలదు.

నవాబ్ సలీముల్లాఖానుగారు మరొక తీవ్రసమస్తిజాతీయవాది. 1904 వ సం॥లో కర్జను ప్రభువు బెంగాలును రెండుగా విభజించివేయ సంకల్పించెను. ముసల్మానుల కొక ప్రత్యేక రాష్ట్రమును నిర్మించి యిత్తునని వాగ్దానముచేసెను. నవాబ్ సలీముల్లాఖానుగారు మొదట విభజనమును ఖండించినారు. కాని తుదకు విభజనోద్యమమును బలపరచినారు. కొలదికాల

మునకు లక్షనవరసులు బహుస్వల్పపు వడ్డీకి రహస్యముగా నవాబుగారికి అప్పిచ్చున ట్లేర్పాటైనది. 1906సం॥ కాంగ్రెసులో నవాబాదా ఖానజా అటిఖుల్లాఖానుగారు దానింగూర్చి ఇట్లు వచించిరి: "తూర్పుబెంగాల్ ముసల్మానులు బెంగాలువిభజనకు సుముఖు లనుమాట యథార్థము కాదని నేను నిర్ధారణగా చెప్పగలను. ముసల్మాను ప్రభువులలో కొందరుమాత్రము స్వార్థలాభముకొరకు ఆయుద్యమమును బలపరుచుచున్నారు." కలకత్తాకేంద్రమహమ్మదీయకార్యదర్శి యగు నవాబ్ అమాల్ హసన్ఖానుగారు సయితము ఆవిభజనోద్యమము నెదిరించిరి.

కాని హిజ్ హైనెస్ ఆగాఖానుగారి నాయకత్వముక్రింద నొక రాయబారము వైస్రాయికడకు నడుపబడినది. సర్ సయ్యదు గారు తా నం దేకీభావము కల్పించుకొనక దూరముగనుండిరి. ఆసందర్భమున జరిగిన చిత్రకథ యొకటి గమనార్హమైనది. ఆర్చిబాల్డుదొరగారు 1906 వ ఆగస్టు 10 వ తేదీని నవాబ్ మొహ్సిన్ఉల్ముల్క్‌గారి కొక లేఖను వ్రాసి అం దిట్లు తెలిపి యుండిరి: "వైస్రాయిగారికార్యదర్శి కలనల్ డన్లప్ స్మిత్తుగారు ముసల్మానులు వైస్రాయిగారికడ కొక రాయబారమును తీసి కొనిపోవుటకు సమ్మతించిరి. వైస్రాయిగారికడ కొక రాయబా రమును తీసికొనివచ్చుటకై సమ్మతింపు డని కోరుచు లాంఛ నముగా మీ రొక లేఖను పంపుడని వారు సలహా చెప్పుచున్నారు. ఆయుత్తరము కొందరు ముసల్మానుల సంతకములతో పంపబడ వలయును. రాయబారమునందు అన్నిరాష్ట్రముల ప్రతినిధులు నుండవలయును. ఆరాయబారవిజ్ఞాపనమునందు ఏవిషయము లుండవలయునో యనునది మూడవయంశము. దానిని రాజ భక్తిప్రకటనతో మొదలుపెట్టవలయు నని సూచించుచున్నాను.

స్వపరిపాలన నైపునకు ఒకఅడుగు వేయునటుల గవర్నమెంటు వారు అంగీకరించు నిర్ణయమును అభినందించవలయును. కాని ఎన్నిక పద్ధతిని ప్రవేశపెట్టునెడల, అల్పసంఖ్యాకులగు ముసల్మానుల క్షేమమునకు భంగకరమగుననెడి భీతిని ప్రకటింపవలయును. ముసల్మానుల వాంఛల నాదరించుటకొరకు మతసంబంధమగు నియోజకవర్గములనో లేక ప్రాతినిధ్యమునో ప్రవేశపెట్టవలె నని సవినయముగా రాయబారపు విజ్ఞాపనపత్రమున సూచింపవలయును. ఇండియావంటి దేశములో జమీందారుల అభిమతములకు ఉచితమగు విలువ నొసగవలయు నవిషయితము విజ్ఞప్తి చేయవలయును. నామట్టుకు నేను ఎన్నికలతోడి ప్రయోగముల చేయుట కింతవరకు తరుణము రాలే దనియు, కావున నియోజకపద్ధతిని ముసల్మానులు బలపరచుట అవివేకకార్య మనియు భావించుచున్నాను. ఎన్నికలలో ముసల్మానులు తమకు రాదగిన భాగమును పొందుట చాలకష్ట మగును.

“కాని ఈఅభిప్రాయము లన్నిటిలోను నేను చాటున నుండు నబుల జరుగవలయును. అన్నియు మీలోనుండి వచ్చిన ట్లుండవలయును ... ... ... ఆవిజ్ఞాపనపత్రముయొక్క ముసాయిదాను నేను సిద్ధముచేసిపెట్టగలను. లేదా సరిచూచియైనను పెట్టగలను. దానిని బొంబాయిలో తయారుచేయునెడల నేను దానిని చూడగలను. ఆయావిషయములను ఉచితమగు పదజాలములో పొందుపరచగల నని మీ రెరుంగుదురుగదా !”

ఆర్చిబాల్డుదొరగారి సలహా అనుసరింపబడినదని వేరుగ చెప్పనవసరముండదు. ఆయారాష్ట్రములనుండి ముప్పదియైదుగురు రాయబారులను దోడ్కొని హిజ్ హైనెస్ ఆగాఖానుగారు

వైస్రాయిగారిని దర్శించిరి. అంతకుపూర్వమే నిర్ణయమై యున్న తీరున వైస్రాయిగారగు మింటోప్రభువు రాయబారము నాదరించి వారివిజ్ఞాపనపత్రమునకు తనప్రత్యుత్తర మొసగిరి. దాని సారాంశ మిది:

"మీావిన్నపముయొక్క సారాంశమును నేను గ్రహించితిని. ఎన్నికలపద్ధతిని ప్రవేశపెట్టుటకుగాని, హెచ్చుచేయుటకుగాని సంకల్పించునట్టి ఏప్రాతినిధ్యవిధానమునం దైనను మ్యునిసిపాలిటి, డిస్ట్రిక్టుబోర్డు లేక లెజిస్లేటివుకౌన్సిలు మున్నగువేనిలోనైనను ముసల్మానుసంఘమునకు ప్రత్యేకసంఘముగా ప్రాతినిధ్యము కావలయు ననుట మీావాంఛితార్థము. ఇప్పుడున్నతీరు ఎన్నికలవర్గములు ముసల్మానుఅభ్యర్థులను ఎన్నుకొను నని ఎంచుటకు అనేకసందర్భములలో నమ్మకము చాలదనియు, ఒకవేళ ఎన్నుకొనినను అట్టిఅభ్యర్థియొక్క అభిప్రాయము, వానిప్రాతినిధ్యము నంగీకరింపని అధికసంఖ్యాకవర్గము వారి అభిప్రాయముముందు నిలువజాల దనియు మీా రనుచున్నారు. మరియు మీాసంఘప్రాతినిధ్యముయొక్క యోగ్యతను మీాకుగల నంఖ్యాబలము ననుసరించిగాకుండ మీాకుగల రాజకీయప్రాధాన్యత ననుసరించియు, సామ్రాజ్యమునకు మీారొనరించిన సేవ ననుసరించియు నిర్ణయించవలయు ననెడి మీావాదన న్యాయసమ్మత మైనదే. మీావిజ్ఞప్తింగూర్చి నాకు సంపూర్ణమైన ఆమోదము కలదు."

మింటోప్రభుని యీాప్రవచనముల చాతుర్యము మెచ్చదగినది! గతఅర్ధశతాబ్దమునుండియు ముసల్మానులను సర్వవిధముల బ్రిటిషువారు అణచియుంచినారు. తమసామ్రా

జ్యము నపహరించిరనెడు క్రోధముచేత ముసల్మానులు ప్రభుత్వమునకు ఎప్పు డేవిఘాతము కల్పింతురో యని వారిని సంశయయతోడ జూచుచుండిరి. విద్యాసౌకర్యములుగాని, ఆర్థికసౌకర్యములుగాని వారికి లేకుండ జేసిరి. అట్టి ముసల్మానుసంఘము హఠాత్తుగా రాజకీయప్రాముఖ్యముగల దైనది! సామ్రాజ్యమునకు మహోపకారము గావించిన సంఘమని ఆకస్మికముగ గుర్తు వచ్చినది! ముసల్మానుసంఘముయొక్క ప్రాధాన్యము బ్రిటిషు పాలకుల నాకర్షించుట కిది ప్రప్రథమము. సంఘువిభేదములు ఆధారముగాగల ఎన్నికల నిర్మాణావశ్యకత మార్లేమింటో సంస్కరణములందు ప్రస్ఫుటమై వెలసినది.

## VI ముస్లిములీగు జననము

1906వ సం॥ డిశంబరు 30వ తేదీనాడు 'అఖిలభారతముస్లిములీగు' నిర్మాణమైనది. 'పువ్వుపుట్టగనే పరిమళించు'నను రీతి ముస్లిములీగుప్రభావము దానిపుట్టుకలోనే, ఉద్దేశ్యములప్రకటనలందే విస్పష్టమైనది. ముస్లిములీగు గమ్యార్థముల గమనింతము.

(1) బ్రిటిషుగవర్నమెంటువారియెడల ఇండియాముసల్మానులందు రాజభక్తిభావమును వృద్ధిపరచుట ; గవర్నమెంటువారు తీసికొను చర్యల యుద్దేశ్యములపట్ల ముసల్మానులందు చూపట్టనగు దురభిప్రాయముల దొలగించుట

(2) ఇండియనుముసల్మానురాజకీయములను, నితరవిధములగు హక్కులను కాపాడుట ; వారిఅవసరములను, వారిఆశయములను సౌమ్యవచనములతో గవర్నమెంటువారియెదుట నివేదించుట

(3) పై రెండు ఉద్దేశ్యములకు భంగమురానితీరున వీలగు నంతవరకు ఇండియనుముసల్మానులకును, తదితరసంఘములకును మధ్య స్నేహభావమును పెంపొందించుట

బ్రిటిషుపరిపాలకుల భేదతంత్రమునుగురించియు, ఆతంత్రములో ముసల్మాను లెటుల చిక్కుకొనినదియు నింకను వివరింపనలసిన అవసరముండదు. హిందువులు ముసల్మానులను ఉన్నతికి రానీయ రనియు, హింసింతు రనియు వారికి నేర్పిన పాఠములు నేడు ఫలించినవి. లక్నోముస్లిములీగుమహాసభలో నొకప్పుడు ఖాయిదే అజాము జిన్నామహాశయు డధ్యక్షపీఠము నుండి యిటుల గర్జించియున్నాడు :

"వెట్టి మొట్టిరాజకీయసిద్ధాంతములను ప్రతిపాదించి, వానిని భారతప్రజానీకముమీద పడవేసి పదేపదే రుద్దుచున్నారు. రాజకీయపరిశోధనల నెరింగినవారికి కవి తెలియనివి గావు. ఉదాహరణకు చూడుడు. తూర్పుదేశవాసుల తత్వమునకు ప్రజాస్వామికసంస్థలు సరిపడునవి కా వని నొక్కి వక్కాణింతురు గదా! హిందువులకును, ముసల్మానులకును ప్రజాస్వామిక విధానము క్రొంగ్రొత్తదా ?... అట్లగుచో గ్రామపంచాయితీల గురించి యేమందురో ? ముస్లిముమతప్రాచీనప్రాభవము ఏమని రుజువుచేయుచున్నది ? ప్రజాస్వామికతత్వము ననువర్తించుటలో ముస్లిములను మించిన మరేజాతి ప్రపంచములోగలదు?"

ఈ ఖాయిదే అజాము జిన్నాగారే సాంఘికవిభేధముల ప్రతిపాదింప పెనుగులాడిన సైమనుకమిషనును బహిష్కరించు డని ముసల్మానుసోదరులను హెచ్చరించియున్నారు.

సైమనుకమిషనుయొక్క రహస్యమును గ్రహించుటకు అప్పుడు సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా పదవిలోనున్న బర్కెను హెడ్ ప్రభువు వైస్రాయికి వ్రాసిన లేఖార్థముల చిత్తగింపుడు :

"ఈకమిషనును బహిష్కరించుటకు పూనుకొనిన ప్రజల నందరును, అందు ముఖ్యముగా ముసల్మానులను, నిమ్న జాతుల వారిని అడుగడుగునను చూడవలసిన దని సైమనుగారికి నా సలహా! ముస్లిములతో సైమనుగారు జరుపు సంభాషణ లన్నిటిని నేను బాహాటముగా ప్రకటనచేసెదను. మనవిధాన మేమిటో ఇప్పుడు విశదమై యున్నదిగదా! ఈకమిషనును ముసల్మానులు పట్టుగొమ్మగా గైకొనుచున్నా రనుభావముతో అఖిలహిందూప్రజాళి భీతిలిపోవునట్లు చేయవలెను. హిందూ సంఘస్థితి పూర్తిగా అధ్వాన్నమై పోవు ననుచు నివేదికలో పొందుపరచవలయును. తద్ద్వారా ముస్లిముల గాఢాభిమాన మును సంపాదించి, కొమ్మయెక్కి కూర్చుండిన జిన్నాను వ్యర్థ డని తిరస్కరించివేయవలయును."

బర్కెనుహెడ్ ప్రభుతంత్రము ఫలించినది. ఖాయిదేఅజాము జిన్నాగారు కొమ్మదిగినారు.

ఇండియాలోని బ్రిటిషుపరిపాలనయొక్క పరమలక్ష్యముల నింకను ప్రస్ఫుటముగా సర్ జాన్ సీలీప్రబుద్ధుడు బయలుపెట్టి యున్నాడు :

(1) ఇండియాలోని వివిధసంఘములను ఒకదానిపై మరొక దానిని ఉసిగొలిపి వైరుల జేయుట.

(2) ఆ విశాలప్రజాసమితి ఒకేజాతిగా సమీకరణ గాకుండ అవరోధముల గల్పించుట.

ఈమిత్రభేదతంత్రములు హిందువులను నెట్టివేసి ముసల్మానులను చంకనెత్తికొందు రను పేరాశను మన ముసల్మానుసోదరులందు కల్పనజేయుట కుపకరించినవిగాని వారిని యథార్థముగా అభిమానించి యుండలేదు. డాక్టరు విలియం హంటరుగారి సాక్ష్యమును చూతము :

"ముసల్మానుమతానలంబులకు గౌరవప్రదములగు జీవనపథము లన్నింటిని దూరముచేసితి మని వారు మనలను(బ్రిటిషువారిని) ఆక్షేపించుచున్నారు. వారిసంఘము నంతను నిస్సహాయుల జేసివైచి, అధమాధములును, బిచ్చగాండ్రును నగు దశకు దెచ్చు విద్యావిధానమును నెలకొలిపితి మని వారు మనల నిందించుచున్నారు. వారి వివాహసందర్భములలో మతసంబంధమగు నామోద మొసగు న్యాయశాఖోద్యోగులను దొలగించి వేయుటవలన వేలకొలది ముస్లిముకుటుంబములను దుఃఖరాసిని ముంచితి మని దూషించుచున్నారు. తమమతాచారకృతువులను నిర్వర్తించుకొను సదుపాయములను నిషేధించుటమూలమున వారిఆత్మలను ధ్వంసముచేసితి మని ఆక్షేపించుచున్నారు. ఒకమాటలో చెప్పవలయు ననిన వారిపైన మనకు సానుభూతి లేదనియు, ఔదార్యము శూన్య మనియు, వారిధర్మనిధులను దుర్వినియోగము చేసితి మనియు, నూరుసంవత్సరములనుండియు వారియెడల బాహాటముగా అపరాధములు. గావించినటుల బ్రిటిషుపరిపాలనమీద భారతదేశముసల్మానులు నేరముల నాపాదించుచున్నారు."

బ్రిటిషుపరిపాలకులు భారతప్రజలలోని ఐకమత్యమును భిన్నముచేసినను, తమపరిపాలనమును, వర్తకమును సరళముగా సాగిపోవుటకు దేశమున శాంతి యుండవలయును గాన ప్రజలు తమలోతాము పోరాటములు గావించుకొనకుండ వేరుపడి యుండు పాలకజాతివర్తకులతో మాత్రము వ్యవహారము నడుపు చుండునటుల జాగ్రత తీసికొనబడెను. దీనికే 'స్మశానవాటి శాంతి' అందురు. ప్రజల మతముతోగాని, సాంఘికాచారములతోగాని జోక్యము తీసికొన మని ప్రకటించియున్న దొరతనమువారు కేవలము సాక్షీభూతులై యున్నటుల నటిం చుచు, ప్రజలలో మత్సరమును హెచ్చుచేయుచు తదను కూలములగు పాఠములనే విద్యాలయములందు నేర్పునటుల నిర్ణయించిరి. దొరతనమువారి అంగీకారమును ముందుగా బడ సినగాని దాశరథీశతకమువంటి చిన్నిపొత్తమునైనను పాఠశా లావరణలోనికి తీసికొనివచ్చుట నేరముగా ప్రకటించిరి. హిందు వులు, ముసల్మానులు—సవర్ణులు, అవర్ణులు—ధనవంతులు, దరి ద్రులు—ప్రభుత్వోద్యోగులు, తదితరులు పరస్పరము భిన్నము లగు ఆశయములు గలవారై, సహజవిద్వేషములు గలవా రనియు, ఆవైరములను పైకిపొక్కకుండ జేయుటకై తా మెం తయో శ్రద్ధ తీసికొనుచుంటి మనియు దొరతనపు ప్రకటనల ద్వారమునను, వారికనుసన్నల మెలగువారిచే వ్రాయించిన చరిత్రగ్రంథములద్వారమునను సాంద్రప్రచారము గావించిరి. ప్రతిపాఠశాలలోను, ప్రతిఉద్యోగమందిరమందును, ప్రసమా వేశ మందును, 'రాజభక్తి, రాజభక్తి'యను నినాదములుచేయు నాచారమును కల్పించిరి. భారతీయులకు పరిపాలనాప్రథమ పాఠమునేర్పుచున్నామనునెపముతో స్థానికసంస్థలను, ఎన్నికలను

ప్రవేశపెట్టుచు సంఘవిభేదములను స్థిరపఱుచుచు వచ్చిరి. ఎన్నికలపద్ధతిలో 1909వ సంవత్సరమున ప్రజలను నాలుగువర్ణములుగను, 1918వ సంవత్సరమున పదివర్ణములుగను, 1939 వ సంవత్సరమున పదునేడుకూటములుగనువిడదీసిభారతజాతిని ముక్కలు ముక్కలుగా చేసిరి. ప్రతివర్గమువారును సాధ్యపడునన్ని విధములను తమకు రాగల ప్రయోజనములను గుంజుకొను పేరాశతో న్యుద్దేశ్యులై పోవుచుండిరి. వాటముగా కాన్పించునెడల కులనామములను, వర్ణనామములను, మతమునుసయితము అలసమనస్కులు మార్చుచేసికొన పాల్పడిరి. ఉత్తమవర్ణములవారమని చెప్పుకొనువారు హరిజనులలోను, షెడ్యూల్డుకాస్టులలోను, బ్రాహ్మణేతరవర్ణములలోను చేరిపో నుద్యుక్తులైరి. బ్రాహ్మణేతరులు క్రైస్తవులను, ముసల్మానులను చేర్చుకొనిరి. షెడ్యూల్డు కాస్టులు మహమ్మదీయులలో కలియుటకై ప్రయత్నించిరి. రాజకీయపార్టీల కల్లోలములో ఎవరి కేది శ్రేయస్కరమో గ్రహింపజాలకుండిరి.

## 7. రాజకీయప్రబోధము

పాశ్చాత్యపాలకులు తమభాషను నేర్చుకొని, తమభావసరణి నవలంబించి, తమవేషాచారము ననుకరించువారిని సహజముగ నభిమానించుచుండిరి; పెద్దయుద్యోగముల నిచ్చిరి; ఘనమగు బిరుదావళుల నిచ్చి మన్నించిరి. పాలకులను మెప్పించి వారి కటాక్షములకు గురియగు టెట్లా యను నుబలాటమే యెల్లర నావహించినది. స్థానికపరిపాలనాద్వారమునను, శాసనసభల ద్వారమునను దొరతనమువారికి సన్నిహితులై దేశపాలనా గౌరవమును పంచుకొనవచ్చు నని యున్నతవిద్యల గఱచి

స్వతంత్రజీవనము చేయుచుండినవారు 1885వ సం॥ డిశెంబరు 28 తేదీనాడు కాంగ్రెసును నెలకొలిపిరి. హ్యూముదొరగారే వారి కాసంకల్పమును గల్పించి ప్రోత్సహించిరి. ప్లీడర్లు, డాక్టర్లు, వర్తకులు మొదట నీయుద్యమమునందు పాల్గొనజాలిరి. తాము ప్రజాప్రతినిధుల మని చాటుకొనుచు తమప్రయోజన ములే జాతిప్రయోజనములు ననుచుండిరి. అట్టిప్రయోజనము లకు సంబంధించిన తీర్మానములనే చేసి ప్రభుత్వమువారికి వానిని నివేదికలరూపమున నివేదింప మొదలిడిరి. క్రమేణ పరిపాలకుల చర్యలను, వారిపోకడలను విమర్శింప సాహసించిరి. బెంగాలు విభజనోద్యమమునాటినుండి దొరతనమువారి నెదిరించి, ప్రజా సామాన్యమునుగూడ జేర్చుకొని సమష్టిజాతీయోద్యమములను సాగించిరి. ఇంతవరకును హిందూమహమ్మదీయులందు చెప్పు కొనదగినంత విరోధభావము చూపట్టలేదు. పిమ్మట దొర తనమువారు ముసల్మానులను వేరుపరచగలిగి 'ముస్లిములీగు' స్థాపనకు అజ్ఞాతముగా మూలకారకులైరి. భారతీయులు హిందువులైనను, ముసల్మానులైనను తమజీవితమునందు మత మును ప్రధానముగ నెంతురు. కాని రాజకీయములందు మత సాంప్రదాయములకు ప్రాధాన్యము నొసంగక మతసాంఘిక విషయములలో తాటస్థ్యభావమును పూనిలిమనెడు బ్రిటిషుజాతి పాలకుల మార్గదర్శకత్వము నంగీకరించిరి. కాంగ్రెసువారును, ముస్లిములీగువారును తమతమశక్తికొలది రాజకీయప్రయోజన ములను సాధించుకొనసాగిరి. ఉభయులకు సంబంధించి, ఉభయు లను సమముగ బాధించు నంశములందు ఏకమగుచు వచ్చిరి. ఈసరణి భారతీయులకు బలమును, బ్రిటిషరులకు దుర్బలతను చేకూర్చుచుండుట గాంచి బ్రిటిషుపరిపాలకులు బెదరిపోసాగిరి.

1916 వ సంవత్సరము ముస్లిములీగు, కాంగ్రెసు రెండును ఒకేసమయమున లక్నోనగరమున సమావేశమైనవి. ముసల్మానులు, హిందువులు రాజకీయముగా బాధల నందుటలో సరి సమానుల మను భావముతో సఖ్యత కలిగి మెలగిరి. లీగుమహాసభలో మాలవ్యాజీ పండితుడు, గాంధీమహాత్ముడు, సరోజినీదేవి మున్నగు ప్రముఖకాంగ్రెసువాదులు ఉపన్యాసముల నొసగిరి. ఈసఖ్యత లీగునకు శాశ్వతాధ్యక్షుడుగా నెన్నుకోబడియున్న హిజ్ హైనెస్ ఆగాఖానుగారికి హితవు కాదయ్యెను. బ్రిటిషుపతిపాలకుల మైత్రిని కోల్పోవలసివచ్చునేమో యను భావముచేత ఆయన తనఅధ్యక్షపదవికి రాజీనామా నొసగిరి. ఖాయిదేఅజాము జిన్నాగారు ప్రతిపాదించిన యొకతీర్మానమున కనుగుణముగా భారతదేశమున కుపకరించు రాజకీయసంస్కరణల ప్రణాళిక నొకదానిని కాంగ్రెసువారితో సంప్రదించి సిద్ధముజేయుటకై ముస్లిములీగుమహాసభవా రొకకమిటీని నియమించిరి. ఆప్రణాళికలో ముసల్మానులు అల్పసంఖ్యాకులుగా నున్న రాష్ట్రము లందు హెచ్చుప్రాతినిధ్యము పొందునటుల ఉభయసంస్థలవారు ఒకసంధిని కూర్చుకొనియుండిరి.

ప్రథమప్రపంచసంగ్రామము ముగియు సమయమున (1918) టర్కీదేశమున ముసల్మానుపవిత్రస్థానములకు విఘాతము చేకూరునట్టి సంధినియమములకు, మిత్రత్రయములోని బ్రిటిషు వారు తమసమ్మతి నొసగిరి. అందువలన మహమ్మదీయులకు ఘోరాపద చేకూరినది. భారతప్రభుత్వమువారు 1919వ సంవత్సరము నందు భారతనాయకులనందఱి నణచిపట్టునిమిత్తము రౌలటుశాసనము ప్రచారముచేసిరి. ఆక్రూరశాసనము నెదిరించి దను మిషతో జలియన్‌వాలాబాగులో సమావేశమైన వేలకొలది జనులను

నిష్కారణముగా కాల్చిచంపి భీభత్సముచేసిరి. ఆనాడు ప్రవహించిన రక్తప్రవాహములందు హిందూముసల్మానునిరపరాధ జనుల తనువులు తేలియాడినవి.

అంతవరకును గవర్నమెంటువారి సంగ్రామచర్యలను ఖండింప జంకుచు నొకవిధముగా అనుమోదించుచు వచ్చిన గాంధీజీ శాసనోల్లంఘనమును ప్రారంభింపవలసివచ్చెను. దొరతనము వారి చేష్టలను, శాసనములను బాహాటముగా ఖండించుచు కలకత్తాలో సమావేశమైన లీగుమహాసభలో సింహగర్జనము చేసిన ఖాయిదే అజాము జిన్నాగారీనా డేమనుచున్నారో ఆలకింపుడు :

'ఇస్లాముధర్మము, హిందూధర్మము ననునవి వాస్తవికార్థ విచారణ చేయునెడల మతము లనజెల్లవు. అవి భిన్నములగు సాంఘికకూటములమాత్రమే సూచించునవి. హిందువులును, ముసల్మానులునుకూడి యేకైకజాతిగా ప్రవర్ధనముకాగల రనుట వట్టికలలోనివార్త! 'ఏకైకభారతజాతి' యనెడు భ్రమ మనలను హద్దుమీరి చాలదూరము నడపినది. మన యిక్కట్టులలో చాల మట్టుకు కారణభూతమైన దదే! సకాలములో మనయీభావములను మార్పుచేసికొనని పక్షమున హిందూదేశమునకు వినాశము చేకూరగలదు.'

1906 వ సంవత్సరమున మింటోప్రభువు ముసల్మానురాయబారుల కొసంగిన ప్రత్యుత్తరముయొక్కనకలే, యీయంశముతో 1939 వ సం॥ డిశంబరునెలలో వైస్రాయిగా నున్న లిన్లిత్గో ప్రభువు ఖాయిదే అజాము జిన్నాగారికి వ్రాసిన లేఖలో ప్రతిబింబించుట యబ్బురముగొలుపుచున్నది.

1941 వ సంవత్సరపు లీగుమహాసభలోని ఖాయిదే అజాము జిన్నాగారి అధ్యక్షోపన్యాసమునందలి యీక్రింది ప్రకల్పములు లిన్లిత్గో ప్రభువు కృతకృత్యు డైనటుల రుజువు చేయుచున్నవి. జిన్నాగారివాక్కు లివి:

'ఏపరిస్థితులలోనైనను కేంద్రమున నొక ప్రభుత్వముగల అఖండభారతవర్షమును సూచించు రాజకీయనిర్మాణమును మే మంగీకరింపము. అట్టిదాని కేనాడును మే మొల్లము. స్వతంత్ర జాతియొక్క అనగా ఈయుపఖండమున స్వతంత్రరాష్ట్రము యొక్క పదవిని సంస్థాపనచేయుటకు మేము కృతనిశ్చయులమై యున్నాము. ఇదియే పాకిస్థానప్రకటనము, జాతిద్వయసిద్ధాంతమునకు మూలస్థానఘోష!'

కాంగ్రెసు సర్వదా అఖండభారతస్థానము కావలె ననియు, కాంగ్రెసు సర్వస్వాతంత్రభారతప్రభుత్వమును సంస్థాపించువరకును దౌర్జన్యరహితఅసహాయోద్యమమును నడుపవలయుననియు ముసల్మానులతోసహా అల్పసంఖ్యాకవర్గముల కందరకును సంపూర్ణమగు న్యాయము జరుగు నను విశ్వాసము గల్గింపవలయు ననియు, వాక్స్వాతంత్ర్యము, మతస్వాతంత్ర్యము, సమావేశస్వాతంత్ర్యము సర్వప్రజలకును సమానముగా అనుభవనీయములు గావలయు ననియు, అంతవరకును కాంగ్రెసు నలుబది కోట్లభారతీయులకును ప్రాతినిధ్యము వహింపవలయు ననియు, అందుకొరకై తమవిదేశపరిపాలనమును వీడి బ్రిటిషువారు భారతదేశమునుండి నిర్గమింపవలయు ననియు, తత్ఫలసిద్ధికై నిరంతరము కృషిచేయుచు నెట్టికష్టనిష్ఠురములనైనను నైచ్ఛికముగా నెల్లరు ననుభవింపవలయు ననియు 1942 వ సం॥ ఆగస్టు నెలలో ప్రకటించిరి.

ఈ ప్రకటన భారతజనమువారికి హితము కాజాల దని వేరుగ చెప్ప నక్కరలేయుండదుగదా! ఈ ప్రకటన నామోదించిన వారిని, తదనుసారముగ వర్తించినవారిని జైళ్ళకు బంపి, తత్సంబంధమగు సంస్థల నన్నిటిని అక్రమసంస్థలుగా ప్రకటించి చేతనైనంతవరకు భగ్నపరచియు కృతార్థులు కాలే మని తెలిసికొనిరి. ఈచారిత్రికఘట్టముల నన్నిటిని వివరించుటకుగాని, ప్రస్ఫుటముగా సూచించుటకుగాని ఈచిన్నపొత్తమున తావు లేనందున గింతిలుచున్నాము.

## 8. బలిసమర్పణము

బ్రిటిషు దేశపు క్షేమలాభములు భారతదేశవినాశ హేతువును, భారతదేశపు క్షేమలాభములు బ్రిటిషుదేశవినాశ హేతువును కాకపోయినను, భారత దేశక్షేమలాభములు బ్రిటిషు దేశీయుల భోగభాగ్యములకు హానికరమై చూపట్టుచుండెను. కాబట్టి భారతదేశములోని బ్రిటిషుపాలకులు భారతదేశవినాశమునకై ప్రత్యక్షముగా పన్నుగడలు గావింపకున్నను, తమదేశహితమును చూచుకొనవలసినవారై యుండిరి. వారికృత్యముల నాక్షేపించువారు సహజముగా రాజద్రోహులుగ దండింపబడుటలో నాశ్చర్యము లేదు. భారతదేశక్షేమమునుగూర్చి పాటుపడ నెంచిన ప్రతిదేశాభిమానియు పాలకులదృష్టిలో రాజద్రోహియే. ఇందుకు ప్రస్ఫుటదృష్టాంతము 1922వ సంవత్సరమునందు గాంధిమహాత్మునిపై తేబడినఅభియోగమును, వాని వాఙ్మూలమును, విధింపబడిన దండనయు మచ్చునకుగాను గమనింపదగును. గాంధిమహాత్ముని వాఙ్మూలమున కొన్నిభాగముల నుల్లేఖింతుముగాక. ఏ భారతదేశాభిమానియో, దేశారాధకుడో

దేశసేవకుడో రాజద్రోహిగా దోషారోపణ చేయబడి న్యాయస్థానమున నిలుపబడినప్పుడు అత డీయగల వాఙ్మూలము దీనినే పోలియుండు ననుట గమనార్హము.

గాంధీజీవాఙ్మూలము:— "ఈఅభియోగసందర్భమున భారత ప్రజలకును, నాంగ్లేయమిత్రులకును తృప్తికరమగు వాఙ్మూలమును నే నొసగవలసియున్నది. ఒకప్పుడు రాజభక్తుడనుగను, ప్రభుసహాయకుడనుగను నున్న నేను నేడు కేవలము రాజద్రోహప్రచారకుడనుగను, సహాయనిరాకరణవాదిగను మారిపోవుటకు కారణ మేమో తెలుపవలసియున్నది. న్యాయశాస్త్ర ప్రకారము భారదేశమున స్థాపింపబడియున్న ప్రభుత్వమునెడల ద్వేషమును పురికొల్పుచుంటి నని నే నెందులకు ఒప్పుకొనవలసి వచ్చినదో కూడ కోర్టువారికి నేను విన్నవించుకొనవలసియున్నది.

(గాంధీగారు ప్రభుత్వమునకు ఏయేసందర్భములం దెంతెంత సాహాయ్యము చేసినదియు వివరించిన యనంతరము)

"వాస్తవమగు ప్రజాస్వాతంత్ర్యమునకు భంగము కలిగించు నుద్దేశముగల రౌలటుచట్టముతో నాకు మొట్టమొదట ఆశాభంగము కలిగినది. దానికి ప్రతికూలమైన ఆందోళన చేయుటకు నేను తలపెట్టితిని. అటుపిమ్మట జలియన్‌వాలాబాగుహత్యలతో నారంభమైన పంజాబుదురంతములు తటస్థించినవి. ఆ రోజులలో ప్రజలు పొట్టలమీద ప్రాకునటుల ఉత్తరువులు జారీ చేయబడినవి. ముక్కోణములకు వ్రేలగట్టబడి కొరడాలతో బహిరంగముగా పౌరులు కొట్టబడిరి. ఇంకను వర్ణింపరాని అవమానము లెన్నియో పాంచాలదేశీయులయెడ జరుపబడినవి. భారతీయమహమ్మదీయులకు టర్కీ విషయమునను, ఇతరమహమ్మ

దీయపుణ్యక్షేత్రముల విషయమునను బ్రిటిషు ప్రధానమంత్రి గావించిన వాగ్దానములు సరిగా నిర్వర్తింపబడలే దనియు తెలిసికొన గల్గితిని.........

"అర్థోపవాసములతో వ్యథలబడుచున్న భారతీయజనసామాన్యము నానాటికి నిర్జీవప్రతిమలై కుంగిపోవుచుండిరి. వారు కేవలము విదేశీయపు పెట్టుబడిదారులకు ధనము చేకూర్చిపెట్టు నిమిత్తముమాత్రమే వినియోగింపబడుచున్నారు. కాని ఆసంగతి వా రెరుగరు! భారతదేశములో న్యాయశాస్త్రప్రకారము స్థాపింపబడిన బ్రిటిషుప్రభుత్వముకూడ విదేశపుపెట్టుబడిదార్ల ధనసంపాదనకొరకే తోడ్పడుచున్నదను విషయమును వా రెరుగరు. అనేకగ్రామములలో తిండిలేక కృశించిపోవుచున్న అస్థిపంజరములబోలు మనుష్యులు కలరు. ఇది యంతయు మాకండ్లకు ప్రత్యక్షముగా కనపడుచుండ ప్రభుత్వము ప్రకటించు అంకెలతోగాని, వారి వాదనైపుణ్యముతోగాని మాకు పని లేదు. చరిత్రలో ఎక్కడను పోలికలేని మానవప్రపంచమునెడ జరుపబడుచున్న యీఅన్యాయమునకు ఇంగ్లాండుదేశీయులును, మఱియు భారతదేశములోని పట్టణవాసులును దేవునియెదుట జవాబు చెప్పుకొనవలసియున్నది. ఈదేశములో చేయబడిన ప్రతిశాసనమును విదేశీయపు పెట్టుబడిదారునికి ఉపయోగపడునట్టిదిగా అగుచున్నది.........

"ఈదేశమునందు శిక్షింపబడిన రాజకీయనేరస్థులలో నూటికి తొంబదిమంది కేవలము నిరపరాధు లని స్వానుభవమువలన నే నెరుగుదును. వారు తమమాతృభూమిని ప్రేమించుటే ఒక నేరము. భారతీయులకును, యూరోపియనులకును తటస్థించిన

వివాదములలో భారతదేశములోని న్యాయస్థానములందు నూటికి తొంబదితొమ్మిది కేసులలో భారతీయులకు అన్యాయమే జరుగును.........

"ఒకప్రక్క దౌర్జన్యమును ప్రయోగించి ప్రజలను భయపెట్టుటయు, రెండవప్రక్క ప్రతీకారమునకుగాని, ఆత్మరక్షణకు గాని అవకాశము లేకుండా వారిని నిరాయుధులుగ జేయుటయు ఈప్రభుత్వపద్ధతియై యున్నది.........

"కాబట్టి ఈనేరము నాపైని మోపబడుట నే నొక గౌరవముగా నెంచుచున్నాను. ప్రభుత్వమునెడ నాకు ప్రేమ లేకపోవుటనుగూర్చిన కారణములను ఇదివరకు సంగ్రహముగా వివరింప యత్నించియుంటిని. ఏప్రభుత్వాధికారియెడలను నాకు వ్యక్తిపరమైన ద్వేషభావము లేదు. ముఖ్యముగా రాజుగారియెడల నా కేలాటి ద్వేషభావము నుండుటకు అవసరమే లేదు. భారతదేశము నింతకుపూర్వము పరిపాలించిన యేప్రభుత్వమును చేసియుండని మహోపకారము గావించుచుండిన యీపరిపాలనయెడల ప్రేమ లేకుండుట సుగుణముగా నే నెంతును.........

"దుష్కార్యసాహాయ్యము చేయ నిరాకరించుట కారణముగా కలిగెడు శిక్షకు నేను బుద్ధిపూర్వకముగ లొంగిపోవుటగూడ నాఅహింసాసిద్ధాంతమున నిమిడియున్నది. కాబట్టి బ్రిటిషు న్యాయశాస్త్రప్రకారము బుద్ధిపూర్వకమైన అపరాధముగా కనబడుచున్నను నాదృష్టిలో పౌరుని ఉత్తమధర్మముగా పరిగణింపబడుచున్న యీనేరమునకై సాధ్యమైనంత హెచ్చు కఠినశిక్షను నాకు విధింపవలె ననియే మిమ్ములను వేడుకొనుచున్నాను."

ఈ వాఙ్మూలము పర్యవసానముగా న్యాయాధిపతి గాంధీగారిని నేరముచేసినవానినిగా నిర్ణయింపజాలకపోయినను, అంతకు పూర్వ మిటువంటి అభియోగమునందే తిలకుగారిని శిక్షించి యుండరి గావునను, అన్యాయశాస్త్రమే ఆచరణీయం దున్నది కావునను గాంధీగారికి ఆరుసంవత్సరముల శిక్ష విధించెను. తుదకు దొరతనమువా రాశిక్షాకాలము పూర్తిగాకమునుపే గాంధీజీని విడుదలజేయుట ఘటిల్లినయెడల సంతసించువారిలో తాను మొదటివాడనుగా నుందు నని యా న్యాయాధిపతి వచించియుండెను.

శ్రీ గాంధీజీ యీసారి జైలుకు పోయినపిమ్మట రాజద్రోహ మను నేరమున కర్థమే లేకుండ పోయినది. లక్షలకొలది ప్రజలు సాత్వికనిరోధము చేసి జైళ్ళకు పోయిరి. లాటీచార్జీలకు గురియైరి. వేలకు వేలుగా జైళ్లలో వర్ణింపనలవిగాని బాధల ననుభవించిరి. అనేకులు ప్రాణమును, తమసర్వస్వమును గోల్పోయిరి. ఇటుల చేయుటలో స్త్రీలును ధారాళముగా పురుషుల ననుసరించిరి. పోలీసులును, సైనికులును ప్రజలపై నత్యాచారముల నెన్నియో యొనరించిరి. స్త్రీల ప్రాణమానధనముల హరించిరి. శిశుహత్యలకును, భ్రూణహత్యలకును కారకులైరి. ఇట్టి ఆత్మబలిదానము వ్యర్థముగా పోవునా ?

గాంధీజీ 1924 వ సం॥న వ్యాధిగ్రస్తులై చెరనుండి విడుదలయైరి. దేశ మెల్లడల పర్యటన గావించి ప్రజలకు సాత్వికనిరోధాయుధమును ప్రయోగించుటంగూర్చి బోధలు సలిపిరి. 1930 లో ఉప్పుసత్యాగ్రహము గావింతు నని చెప్పి 200 మైళ్ళు నడచి దండీగ్రామము చేరి ఉప్పుచట్టము నుల్లంఘించిరి. కోట్ల

కొలది జనులు సత్యాగ్రహము సాగించిరి. వైస్రాయిగారు గాంధీజీతో సంప్రదింపులు సాగించినారు. రౌండుటేబులుకాన్ఫరెన్సులో పాల్గొనుటకై గాంధీజీని సమ్మతిపరచి లండను బంపిరి. అఖిలభారతప్రజానీకమునకు ప్రాతినిధ్యము వహించి 1931వ సం॥లో గాంధీజీ లండను వెళ్ళినారు. సమాధానమునకై రౌండుటేబుల్ కాన్ఫరెన్సులో ప్రసంగించియు కృతకృత్యులు కాలేకపోయెను. అచ్చట గాంధీజీయుపన్యాసము విశాలభారత భూమిలో నివసించు ప్రజాహృదయములో తాండవించుచున్న సంకల్పములనే ప్రతిబింబించె ననుట అతిశయోక్తి కానేరదు. గాంధీజీయుపన్యాసాంశముల కొన్నింటి నిక్కడ నుల్లేఖింతును:

"ప్రధానామాత్యా!

మన మొక పరిష్కారమునకు వచ్చుటకు చూచుచో ఎంతయో రాజీకి అవకాశ మున్నది. మీమైత్రికై నే నెంతయో ఆతురపడుచున్నాను. నిరంకుశాధికారులను, బానిసచక్రవర్తులను కేవలముగా త్రోసిపుచ్చుటే నాపని గాదు. అది నాతత్వమునకు విరుద్ధము. కాంగ్రెసు దాని నొక సిద్ధాంతముగగాక వ్యవహారసాధనముగమాత్రమే గ్రహించియున్నది. ముప్పదియైదుకోట్ల భారతీయులకు క్షేమప్రద మని తలంచుటచేతనే అది ధర్మ మనియును, న్యాయ మనియును నమ్మి కాంగ్రెసు దానిని ఆచరణలోనికి తీసికొనివచ్చినది, ముప్పదియైదుకోట్ల అంగబలముగల భారతవర్షము హంతకుని ఖడ్గము చేబట్ట నవసరము లేదు. ఈటెలు, బల్లెములు వినియోగించు పనియును లేదు. విషాన్నము తినిపింప అగత్యమును లేదు. అమోఘమైన సంకల్పబలముచేతనే ఈమహాచక్రమును త్రిప్పగలదు. సహాయ

నిరాకరణాస్త్రమును ప్రయోగించి ధిక్కారము చేయగల సమర్థత యొక్కటియే అవసరము. దానినే ఇప్పుడు భారతీయులు సాధన చేయుచున్నారు.

"ఐనను భారతవర్షము ఇప్పుడనున దేమి? బ్రిటిషువారి నందరను అమాంతముగా దేశమును వీడి పొమ్మనుచున్నదా? లేదు. ఆంగ్లేయులను మార్గమునకు తీసికొనివచ్చుటకే పూనికొనినది. ఇంగ్లాండుసంబంధమును భారతదేశము త్రెంపివేసికొన దలంచుటలేదు. కాని దానిని మార్పఁబూనినది. ఆప్రియతత్త్వమును మీరు సంపూర్ణస్వాతంత్ర్య మనుడు; లేదా మరేపేరుతోనైనను బిలువుడు. మాటకొరకై నేను పట్టింపుచూపను ... ... కేవలము భారతదేశమునకుమాత్రమే లాభకరముగా నుండి ఇంగ్లండునకు అనర్థదాయకముగా నుండు రక్షణలు కావలయునని నేను కోరను. భారతదేశము కొన్నిక్షేమలాభములను వదలుకొనవలెను. ఇంగ్లండుకూడ తనకు లాభకర మని యెంచబడు నేర్పాటులను కొన్నిటిని వదలుకొనవలెను. అకృత్రిమమైన లాభములు మీకు వలదు; మాకును వలదు.... ...కాంగ్రెసుతో మీరు మైత్రి నంగీకరించితిరేని మీదౌర్జన్యమునకు స్వస్తిచెప్పుడు. అట్టిదౌర్జన్యముతో పనియే యుండదు. మీరిప్పుడు దౌర్జన్యవాదుల నెదుర్కొనవలసియున్నది. ఐనను మీదౌర్జన్యపు కట్టుదిట్టములు బాగుగను, శిక్షణతోడను ప్రయోగింపబడును. మీరు వాస్తవికమైన విషయములను చూడకుండ కండ్లు మూసికొందురు. తాటికాయలంతటి అక్షరములతో సత్యము గోచరించుచున్నను మీరు హర్షింపరు. ఈ దౌర్జన్యవాదులు తమ రక్తముతో నేమి వ్రాయుచుండిరో మీరు

గమనించుట లేదా ? మేము కోరునది సామాన్యాహార మని తెలియుటలేదా ? మేము కోరునది స్వాతంత్ర్యాహారము.

"మీరు సత్యమును చూడుడు. ఓర్పునకు ప్రసిద్ధివడసిన మాజనుల సహనమును పరిశోధింపబూనకుడు. భారతీయుడు చాల సాధుజీవి యని ప్రసిద్ధి. భారతీయులతోడి సహవాసము వలన ముస్లిములును శాంతికాము లైనారు. అది మంచి దని గాని, చెడ్డ దనిగాని మనము నిర్ణయము చేయవలదు. ముస్లిముల ప్రసక్తితో మైనారిటీల క్లిష్టసమస్య నాకు స్ఫురించినది. అట్టి సమస్య యున్నదని నాకు తెలియును. ............పర దేశీయుల ప్రభుత్వము మాదేశములో నున్నంతకాలము మతములకు, మతములకు—వర్గములకు, వర్గములకు—కులములకు, కులములకు మధ్య తగవులు పెంచుచున్నంత వరకును వాస్తవమైన పరిష్కారము సాధ్యపడదు. ఉభయమతముల వారికిని శాశ్వతమైన నెయ్యము కుదరదు. పారతంత్ర్యము ఎన్నడు వెనుకకు నెట్టబడునో మా అనురాగమును, సంబంధమును, ఒకేజాతివార మనెడు జ్ఞానమును నింక మరచిపోగలమా? ఇంత యేల ? బ్రిటిషువారు భారతదేశములో లేనప్పుడు, తెల్లముఖము భారతదేశములో మచ్చునకైనను కనుపించనప్పుడు దేశమంతయు హిందువులు, ముసల్మానులు, శిక్కులు ఒకరి కుత్తుకల నొకరు కోసికొనుచుండిరా ? మేము ఇప్పటికంటె శాంతిప్రియులమై, సదయహృదయులమై మెలంగుచుండువార మని హిందూముస్లిముచరిత్రకారులు నిదర్శనపూర్వకముగా రచించిన వ్రాత లెన్నియేని మీకు చూపగలను. ... ... ... కాంగ్రెసుయొక్క చివరిమాట యేదియో చెప్పినట్లయిన మీకును, నాకునుగూడ అపచారము గావించినవాడ నౌదును.

నే నేమియు మిథ్యాప్రపంచమునుండి ప్రసంగించుట లేదు. నే నేమి చెప్పినను మంత్రివర్గనిర్ణయమును మార్పగల్గుదు నని తలంచుట లేదు. బహుశః వారినిర్ణయము ఇదివరకే స్థిరపడి యుండవచ్చును. శుష్కతర్కములవలనగాని, రాయబారముల వలనగాని ఆనిర్ణయ మెన్నడును మారదు.

"విప్లవతత్త్వముయొక్క మూర్తిమంతమే కాంగ్రెసు. రాయ బారములవలన భారతీయుల కడగండ్లు గట్టెక్కించునిమిత్తము మీరీసభను పిలిచినారు. అటువంటి ఈసభలో 'విప్లవము' అనుమాట పలుకరాదని యెరుగుదును.........స్వాతంత్ర్య సంపాదనకొరకై యీస్వాతంత్ర్యకాము లెందరో ప్రాణములకు తెగించి వీరులై పోరులు సల్పినారు. ఎందరో శత్రువుల కడన రంగమున బలియైనారు. ఎందరో వీరస్వర్గము నలంకరించినారు. చరిత్ర కని విని యెరుగని ఈమార్గమును కాంగ్రెసు అవలంబింప సమకట్టినది. అదియే శాసనోల్లంఘనాస్త్రము. దాని ననుసరిం చియే ఇంతవరకు కాంగ్రెసు నడచుచున్నది. ఈ అస్త్రమును ప్రయోగించునెడల ప్రపంచములోని యేప్రభుత్వమైనను సైరింప దనిమీరు హెచ్చరించుచున్నారు. సరే! ఏప్రభుత్వమును సహింపక పోవచ్చును. కాని ఏ ప్రభుత్వమైనను అహింసాస్త్రమునకు దాసోహ మనక తప్పదు. దీనికి నిదర్శనము బ్రిటిషుప్రభుత్వము, డచ్చిప్రభుత్వము. స్మట్సుఅంతటి మహారథికుడుసయితము ఆత్మ గౌరవముకొరకు పోరాడుచు అమాయికపురుషులను, స్త్రీలను ఎందరినో ఉరికంబముల నెక్కించుటకు, కీరంగిగుండ్ల కెర చేయుటకు వెనుదీయలేదు. 1908 లో ఏమైనను లొంగరా దనుకొన్న ఆ ఘనుడే 1914 లో వీరిపై తన అస్త్రము లన్నియు విఫలమౌటచే లొంగక తప్పినదికాదు. ఇండియాలో షెమ్సుఫర్డ్

ప్రభువుకూడ అదేతీరున నడచినాడు. బోర్సదు, బార్డోలీలలో బొంబైగవర్నరును అదే దారి త్రొక్కినాడు.... ...

"అటువంటి యుగసంగ్రామమునకే భారతీయుల పాల్పరచుట నాకు సంతోషము కాదు. సుఖమును లేదు. కాని అగ్నిగుండములో నుఱకవలసివచ్చుచో నాదేశము ధర్మమని భావించిన దానికొరకు ప్రాణము లర్పించుటకై మహానందముతో ముందుకుఱుకుటలో వెఱువను. బ్రిటిషువారిని ప్రత్యక్షముగా బాధింపబోవుట లేదు. మేము ఆత్మార్పణము చేసికొందుము; పరుల ప్రాణములు తీయబోవుట లేదు. ఆహుతి అగుచుంటి మను విశేషసంతృప్తి మాకుండును.

"మించిపోకమునుపే కాంగ్రెసు ఎందుకు పోరాడుచున్నదో మీరు తెలిసికొనగోరుచున్నాను. నాప్రాణము మీ చేతులలో నున్నది. యావత్తుకాంగ్రెసుకార్యసంఘసభ్యులయు, అఖిల భారతకాంగ్రెసుసభ్యులయు ప్రాణములు మీ చేతిలో నున్నవి. నోరును,వాయియు లేని కోట్లకొలది భారతీయుల ప్రాణములును మీ చేతిలో నున్న వనుమాటనుగూడ మరువదగదు."

ఈ నిష్కపటపు ప్రకటనయు, అందు వ్యక్తీకరింపబడిన సత్య, అహింసా, ధర్మనిర్వచనములును, భారతదేశవాంఛలును, సాధనోపాయములును బ్రిటిషుప్రభుత్వమువారికి భీతిగొలిపెను. గాంధీజీ భారతదేశమునకు రాగానే గవర్నమెంటువారు గాంధీజీని చెఱసాలకు బంపిరి. దేశమున కల్లోలము హెచ్చినది. ప్రజలను అదుపులో నుంచుట సాధ్యపడ దని వైస్రాయి బ్రిటిషుగవర్నమెంటువారికి తెలుపుటయు తటస్థించినది.

## 9. రాయబారములు

1930 వ సంవత్సరపు ఉప్పుసత్యాగ్రహామువలన ప్రజలకు భారత దేశమునందలి బ్రిటిషుపాలకుల గుట్టు తెలిసిపోయినది. ఈ దేశపాలకుల అధికారము ప్రజామోదము లేకయు ప్రజల క్షేమలాభముల ప్రసక్తి లేకయు వారు చేసిన శాసనములపై నిలచియున్నది. అది చీట్లపేకముక్కలతో కూర్చిన భవనము వంటిది. ఏచీటిముక్క తొలగించినను ఆభవన మంతయు కూలిపోవునటుల ప్రభుత్వమువారు రచించిన ఏకుటిలశాసన మును ప్రజలు ధిక్కరించివేసినను వారి అధికారబల మంతయు కూలిపోవును. ఆ రహస్యమును గుర్తించిన గాంధీగారు ఉప్పు చట్టమును ధిక్కరించివేసి సముద్రపు నీటిని తెచ్చి కాచి ఉప్పును చేయు డనియు, దొరతనమువారు కొఠారులవద్ద రాసిచేసి యుంచిన ఉప్పుపై దాడివెడలి తల కొక గుప్పెడు ఉప్పును తీసి కొనిరం డనియు బోధించెను. తాను దండీగ్రామమునందలి కొఠారుపై దండెత్తెను. ఆ సమయమున ప్రజలలో రేకెత్తిన యుత్సాహము వర్ణనాతీతము. స్త్రీలు, పురుషులు, చిన్నలు, పెద్దలు, ఆబాలగోపాలము సముద్రతీరములను చేరి ఆయా తావులందు ఉప్పుసత్యాగ్రహము చేసిరి. లక్షలకొలది జనులను జైళ్ళకు బంపవలసివచ్చినది. ప్రపంచములో నేప్రభుత్వమునకును సాధ్యపడని కార్య మది. ఇందరిని కాల్చి చంపుద మన్నను సాధ్యముకాదు. ప్రళయబాంబు (అటముబాంబు) ప్రతాపము ఇట్టి సత్యాగ్రహమహిమముందు పేలవమై పోవును. బల వంతమైన సర్పము చలిచీమలచేత చిక్కి చచ్చుచందమైనది పరిపాలకుల ఘనత.

ఈ విచిత్రశక్తిని చూచిన వైస్రాయి భారతప్రజల నింక యణచిపెట్టి యుంచుట అసంభవ మని ఇంగ్లాండు ప్రభుత్వము వారికి తెలిపినాడు. దీనితో దండనీతి విఫల మైనదని తెలిసి సామోపాయముతో రాయబారములను ప్రయోగింపసాగిరి. ఆ ప్రయత్నములలో నొకటియే రౌండుటేబుల్ కాన్ఫరెన్సు. అ దెట్లు విఫలమైనదో గ్రహించితిమి. కాని పశుబలవ్యామోహితు లగు బ్రిటిషుఇండియాపాలకులు మరల దమననీతినే సాగించి గాంధీగారిని, నాయకులను, వారి అనుచరులను జైళ్ళకు బంపిరి; ఏ నీతినియమములును లేక ప్రజలను హింసింపదొడగిరి; 1935 వ ఇండియా ఆక్టు నొక దానిని కూర్చి దండోపాయములతో సామదానోపాయములను జతచేసిరి. ఆ ఆక్టు ప్రకారము బ్రిటిషు, భారతజాతులమధ్య సమరసభావమును పెంపొందించుదు మనిరి; ప్రభుత్వాధికారమును ధారాళముగా భారతీయులచేతిలో పెట్టుదు మనిరి; బ్రిటిషుజాతిపాలకుల అధికారప్రయోగములకు హద్దు పెట్టుదు మనిరి; ఘనతరాధికారపదవులను భారతీయనాయకుల హస్తగతము చేయుదు మనిరి. ఎంతయైనను స్వార్థబుద్ధి కుటిలనీతికి దారిదీయును. ఇండియాను దోచుకొని జీవించు బ్రిటిషరులు వాగ్దానముల నంత తేలికగా నిర్వర్తించుట యసంభవము. ఆ రహస్యము నెఱింగిన విజ్ఞులు వల దనుచున్నను చాలమంది భారతీయ నాయకులును, వారియనుచరులును ప్రభుత్వస్థానములో ప్రవేశించిరి. ఆయదనున బేధోపాయమును పునఃప్రయోగించుట మొదలుపెట్టి రెండవ ప్రపంచసంగ్రామ సమయమున కొందరిని యండ జేసికొని భారతీయామాత్యులను, నాయకప్రముఖులను సంప్రదింపనైన జూడక యుద్ధప్రకటన జేసిరి. కాంగ్రెసుమంత్రి

వర్గములు రాజీనామా యీయవలసివచ్చెను. ముస్లిములీగర్లు దొరతనమువారిచంక నెక్కియున్నవారే గాన ప్రభుత్వమునకు సాయముగ నిలిచిరి. ఏపార్టీకి వాటముగ లాభము చేకూరిన ఆపార్టీలోకి జొరబడజూచు కమ్యూనిస్టుపార్టీమీది నిషేధముల దొలగించి దొరతనమువారు బహూకరించిరి. బ్రిటిషరులు పాల్గొనుచున్న యుద్ధమును 'ప్రజాయుద్ధ' మని చాటుటేగాక యుద్ధమున నితరులచే బలవంతముగా జొప్పింపబడనిరాకరించిన కాంగ్రెసును తూలనాడ మొదలిడిరి. వైస్రాయి తనమంత్రము ఫలించిన దనుకొని దమనతంత్రమును నిరాఘాటముగా సాగించెను. ప్రజలను నడపుటకు నాయకులా లేరు. వారు జైళ్ళలో బంధింపబడియున్నారు. ఐనను ఉప్పుసత్యాగ్రహము నుండియు దొరతనపుపస నెరింగిన ప్రజలే ధైర్యముతో తిరుగు బాటులకు సాహసించినారు. సత్యాగ్రహధర్మమున సుశిక్షితులై యుండని కారణమున కొన్ని అత్యాచారముల గావించిన మాట యథార్థమే. వానిని సాకుగా గొని ప్రభుత్వము కడు నిష్ఠురచర్యలకు గడంగినది. కాని ప్రజల నడంచివేయుటలో తమ ఆయుధములు నిష్ప్రయోజనము లని గ్రహించినది.

1942 వ సంవత్సరారంభమున క్రిప్సుదొర రాయబారము నడుపవచ్చినాడు. శుష్కప్రియములను సాగించినాడు. జైళ్ళలో నున్న నాయకులను చాలమందిని విడిచిపుచ్చునటుల చేసెను. భారతీయుల కోర్కెలు సమంజసమే యనెను. కాని బేధోపాయమును వీడజాలడయ్యెను. తుదకు ఏపక్షమునకు హితవుకాని సంస్కరణలను ప్రతిపాదించెను. వైస్రాయి శతవిధముల ప్రజలను వశీకరణ చేసికొనజూచెను. ప్రయత్నము ఫలించలేదు. ముస్లిములీగువారి జాతిద్వయసిద్ధాంతమునకు ప్రోద్బల మిచ్చి

యున్నాడు. హిందూముస్లిముల ద్వేషములు పెరిగినవేగాని దేశమున శాంతి నెలకొనదయ్యె. ప్రపంచయుద్ధమునుండి భారతప్రభుత్వము విరమణముగాంచినను భారతప్రజ సాగించు సత్యాగ్రహయుద్ధమునుండి విరామము వారికి చిక్కలేదు.

వంక దిద్ద ప్రయత్నించినకొలదిని మెలికలు తిరిగిపో సాగిన బ్రిటిషుపరిపాలనమును ఛేదించివేయ నెంచి కాంగ్రెసుప్రముఖులు 'క్విట్ ఇండియా' తీర్మానమును గావించిరి. దాని వివరములను విశదీకరించి తెలుపబూనిన గాంధీగారికి అవకాశమునీయ నిరాకరించి గాంధీగారిని, తక్కుంగల కాంగ్రెసునాయకులను చెఱలలో బంధించివైచిరి. 'బ్రిటిషరులారా! భారతదేశమును విడచి పర్వెడు' డను నినాదములతో దేశము పిక్కటిల్లిపోయినది. దొరతనము పరివర్తనము చెందునది కాదుగదా! దమనచర్యలు సాగించినది. కందిరీగలగూడు చెదరగొట్టినట్లైనది. ప్రజలు ద్రేకులైరి. బడులలోని విద్యార్థులుసైత ముగ్రులైపోయి గురుజనుల హెచ్చరికను లక్ష్యముచేయక 'క్విట్ ఇండియా' నినాదముల బలపరచిరి. యుద్ధకాలమున సుభాస్ బోసు నాయకత్వమున నేర్పడిన భారతజాతీయసైనికులు దేశపరిస్థితుల గాంచి మాతృభూమిసేవలు చేయ ప్రతినబూనిరి. 'ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతా'నని మ్రోగిన యుగంధరుని కేక లోకింత మారి 'ఢిల్లీనుండి వైస్రాయిని వెడలగొట్టుతా' మనునట్టి నినాదములు ప్రతినోట విననయ్యెను. లండనులోని సామ్రాజ్యపీఠము అదరినది. ప్రపంచమంతటి దృష్టియు భారతభూమివైపు తిరిగినది. జైళ్ళలో నున్న దేశభక్తులసంకల్పములు రాతిగోడల ఛేదించుకొనిపోయి ప్రపంచజనుల నాకర్షించు

చుండెను. దశదిశలనుండియు భారతీయుల వాంఛలు సద్ధర్మ సహితము లను ఘోష వినవచ్చుచుండెను.

1946 వ సంవత్సరారంభమున బ్రిటిషుసామ్రాజ్యామాత్యవర్గమునుండి ముప్వురు మంత్రులు వచ్చి భారతదేశమున వ్రాలిరి. ఆయాపార్టీలతో మంతనము లాడిరి. అందరును నేకీభవింపజాలకున్నను నొక్క-నిర్మాణసభయందు గుమిగూడి మీ దేశపరిపాలనకు మీరిచ్చగించు పథకమును గూర్చుకొను డని కొన్ని సూచనలను చేసి చనిరి. కాని దానిలో జాతిద్వయసిద్ధాంతమునకు ప్రేరేపణ నిలిపి దేశైక్యతకు సమ్మతించినటుల తీర్పు నిమిడించిరి. రణవీరుడు భేదదండోపాయచతురుడు వేవెల్ ప్రభువు వైస్రాయిగా నున్నాడు. కాంగ్రెసుయొక్క దేశైక్యదృష్టిని సమర్థించునటులనే నటింపుచు దేశవిచ్ఛేదనకు కంకణము కట్టుకొనిన ముస్లిమునాయకుడు ఖాయిదే అజాము జిన్నాగారిని రెచ్చగొట్టసాగినాడు. అతడు బహిరంగముగా హిందువులు ముసల్మానులకు సహజవైరు లనియు, వారినుండి విడిపోయి పాకిస్థానమును సంస్థాపించుకొనుటకు రక్తప్రవాహములు దేశమును ముంచినను వెనుదీయ మనియు, అహింసాసిద్ధాంతమునకు తలయొగ్గి పట్టువిడుచువారము కామనియు, ప్రలాపించుచుండ వైస్రాయి ఆవిషయము తనకు సంబంధించినది కానటుల తూష్ణీంభావము వహించినాడు. కాంగ్రెసును, ముస్లిమేతరులగు వర్ణములవారును, మంత్రిత్రయప్రణాళిక ననుసరించి రాజ్యాంగనిర్మాణసభ్యుల నెన్నుకొనిరి. కాని ఒక పేచీ పెట్టినారు. ముందుగా చీలిపోయి తదనుసారముగ రాజ్యాంగనిర్మాణమునకు గడంగవలయునని ముస్లిములీగు వాదనబూనినది. కాంగ్రెసువారు ' రాజ్యాంగనిర్మాణమున నందరము కలసి

పనిచేయవలెను. అవసర మని నిర్ణయ మగు నెడల తదను సారముగా పాకిస్థానమును సర్వస్వతంత్ర ప్రత్యేక రాజ్యముగా ప్రకటించుకొనవచ్చును.'అనియనిరి. ఈవాదనతో నేకీభవించిన వారందరును రాజ్యాంగనిర్మాణసంఘముగా నేర్పడి పనుల సాగించిరి. ముస్లిములీగువారు వారితో సమావేశము కా నిరాకరించిరి. కాని తాత్కాలిక ప్రభుత్వవర్గమున తాము చేర వలయునని పట్టుబట్టిరి. వైస్రాయి ఇటు కాంగ్రెసుతోడను, నటు ముస్లిములీగువారితోడను సంప్రదింపులు జరుపుచు, ముస్లిములీగువారు రాజ్యాంగనిర్మాణసభలో చేరుదు రనుచు తాత్కాలిక ప్రభుత్వమున జేర్చినాడు.అటుల ప్రభుత్వమున జేరిన పిమ్మట లీగువారు రాజ్యాంగనిర్మాణమున జేర నిరాకరించినారు. మీదుమిక్కిలి 15_8_47 తేదీని పాకిస్థాన మని ప్రకటించి ముస్లిములను ప్రదర్శనములను, నూరేగింపులను గావింపు డని ప్రేరే పించుటేగాక ఆదినమును బెంగాలులో ముస్లిము మెజారిటీ ప్రభుత్వ ముండుటచేత పబ్లికు సెలవుగా నిర్ణయించిరి. ఇంక నేమి? మతావేశపరులు, దుండగీండ్రు చెలరేగి లూటీలు చేయుట, ఇండ్లు తగులబెట్టుట, హత్యలు గావించుట, స్త్రీల మాన భంగము జేయుట, శిశుహత్యలను జేయుట, ప్రజలను బలా త్కారముగ మతాంతరులను జేయుట మొదలగు ఘోరరాక్షస కృత్యముల సల్పిరి. ఈ నౌఖాలిదురంతములు ప్రపంచప్రసిద్ధి గాంచినవి. వైస్రాయి ఆ భీభత్సరంగములకు పోయివచ్చి యుదాసీనత వహించినాడు. దేశమం దంతటను హాహాకార ములు చెలరేగినవి. బీహారులో నౌఖాలిదురంతముల ప్రతిబింబ ములో యన ఘాతుకచర్యలు సాగినవి. ఇవి పంజాబున కెగ ప్రాకినవి. ఈ నాటికిని బెంగాలు పూర్ణశాంతిని గనలేకున్నది.

పంజాబులో రోషానలము చల్లారకుండెను. డిసెంబరులో బ్రిటిషు సామ్రాజ్యప్రధాని ముస్లిములీగు, కాంగ్రెసుకలిసి ఇద్దఱిద్దఱు చొప్పున సంప్రదింపునకు లండను రమ్మనెను. వీరు వెళ్ళివచ్చిరి. దేశపరిస్థితులు అదుపులోనికి రాలేదు. హిందూముస్లిముతగవులు దేశమంతయు నలముకొనున ట్లుండెను. 1947 జూన్ నెల 3 తేదీని బ్రిటీషు కేంద్రప్రభుత్వమువారు హిందూస్థాన మని పాకిస్థాన మని రెండు అధినివేశప్రభుత్వముల నిర్మాణము చేసి వారిచేతులలో ఆగస్టు 15వ తేదీలోపల భారతప్రభుత్వాధికారమును విడిచివేయవలె నని నిర్ణయించిరి. తదనుగుణముగా బెంగాలు, పంజాబు రాష్ట్రములలోని ముస్లిము, హిందూ మెజారిటీ జిల్లాలను పాకిస్థాన్, హిందూస్థానములలో చేర్చివేయ నిశ్చయించిరి. ఇంకను కొన్ని విభజనలు తమ ప్రకటన కనుసరణముగా చేయుటకు పూనుకొనిరి.

# మన కర్తవ్యము

## రెండవ భాగము

భారతదేశము ఎట్లు పరాధీన మైనదో, మహోన్నతదశ నుండి యెట్లు కడు నికృష్టస్థితికి గూలినదో, స్వాతంత్ర్యమును మరల సంపాదించుటకై యెట్లు ఆయా ప్రయత్నములు సాగినవో, అవెట్లు ప్రముఖములై ప్రజలనెల్ల యిక్కట్టులపాల్సేసెనో సూచించితిమి. ఈ వైరములవలన పర్యవసించిన ఘాతుకకార్యములను మే మభివర్ణింప నవసరము లేదు. అవి ప్రతిదినము రేడియోవార్తలమూలమునను, వార్తాపత్రికలమూలమునను, నాయకుల ప్రచారప్రకటనలవలనను తెలియుచున్నవి. జరిగిన దేమో జరిగినది. హిందూముసల్మానులు జాతిద్వేషమునకు జెందనీ, చెందకపోనీ భారతదేశమున కలిసి జీవించక తప్పదు. ఇరువురకును నేడు మాతృదేశ మొక్కటియే యని యొప్పుకొనక తీరదు. భారతదేశపు కలిమిలేములను కలిసి యనుభవింపక వీలులేదు. కలిసియుండిన పోరును, విడిపోయిన వీలును కలుగు నని వాదించు ముసల్మానుసోదరుల వాదన నంగీకరించి ముమ్ముందు స్వాతంత్ర్యమును సిద్ధింప జేసికొనుట సమంజసము. ఆపిమ్మట ప్రేమమూలమునను, పరస్పరసానుభూతి సహకారములవలనను మనస్సులను కలుపుకొని, సహజశత్రుజాతు లనెడు దుర్భ్రమను సమయింపజేసికొనినపిమ్మట సమైక్యతను సాధించుకొను టెంతయు సులభమగును. ఆశుభస్థితిని పొందుటకు అవలంబింపదగు కర్తవ్య మేమనియే మన మిప్పుడు

విచారింపదగిన యంశము. గతజలసేతుబంధనము వలదు. ఈ సందర్భమున గాంధిమహాత్ముని బోధలు ప్రచారము గావించు టయే ఈగ్రంథముఖ్యోద్దేశము. తక్కినవిషయము లన్నియు ఆనుషంగికముగా కూర్చినవే. 'మనకర్తవ్య మేమి?' ఈవిచారణ యందు ప్రతివ్యక్తియు తన కర్తవ్యమును నిర్ధారించుకొని దానిని నిర్వహింపవలసినదే గాని యెదిరివారుగాని, తోడివారు గాని కర్తవ్యమును నిర్వర్తించుచున్నారా? నిర్వర్తింతురా ? అనెడు శంక పెట్టుకొనదగదు. ప్రపంచములో ప్రతియొక్క రును వారివారి కర్తవ్యమును నిర్వహించినారు. నే నొక వ్యక్తినే వెనుకబడినా నని యూహచేయుచు మెలగవలయును.

## 1. కాంగ్రెసు బాధ్యత

మహాత్ముని వాణిని వినుము :—

"కాంగ్రెసువార మని చెప్పుకొనువారికిని, కాంగ్రెసునెడల అభిమానము చూపువారికినిమాత్రమే గాక, కాంగ్రెసు నెడ వైరభావము చూపెడువారికిసయితము సేవచేయు వర్తనను వహించుహేతువువలన తాను అఖిలభారతదేశమునకు ప్రాతి నిధ్యము పూనదగుదు నని కాంగ్రెసు చెప్పుకొనుచున్నది. ఫ్రెంచిఇండియా యని పేర్కొనబడినను, పోర్చుగీసుఇండియా యని పేర్కొనబడినను, లేక సంస్థానాల యిండియా యని పేర్కొనబడినను, యావద్భారతదేశమునకును ప్రాతినిధ్యము వహింపగల నని వాదించుచున్నది. హిందూదేశమున గల సంస్థ లన్నింటిలోను తా నొక్కటియే యేకైకప్రతినిధిసంస్థ యని కాంగ్రెసు వక్కాణించుచున్నది. ఆకారణముచేతనే లండనులో రౌండుటేబిలు కాన్ఫరెన్సునందు ఆవాదనను నే ననువదించి

యుంటిని. కాబట్టి బీహారురాష్ట్రకాంగ్రెసువారు గాని, మఱే రాష్ట్రకాంగ్రెసువారు గాని తమ మట్టుకు తాము నిర్దోషుల ముగా నుంటి మని తృప్తిజెందజూచునెడల కాంగ్రెసుసంస్థను ఒక సామాన్యతుచ్ఛపాక్షికసమితిగా చాటినవా రగుదురు. ఆకారణమువలన కాంగ్రెసుగోత్రీకులు సకలసంఘములవారి యొక్కయు, సమస్తమైనవర్గములవారియొక్కయు, దుష్కార్య ములకుసయితము తాము బాధ్యత వహింపవలసినవారుగా నున్నారు. కాంగ్రెసు పుట్టినదాదిగా నట్టిగౌరవమునకు తా నర్హత గలిగియున్నటుల సగర్వముగా వాదించువాదన యథా ర్థము కావలయు ననునెడల యావద్భారతదేశముయొక్కయు శారీరిక, ఆర్థిక, నైతిక, పరిస్థితులను సరిచేసి యభివృద్ధిపఱచు పవిత్రధర్మమును పూనుకొనవలయును.

“ఒకానొకక్షణమున ప్రబలమగు ఉన్మాదమునకు పోయి ఆ బీహారుప్రజలు తాము మనుష్యుల మనెడు మాటనే మఱచి, తుంటరిమూకలో కలిసిపోయి రనియు, వారు చేసిన కృత్యము లకు కాంగ్రెసుగోత్రికులు బాధ్యులు కాజాల రనియు, కావున కాంగ్రెసువారు నింద్యులు గా రనియు వాదింపబూనునంతటి అపచారమునకు బీహారు హిందువులు పాల్పడ రని నే నాశించు చున్నాను. ఇటీవల జరిగిన ఘోరాతిఘోరములగు ఉన్మాదచేష్ట లలో యథార్థమునకు ఒక్కకాంగ్రెసు గోత్రికుడైనను పాల్గొని యుండలే దని వాదించినను గూడ దోషమే యగును. ఈ బీహారుఘాతుకచర్యలకు సాటిరాదగు దుస్సంఘటనలు చరి త్రలో నెక్కడను లేనేలే వని ప్రకటింపసాహసించు ముసల్మా నులు కలరు. వారు సుపిపాసులును, హతభాగ్యులు నైయుండి బీహారుహిందువులనెత్తిన పెద్దనిందను మోపుచున్నారు. అటు

వంటి ముసల్మానుమిత్రులను, సోదరులను సంరక్షించుటలో కాంగ్రెసుగోత్రీకు లనేకులు తమ ప్రాణముల నొడ్డియున్నారని వచించినను తగిన సమాధానము కాజాలదు. బీహారుహిందువులు కావించిన వానికన్న ఘోరాతిఘోరతరకార్యముల గావించిన మానవరాక్షసులు కల రని చారిత్రకోదాహరణములు కల వని ఋజువుచూప బూనుకొంటినా నేను చాల చూపగలను. కాని అట్టి సామ్యములను, తారతమ్యములను నెంచి చూపబూనునంతటి అవ్యక్తుడను నేను కానెంచుటలేదు. ఎవరెవరి దుష్కార్యములనో బంగారుత్రాసునం దిడి తూచి హెచ్చుతగ్గుల నిర్ణయించుట నాకోరిక కాదు. ఇంత యేల ? నిజముగా పశ్చాత్తప్తుడగువా డెవడును, తాను తనపూర్వీకు లంతటి చెడ్డవాడను కా నని ఆత్మతృప్తి చేసికో నెంచడు. మేలికార్యములు చేయుచు సేవ లొనర్చుటలో తనపూర్వపు వారికన్నను, తనకంటెనుకూడ అధికాధికముగా పూనిక వహించి పోటీపడి ముందునకు బోవుటకు సముచితావకాశ మెంతయేని కలదు.

## 2. ఆపదల మఱచు టెట్లు ?

"తమప్రియబంధుజనులను, చిరకాలము శ్రమపడికట్టుకొనిన కొంపలను కోల్పోయినవారు క్షమపూని,విస్మృతివహింపగల్గుట చాలదుర్లభము. దుండగీండ్రు చెలరేగిన సంఘమునెడ ద్వేషము పూనక సోదరభావముతో మన్ననచేయుట యెట్లు పొసగగల దని ప్రశ్నించుచున్నారు.

"క్షమపూని విస్మృతివహించుట కొకే మార్గము కలదు. నవకాళీ, త్రిపురములవారు కావించిన దుష్కృత్యములకన్నను

ఘోరతరకార్యముల కావించినది బీహారని భావన చేయుటయే అమార్గము. బీహారుహిందువులు సలిపిన ఘాతుకకార్యములకై ముసల్మానులు తీవ్రప్రతీకారము సలుపుట మీకు సమ్మతము కాగల్గునా ? అది మీకెన్నడును సమ్మతము కాజాలదుకదా. అతినికృష్టమగు పశుదశకు మీరు పడిపోవుటకు కోరుకొనరేని అకారణముచేనైనను సహనము వహించుటయు, దోషములను మఱచుటయు మీరు నేర్చుకోవలయును. మఱియు ఎదుటివారి కన్న మీరే హీనుల మని భావించుకోదగును. కాని సాహస వంతులై యుండవలయును. క్షమ యనునది సాహసవంతుల లక్షణము. అది వారి కొక యలంకార మనదగును. మీరు వాస్తవమగు ధీరులు కానలయును. నిజముగా సాహసికు లగు వారు దెబ్బ వేయుట కొడంబడరు. తామే శాంతులై సంతో షముతో బాధల నన్నిటిని భరింతురు. వైరిని నిరాయుధుని జేయుటకు అది యొక్కటే వాస్తవమగు నుపాయము. దౌర్జన్య రహితమగు నిరోధము నవలంబించుటకు దౌర్జన్యపూర్వక మగు పోరాటములం దవసరమగు సాహసమును మించిన శ్రేష్ఠ తరమగు సహనమే కావలసియుండును. క్షమాధృతి ధైర్య వంతుల లక్షణమే గాని పిఱికివారికి నైజమగు గుణము గాదు. మహాభారతమునం దొకకథ గలదు:—విరాటరాజుమందిరమందు పాండవు లజ్ఞాతవాసము చేయుచుండిరి. అప్పుడు వారిలో నొక నికి ప్రమాదవశమున గాయము తగిలినది. ఆ విషయమును పాండవులు రహస్యముగ నుంచిరి. అగాయమునుండి నెత్తురు నేలపై బడినయెడల విరాటరాజునకు కీడు రాగల దని ఆ నెత్తుటి నొక బంగారుగిన్నెలో పడునటుల జేయుటకు జాగ్రత్తపడిరట. అట్టి క్షమాధృతియు, ధైర్యమును హిందువులైనను, ముసల్మాను

డైనను, క్రైస్తవుడైనను, పార్శీయుడైనను లేక శిక్కు-మతస్థుడైనను ఏభారతీయుడైనను సరియే అలవఱచుకొనగోరెదను. ప్రస్తుతపు మనపతనమునుండి మనలను పరిరక్షింపజాలునదటువంటి క్షమయే.

## 3. ఆపదలందు ధైర్యము

"ఆపదలందే ముఖ్యముగా ధైర్య మవలంబింపవలయును. ఇక్కట్టులు పైబడుసమయమున విలపించువారు బానిస లైపోదురు. మిలిటరీవారి రక్షణను వాంఛించువారు దాస్యమున జిక్కి పడియుందురు. ప్రజలు పరస్పరము పోరాటములు మానుదు రనియు, బానిసలు గాకుండ తప్పించుకొందు రనియు నాయభిలాష. భారతీయులు పరస్పరము పోరాటములు సలుపుకొనుచుందురేని తమవినాశనమునకే గాక, ప్రపంచవినాశనమునకును దారితీసినవా రగుదురు. అక్షీణములగు హిమశైలములచే పరిపోషితములై, సకలకిల్బిషహారములై పఱగు గంగా స్రవంతులచే చెన్నారు భారతభూమి హింసాచర్యలవలన వినాశమై పోవలసినదేనా ? సాయుధసేనల నిలుపుకొను తలపును దూరీకృతము చేసికొందురుగాక యని మి మ్మర్థించుచున్నాను. అయ్యవి మనల నుద్ధరింపజాలవు. అవి ప్రసాదింపజాలు స్వాతంత్ర్యము నిరుపయోగమేసుమీ !

"నవకాళీలో ఘటిల్లిన దురంతముల తీవ్రతను బీహారుఅరికట్టెనను వాదనను భారతదేశమునం దెల్లెడలను హిందువులు పట్టుకొని ప్రాకులాడుట గాంచిన నా కెంతయు విచారము కలుగుచున్నది. అటుల తలచుటయు, ఆరీతిగ వర్తించుటయు నిరంతర దాస్యమునకును, నరకమునకును దారితీయు నని గట్టిగ నొక్కి

చెప్పగలను. అక్కడ ప్రదర్శితమైన పశుత్వము నాగరికతను గాపాడు ననిగాని, మతమును సంరక్షించు ననిగాని నమ్ముచో నరుని పిఱికితనమునే అది వెల్లడిచేయును. ఒక పక్షమున పిఱికి తన మొప్పుడు ఘటిల్లునో రెండవపక్షమున నదియే క్రూరత్వము నకు మూల మగునని నా కిటీవల గలిగిన ప్రత్యక్షానుభవమును బట్టి చెప్పగలను. కాబట్టి నవకాళీలో జరిగిన దురంతములకు దగిన శాస్తి గావించు విధానముగా అచ్చట నవకాళీలోనివారు గావించిన రాక్షసచర్యలనే బీహారులో ప్రతిఫలింపజేయు విధానమును సాధనము చేయగడంగుట సమంజసము కాజాలదు. కసిదీర్చుకొనవలయు నను సంకల్ప మిసుమంతయు లేకుండ స్వీయప్రాణార్పణము గావించు సాహసచర్యయందు గల పౌరుషవృత్తి యెట్టి దురంతచర్యకైనను ప్రతిక్రియ కాగలదు. కాని అటులచేయుతరిని స్వకీయధర్మమును,గౌరవమును విడనాడ దగదు. ఎటు చూచినను సార్థక మనందగు స్వాతంత్ర్యమును భారతదేశము పడయవలయు నని యథార్థముగా వాంఛించు నెడల క్రూరదుశ్చర్యల పరిత్యజించు డని యీనావాక్కుల వినువారిని, మఱియు వారిద్వారమున అఖిలభారతజనావళిని హెచ్చరింప గోరుచున్నాను. అటులగాక, దుష్టచర్యలకు పాల్పడువా రెల్ల భారతమాతృవిముక్తిని దూరముచేసినవా రగుదు రని గ్రహింతురుగాక.

" అపకారము చేసియున్నవానికి అపకారము చేయదగదా యని యొకరు వ్రాయుచున్నారు. నాసమాధాన మిది: ఒకడు నన్ను దూషించె ననుకొనుడు. వానిని మఱల దూషించుటకు నేను పూనుకొనదగదు. ఒక దోషమునకు మారుగా మఱొక దోషమును గావించుటవలన మొదటిదోషము నది పరిహరించు

టకుబదులు దానిని వృద్ధిచేయుటకే ఉపయోగపడగలదు. ఒకా నొక దుష్కర్మ దానిని మించిన వేఱొక దుష్కర్మవలన చల్లారజాల దనుట సార్వజనీనధర్మసూత్రము. దౌర్జన్యమును సమయింప దౌర్జన్యరాహిత్యము లేక నిర్నిరోధవృత్తియే సమర్థమైనవి. కాని నిర్నిరోధవృత్తి యనుదానికి తఱుచుగా అపార్థము కల్పింపబడుచున్నది. మఱియు విపరీతార్థమును సయితము కల్పనచేయుచున్నారు. దౌర్జన్యవిసర్జనము గావించిన నరుఁడు దౌర్జన్యమునకు పూను దుండగీనిమైూల వంగిపోవలయు ననుట యెంతమాత్రము దాని యర్థము కాదు. దుండగుని దౌర్జన్యమునకు బదులుగా దౌర్జన్యమును సలుపబూనకున్నను ఆతఁడు బలాత్కరించి చేయు మను దుర్నీతికార్యములకు సమ్మతింపక ధీరతతో నిలువబడవలయును. నిర్నిరోధవృత్తి యన నిజమగు అర్థ మిదిసుమా !

“ మిలిటరీవారు వచ్చి ప్రవేశించుటచేత పంజాబులో నేదో యొకరీతి శాంతి నెలకొనెనని యొకమిత్రుఁడు వ్రాయుచున్నాఁడు. ఆతీరుశాంతి ‘ స్మశానవాటిశాంతి ’ యనందగును. ప్రజలు చాటుమాటుగా ఘోరతరములగు పోరాటములకై సంసిద్ధులగుచునేయుండిరట ! ఆయుధములు ప్రోగుచేయబడుచున్నవట! తుదకు మిలిటరీవారుసయితము ప్రజలను అదుపులో నుంచుట దుస్సాధ్యమై పోగలదు. మిలిటరీవారియొక్కయు, పోలీసువారి యొక్కయు సాహాయ్యముతో నెలకొలుపబడు శాంతి యెంత మాత్రమును శాంతియే కాదు. ఇది నానిశ్చితాభిప్రాయము. అహింస ప్రసాదింపగల వాస్తవమగు ధైర్యమును ఇరుతెగల వారుగాకున్నను, ఒకపక్షమువారైనను పూనుకొగల్గునెడల యథార్థమగు శాంతి అప్పుఁడు నెలకొనగలదు.

"ఆడువారిని, పసివారలను వధలపాలుచేయుటలో వీరత్వము లేదని బీహారుజను లిప్పుడు గ్రహించియున్నారు. అట్టిది కేవలము పిఱికిచేష్ట. ఆర్భాటరహితమగు బలముతోగూడిన వాస్తవికవీరచర్యను బీహారువారు ప్రదర్శించి ప్రపంచమంతటికని సత్యమౌ జీవితపథమును తన్మూలమున ప్రకటింపజాలుదు రేని అదెంతయు మహోఘనకార్యము కాగలదు.

## 4. అధర్మచర్యలు

"అహింసాపథమునుండి తొలగి, 1942 వ సంవత్సరమున మీరు త్రొక్కిన కుటిలమార్గమే నేడు నేను ప్రస్తావించు అపకృతులకు హేతువై యుండనోపును. టిక్కెట్లు లేకుండ ప్రయాణములు చేయుటకును, అక్రమముగా రైళ్ళలో గొలుసులు లాగుటకును, అసమంజసముగ కసిదీర్చుకొన బూనుటకును, మఱియు జమీందారుల పంటలను, ఆస్తులను తగులబెట్టుటకును మూలమై మిమ్ము పట్టి పీడించుచున్న అధర్మబుద్ధి యిందుకు నిదర్శనమే. ఇట్లనుచుంటి నని నేను జమీందారీపద్ధతిని ఆమోదించువాడ ననుటకు అవకాశము లేదు. తద్వ్యతిరేకముగా నేను పల్మారు ప్రసంగించియుంటిని. ఐనను నేను జమీందారులకు శత్రువును కాను. నాకు శత్రువు లనుచు నెవరును లేరు. దేనివలన మనము మిక్కుటమగు అనర్థముల ననుభవించుచుంటిమో అటువంటి ఆర్థిక, సాంఘికవిధానములను సంస్కరించుకొనుటకు మన మవలంబింపదగు నుత్తమమార్గము బాధాసహన మనెడు రాచబాటయే. ఆబాటనుండి యొకింత తొలగితిమా, దౌర్జన్యమును పూనితిమా దాని సాహాయ్యమున మన కేకీడును దొలగించుకొనుటకై పెనగు

లాడుచున్నామో ఆఅనర్థముయొక్క స్వరూపములో మాత్రము ఒకింత మార్పుచేసికొనజాలుదుము. దౌర్జన్యమూలమున అట్టి అనర్థముల నెన్నడును సమూలముగా నాశనము చేయజాలము.

“మనము ఉత్తమమానవధర్మమును విడిచి, దెబ్బకు బదులు దెబ్బ కొట్టవలసినదేనా ? ఎవడో యొక మహామ్మదీయుడు వివేకమును పోనాడుకొని, దేవళము నొకదానిని అమాంగల్యము చేసియో, విగ్రహముల బగులగొట్టియో యుండెననుకొనుడు. ఆకారణముంబట్టి హిందువు డొకడు మసీదును ధ్వంసము చేయవలయునా ? అటుల చేయుటవలన పాడువారిన దేవాలయమును రక్షించుటగాని, హిందూమతము నుద్ధరించుటగాని యగునా ?

“నామట్టుకు నేను ఎంత విగ్రహారాధకుడనో అంతవిగ్రహవిధ్వంసకుడనుకూడను. మీ రంగీకరించినను, అంగీకరింపకున్నను నామాట లాలకించు మీలో హిందువులైనను, ముసల్మానులైనను, మఱేమతస్థులైనను నావంటివాడే యగును. సాంకేతికములకొఱకై మానవజాతి యంతయు ఆరాటపడుచున్నది. నిజమునకు మసీదులైనను, చర్చిలైనను, దేవాలయములవంటివే గాదా? భగవంతు డెల్లెడల వ్యాపించియున్నాడు. నరుని శరీరమునం దెట్లో వాని రోమమునందును, రాళ్ళరప్పలందును అట్లే వ్యాపించియున్నాడు. ఐనను మానవులు కొన్ని స్థానములకన్న మఱికొన్నింటిని హెచ్చుగా పవిత్రము లని భావనచేయుచుందురు. అట్టిభావనలు ఇతరుల స్వేచ్ఛకు భంగకరములు కానంతవరకు మాననీయములే యగును. ఏలాంటి బలాత్కారమునకైనను సరియే, మీరు లొంగిపోక సాత్వికము

గను, నిశ్చలతతోడను నిరోధింపవలసినదే యని నా సలహా. అర్చనయందు నా కండదగిన స్వాతంత్ర్యము భంగపడునెడల, ఉపేక్షించుటకుమారుగా నావిగ్రహమును నాహృదయమునకు హత్తుకొని దానిని సంరక్షించుకొనుటకై ప్రాణములనైన నర్పింపగోరెదను.

"దార్ఢ్యపూర్వకముగా నెదిరించుటకు వలయుదానికంటె శ్రేష్ఠతరమగు పరాక్రమము సాత్వికనిరోధమున కవసరమగును. బాదుషాఖాను అహింసామార్గమును చేపట్టిన యుదంతమును తెలిపెదగాక. ఆతడు దెబ్బకు దెబ్బవేయు జాతియందు పుట్టినవాడు. రక్తపాత హేతువులగు తగవులాటలను పారంపర్యముగా నేర్చుకొను జాతి వారిది. ఆతడును వాని ననుసరించిన యుదంతములు చాల కలవు. పరంపరా వచ్చుచుండు వారి పోరాటములే పఠానుజాతియొక్క దాస్యమును స్థిరపరచుచుండె నని బాదుషాఖాను స్వానుభవమువలన గ్రహించినాడు. అహింసాపథము నవలంబించినాడు. ఆత డహింసాధర్మము నవలంబించినసమయమున పఠానుజాతియం దొకపరివర్తనము కలిగినటుల తెలిసికొనినారు. కాని పఠానుజాతి యంతయు పరివర్తనము చెందె ననుకొనతగదు. ఆతడు ప్రేమను, సేవాభావమును పూనుటవలన తోడివారిహృదయములను ఆకర్షించుకొనజాలుటంబట్టి ఫకీ రని పిలువబడుచుండిన బాదుషాఖాను అహింసాధర్మమును ప్రీతిపూర్వకముగా చేపట్టె ననియు తలంపరాదు. కాని అహింసాతత్త్వము నొకింత గ్రహించి, ఆయన దినదినము దాని పరమగమ్యమును సమీపించుచున్నా డని నే నెఱుంగుదును. వానిది సాహసోపేతమగు అహింసా వ్రతము. ఎల్లఱును వాని ననుకరింపనగును.

“బీహారుసోదరులు ఉన్మాదచేష్టలకు గడంగి ఎంత దిగజారి పోయినారో వారు గ్రహించునట్లు తెలుపగోరెదను. మీరు గావించిన దోషములకై పరితాపము నొంది, పరిహారము గావించునటుల మిమ్ము ప్రోత్సహించుటే నా సంకల్పము. నే నింతకుముందే చూచివచ్చిన ముసల్మానుసహోదరులజీవములయు, వారిగృహములయు వినాశము నాకంట్ల నీరొలికింపజేసినది. కాని హృదయమును రాయి జేసికొని, తమ ముసల్మానుసోదరులయెడ హిందువులు నిర్వహింపదగు ధర్మ మేమో బోధించుటకై యిక్కడికి వచ్చినాను. వాస్తవమగు పశ్చాత్తాపమునకు వాస్తవమగు ధైర్య మవసరము. చాంపరానుసత్యాగ్రహాధ్యాయములలో మహోన్నతస్థానము నందికొనజాలిన బీహారు——బుద్ధభగవానుడు సంచారమును చేసి ధర్మోపదేశముల గావించిన బీహారు——తానేయున్నతపదవిని నిలిచి భారతదేశమునకంతటికిని తన దివ్యతేజమును బంచియిచ్చెనో ఆ పదవిని మఱొకసారి అలంకరింప సామర్థ్యము కలదియే. కాని యకలంకమగు అహింసాధర్మ మొక్కటియే మి మ్మాపదవి నలంకరింపగా చేయగలది.

“రాష్ట్రీయ ముస్లిములీగు కార్యదర్శి గౌరవపురస్సరముగా నాకడకు వచ్చి ఆర్తులగు ముసల్మానులు తిరిగి తమ యిండ్లకు రాదగిన వసతులను గవర్నమెంటువారు సమకూర్చినను హిందువుల చిత్తవృత్తి ఆయార్తులకు ధైర్యమొసగజాలునంత సౌమ్యమైనదిగ లేదని మొఱలిడినారు. మీలో ప్రతియొక్కరును వాస్తవికపరిస్థితులను తెలిసికొని తదనుగుణముగా వర్తించుటకు స్థిరసంకల్పము పూని, లేశమైనను వైరభావము లేకుండ పెకలించి వేయుటకును, మీ యిరుగుపొరుగు ముసల్మానులు

మఱొకసారి వచ్చి వెనుకటిటీరున సోదరులై, మిత్రులై మీ మధ్య కాపురముచేయుట సుసాధ్యమగుటీరున వర్తించుటకును కృతనిశ్చయులు కావలసియున్నది. బీహారు హిందువులు ఇట్టి స్థిరసంకల్పమును నిష్కపటముగా పూనినటుల గాన్పించుటలేదు. దౌర్జన్యవిధానమే యీకాలమునకు దగిన పౌరుషపథ మని భావించినటు లున్నది. అటులగుచో ధారాళముగ ఆసత్యమును చెప్పివేయుచుండుగాక. సత్యప్రకటనమువలన నేను బాధపడను. కాని అహింసావిధానము వ్యర్థము చేయటం జూచి నేను జీవింప సహింపజాలను. నేను మురిపెముతో జూచుకొను గమ్యమును సాధించునిమిత్తము నే నెచ్చట ప్రాణముల నర్పించినను నొక్కటియే. భారతదేశములో నే తానైనను భారతభూమియేకదా! కాని అహింసాధర్మము తుదిని విజయప్రభలతో వెలుంగగల దను ఆశనుమాత్రము విడువనొల్లక ప్రీతిమెయి పట్టుకొనియేయున్నాను. ఏ మందురా? మన దురదృష్టపు దేశమాత పొందగలుగు శాంతికిని, సాధింపగలుగు పురోవృద్ధికిని తగు ఆశాజ్యోతి యీ అహింసావిధానమునందే బీహారీనాడు ప్రకటింపవలసిన ఆదర్శమునందే కలదుసుడీ!

## 5. దౌర్జన్యమునకు ఫలము

"పాసాగ్రామమున విధ్వంసము గావింపబడిన ముసల్మానుల కొంపలను గాంచినాడను. నాకండ్ల కగుపడిన ఆ దృశ్యము, సామాన్యముగా శాంతిజీవులగు బీహారుప్రజలను తాత్కాలికముగా ద్వేషజలరాశిలో ముంచివేసిన యాయున్మత్తత నన్ను చకితుని జేసినవి. నవకాళీలో జరిగినదాని కిది బీహారు గావింప తలపెట్టిన శాస్తిమాత్రమే యని యెవరేని భావించునెడల,

కనిదీర్చుకొనుటకు దగినమార్గ మిది కాదని నేను గట్టిగా నొక్కి చెప్పగోరెదను. భారతీయులలో ఒక సంఘమువారు వేఱొకసంఘమువారిని శత్రువులనుగ జూచు మన స్తత్వము ఆత్మవిధ్వంసకమై మనదాస్యమును శాశ్వతముగ స్థిరీకరించుటకే ఉపకరించును. ఈ మన స్తత్వము తుదిని మనుష్యుని స్వాభిమానములోనికి బడవేయును. అప్పు డతడు ఏ మాత్రము సందు దొఱకినను తదితరము సంతను త్రోసిపుచ్చి, తనయొక్క గ్రామస్వాతంత్ర్యమును మాత్రమే ఘనముగా నెంచుకొనును. దానినే తృప్తితో కోరుకొనును. నేను కోరున దేమనగా భారతభూమిలో ఎక్కడ ఎవరు ఏ దోషకార్య మొనరించినను దానికి ప్రతిభారతీయుడును బాధ్యత వహింపవలసినదే యనెడు భావమును మీ రెల్లరు పెంపొందించుకొగల రనుటే. ప్రతి యొక్కడును దానిబాధ్యత తనతలపై నున్నటుల నెంచుకో వలయును. ఆ దోషమునకై పరిహారము నొసగు బాధ్యతను గూడ పంచుకోవలయును. తదితరమార్గ మేదియైనను పంజా బులో నేడు మనము గాంచుచున్నటువంటి దురాగతములకే దారితీయును.

"ఇచ్చటి ప్రజాప్రతినిధులచేతిబీలో హారును విడిచివేసి పంజా బులో శాంతి నెలకొలుపునిమిత్తము న న్నచటికి రమ్మను చున్నారు. ప్రతిచోట నే నేమో మహాత్కార్యము చేయగల ననుకొనునంతటి అహంభావము కలవాడను కాను. నేను భగ వంతుని చేతిలో నత్యల్పమగు నొకయుపకరణమునుమాత్రమే. బెంగాలు,బీహారునందలి సోదరసంఘములమధ్య మైత్రిని,శాంతిని నెలకొలుపు ప్రయత్నమున కృతకృత్యుడ నగుటయో లేక గత జీవుడ నగుటయో యిప్పుడు నాప్రధానాశయము. ఊహింపగా

ముసల్మానుసంఘములు రెండును సంధి కుదుర్చుకొని నాసేవ యనవసర మనుదాక నే నిచ్చోటునుండి వెడలిపోజాలను. నే నీతరుణమున పంజాబున కేల పోజాలనో తెలియకున్నను, నా వాక్కు అచ్చటి హిందువులకును, ముసల్మానులకును, శిక్కులకును చేరగల దనియే ఆసించుచున్నాను. వారి నిప్పు డావహించి గట్టిగ పట్టుకొని పీడించుచున్న పశుత్వము తొలగించు కొనుటకు వారే ప్రయత్నింతురుగాక.

"హిందువులును, ముసల్మానులును సఖ్యత గలిగి యిరుగు పొరుగున బంధువులరీతిని కాపురములు చేసిన కాలము గలదు. అట్టివా రీనాడు పరస్పరము స్నేహభావముతో జూచుకొన నొల్లని పరిస్థితి యేర్పడిన దనుకొన్నను ఒండొరులు శత్రువులుగ భావించుకొనకుండినను బాగుండును గదా!

"హోళీపండుగదినము లాసన్న మగుచున్నవి. ఈ హోళీ పండుగసందర్భమున హిందువులు తమపైన మరొకసారి దౌర్జన్యముల సాగించు నవకాశము గలుగునేమో యని ముసల్మానులలో భీతి యేర్పడినది. నవకాళీ, త్రిపుర పట్టణములలో హిందువులవలన వినిన కథనమునే బీహారులోని ముసల్మానులవలన వినవలసివచ్చుట విడ్డూరముగ నున్నది. నవకాళీలో వినివచ్చిన సుద్దులే పాట్నాలోను వినవచ్చుట చూడ నాకు లజ్జవొడముచున్నది. నవకాళీలో నేను హిందువుల కేమి చెప్పియుంటినో, దానినే బీహారులో ముసల్మానుసోదరులకును చెప్పగోరుచున్నాను. అదేమన, తాము నరునికి భయపడుట మాని దైవముపెడ విశ్వాసము బూనియుండు డనుటే. కాని అయ్యది సరళముగా జరుగు పరిస్థితులందు చెప్పదగినమాట యని యెఱుంగుదును.

'వందే మాతరం', 'జై భారత్', 'జై హింద్' అను నినాదములు నేడు ముసల్మానులకు భీతి గొలుపుచున్నవి. 'భారత్‌కీ జై' అనుమాటకు కటూ 'ముసల్మానుకు క్షై' అను అర్థమైపోయెనే! పరిస్థితు లాదశకు వచ్చుట జూచి సిగ్గగుచున్నది. అనేకులగు ముస్లిములీగుమిత్రులను నేను గలిసికొనుచున్నాను. నాతో వారు కపటము విడిచి మాట్లాడుచుందురు. 'బీహారువంటి రాష్ట్రములో, నిజముగా ముసల్మానులకు నిలువ నీడ లేదా?' యని వారు ప్రశ్నించుచున్నారు. ప్రస్తుతపరిస్థితిలో డాక్టరు సయ్యదు మహమ్మదువంటి కాంగ్రెసు గోత్రీకుడు సయితము ఆందోళనపడుచున్నాడే! సోదరుని జూచి సోదరుడు భయకంపితుడై పోవలసినస్థితిని చూడ నిజముగా నాకు దుర్భరముగా నున్నది. ఒక యున్మాదచేష్టకు ప్రతిగా మరొక యున్మాదచేష్ట నిజముగా జరుగనుండెనా? అదియే ఘటిల్లుచో, కటకటా! భారతభూమి రక్తప్రవాహములలో మునిగి తేలవలసి యుండునుగదా!

"దురంతములు సంఘటిలరా దనిగట్టిగా మనమునిశ్చయించుకొనినయెడల ఎన్నడునట్టిది ఘటిల్లబోదనియే నాగట్టినమ్మకము. నాయాశ లన్నియు స్త్రీజాతియందు నిలిచియుండును. వారు కేవలము అహింసాస్వరూపు లని నేను చెప్పగలను. వారు త్యాగమూర్తులు. అహింస తోడులేనిది సత్యధర్మము నిలువజాలదు. జరిగిపోయినదానింగూర్చి పశ్చాత్తాపపడుటే గాక, ముసల్మానులయెడ తమ పూర్వపు మిత్రభావమును మించిన అనురాగముతో హిందువు లిప్పుడు వారిం జూతు రనెడు నమ్మకమును ప్రతిముసల్మానుడును పొందగలుగుతెన్నున్న, ఈహోలీ పండుగను జరుపుకొందురు గాక యని ప్రతిహిందువును నేను

ప్రార్థించుచున్నాను. పూర్వపు స్నేహబంధములు పునర్జీవితము లైన లక్షణములు ప్రదర్శితము లగుతెఱగున ఈహోళీపండుగను వారు జరుపుకొనునెడల ఆపండుగ నిజముగా పవిత్రమహోత్సవమై తనరారగలదు.

చీనారాయబారియగు డాక్టరు 'లోచియల్ప్యాయెక్' గారితో గాంధీజీ యిట్లనిరి :

"నేను అనర్గళశుభోదర్కుడను. బెంగాలు, బీహారు, పంజాబు రాష్ట్రములలో నిప్పుడు జరుగుచున్న పరస్పరహత్యాకాండను చూచుచో మేము వన్యమృగజాతిగ మారిపోయినట్లే తోచును. ఐనను అట్లగుటకే యిన్నిసంవత్సరములనుండి అష్టకష్టముల కోర్చి మేము పాటుపడియుండలేదుసుడీ! మేము పరదాస్యమును నెట్టివేయుతరుణమున గాలిలో దుమ్ముదుమారములు పైకెగయులీల నివి సూచనలు మాత్రమే యని నా యభిప్రాయము. గంగానదికి వరదలు వచ్చుసమయమున నదీజలము కల్మషముతోగూడి నురుగులు గ్రక్కుచుండును. ఆ కశ్మలమంతయు నుపరిభాగమున తేలియాడును. ఆ వరదలు అణగిపోగానే వినిర్మలనీలోదకప్రవాహము కన్నులపండువుగా గోచరించును. నేను జీవించునది ఆ దృశ్యమును చూచు నిమిత్తమే. నా కట్టి యాశ లున్నవి. భారతప్రజలు మృగతుల్యులై పోనజూచుకొఱకు నేను జీవించుటలేదు.

"బీహారుహిందువులును, ముసల్మానులును మునుపటితీరున మైత్రిని పునఃప్రతిష్ఠించుకొని మనజూచుటే నా యాశయము. మీరు సోదరులవలె చూపట్టుటేగాక వాస్తవముగా సోదరులేమైరను ఖ్యాతిని గడించుకొనగల్గునటుల జీవింపవలయును. ఎప్పు

డెప్పుడో భేదాభిప్రాయములు పొడసూపుట, పోరులు పొసగుట ఘటిల్లునుగాక. అందుమూలాన నేటి విపరీతస్థితి తటస్థించునంతగా హృదయములు భిన్నములై దూరస్థము లగునంతటి విపత్తెన్నడును సంభవించియుండలేదు. నేడు మహావ్యథాకరములగు నుదంతములు వాటిల్లినవి. వాని నన్నింటిని నేకరువు పెట్టుట దుస్సాధ్యము. వాని నన్నింటిని వెనుకకు నెట్టివేసి యిట్టి పరిస్థితులలో మీకర్తవ్యకార్య మేమిటో యోచింపుడని కోరుచున్నాను.

## 6. రెండే రెండు మార్గములు

"భారతదేశమునెదుట రెండే రెండు మార్గము లున్నవి. పంజాబులో అవలంబింపబడుచున్నటుల గోచరించు దెబ్బకు దెబ్బ బదులుతీర్చు పద్ధతి యొకటి. అకుంఠితఅహింసావలంబనము రెండవది. బలప్రయోగమువలన నేదో యొకతీరు శాంతిని రాష్ట్రమున నెలకొలుపవచ్చును. కాని 1857 వ సంవత్సరమునందువలె ఘోరదురవస్థ దేశము నంతటిని నలముకొనకుండుగాక యని వాంఛించుచున్నాను. ఆసిపాయితిరుగుబాటుదినాలలో భీకరపరిస్థితు లేర్పడినవి. బలతరములగు ఆయుధప్రయోగమువలన దాని నడంచివేయగలిగినారు. స్థితిగతులు చక్కబడినటుల పైకిమాత్రము శాంతి చూపట్టినది. కాని బలాత్కారముగా నెత్తినిబడిన ఆధిపత్యమునెడ రగుల్కొనినట్టి క్రోధాగ్ని అంతర్గతమై లోతుగ చొచ్చుకొనిపోయి, ఆనాడు నాటబడిన విషబీజములపంటఫలమును నేడును మన మనుభవింపవలసియే వచ్చుచున్నది. ఈస్టిండియాకంపెనీస్థానమున బ్రిటిషుప్రభుత్వము వచ్చి నెత్తికెక్కినది.

"వారు వచ్చి పాఠశాలలను నెలకొల్పినారు. న్యాయస్థానములఁ బ్రతిష్ఠించినారు. వానితో మురిసిపోయిన భారతీయులు ఆమోదించినారు. పాశ్చాత్యసభ్యతను దేశమునం దంతటను వ్యాపింప జేయుటలో సహకరించినారు. ఎంత జరిగినప్పటికిని రాజకీయముగా నెత్తినిబడిన దాస్యంపు నీచదశయొక్క అవమానము దుర్భరమే యైనది. అదే తెలుగున నీనాడును పంజాబు ప్రజమీద బలప్రయోగము గావించి యల్లరులను నణంచివేసినను భవిష్యత్కాలమున చెలరేగగల పోరాటములకును, హిందూముసల్మానుసోదరీసోదరులమధ్య పొడసూపగల ద్వేషభావములకును, కారణములగు విషబీజములను దట్టముగా నాటుటకును నుపకరించును.

ఇటుల దౌర్జన్యమునకు ప్రతిగా దౌర్జన్యమును సలుపుట వలన హింసాచర్యలను సమయింపజాలము. హింసాచరణకు దగిన ప్రతీకారము పటిష్ఠమగు అహింసావలంబన మొక్కటియే. 1917 వ సంవత్సరమున చాంపరానుపట్టణమునందు బీహారు రాక నీతిపాఠమును నేర్చుకొనినది. ఆంగ్లజాతివారగు తోటలయజమానుల నెదిరించి సహాయనిరాకరణాస్త్రమును ప్రయోగించినప్పుడు ఆయుద్యమమును సాగించు బాధ్యత వహించిన రయితులు అచిరకాలముననే తమచేతులు వశముతప్పిపోకుండ నిలుపుకొనుటయందు సుశిక్షితులు కాగల్గిరి. ఐనను అప్పటిదగు వారి దౌర్జన్యరాహిత్యము దుర్బలుర దౌర్జన్యరాహిత్యముమాత్రమే యని యింతకాలముపిమ్మట నేడు బహుశః నేను తెలుపగలుగుచుంటినేమో! నేడు సోదరులు సోదరులతో పోరాటములు సాగించుకొనుచున్న యీతరుణమున ఆనాటి (దుర్బలుర) దౌర్జన్యరాహిత్యము ప్రయోజనకారి కాజాలదు. నేడు బల

యుతులు చూపగల దౌర్జన్యరహితచర్యమాత్రమే యథార్థముగా ప్రయోజనకారి కాగల దని తెలిసికొందుముగాక.

## 7. అహింసాప్రయోగము

"ముప్పదిసంవత్సరములకుపైగా సత్యాహింసల సువార్తలను ప్రజల కందజేయుచుంటిని. ఇరువదేండ్లపాటు దక్షిణాఫ్రికాలో అటులనే చేసియుంటిని. దక్షిణాఫ్రికాలోని భారతీయులు అప్పుడు న న్ననుసరించుటవలననే గణనలోనికి వచ్చి రనుట నిశ్చయమే. ఇచ్చటను సత్యాహింసల నవలంబించినవారు నష్టపడియుండ లేదు. సత్యముకొఱకై క్షణభంగురమగు విషయములను త్యాగముచేయు డని ప్రజలకు బోధించుట నావృత్తియైపోయినది. నేను పంజాబునకు పోయినను కసితీర్చుకోదగు నను బోధ చేయుటకొఱకు కాజాలదు. అటువంటి బోధ హిందువులకును, శిక్కులకునునే గాక ముసల్మానులకును అపకారకరమే కాగలదు. ప్రతీకార మనునది భగవంతునిపని యని బైబులులో గలదు. అ దెంతయు సమంజసము. ముసల్మానులు కానివారు శాంతిభద్రతలు కలిగి జీవింపజాలని పాకిస్థానమును, ముసల్మానుక్షేమలాభములు లభ్యముకాని హిందూస్థానమును అర్థవిహీనములే.

## 8. దక్షిణాఫ్రికాసత్యాగ్రహము

"దక్షిణాఫ్రికాలోని భారతీయులు సత్యాగ్రహధర్మసిద్ధాంతముల నంటిపెట్టుకొనియుండిరి కావుననే వారిసత్యాగ్రహచరిత్ర ప్రసిద్ధమై చిరకాల ముండగల దైనది. దక్షిణాఫ్రికాభారతీయుల పక్షమున నేను రెండుతడవలు ఇంగ్లాండునకు పోయినప్పుడు

వారి సత్యాగ్రహమే నాకు అండగా లేనియెడల నేనిసు మంతయు కార్యసాధన చేయలేకపోయెడివాడనే. కాబట్టి పంజాబునందలి హిందువులును, శిక్కులును మరణ మెప్పు డైనను ధ్రువ మని యంగీకరింతురేని చచ్చుటకైనను నోడం బడుదురేగాని చంపుటకు పాల్పడవల దని హెచ్చరించు చున్నాను. సాటిలేని సత్యాగ్రహబలమును వహించి బలవంత ముగా తమపైని పాకీస్థానమును దెచ్చిపడవేయు ప్రయత్నమును పంజాబీలు ఎదిరింపవలసినదే. మరణమే నా గతి యైనను నాయుద్యమనిర్వహణమున మరణించుటకు నేను వెనుదీయ బోను. ప్రతిమతమును అహింసాపాఠముల నేర్పుచునేయున్నది. కాని అహింసాసాధనను శాస్త్రవిధిగా నిర్ణయించినది భారత దేశముననే యని నేనభిమానపురస్సరముగా విశ్వసించు చున్నాను. మహాఋషు లెందరో తపశ్చర్యలయందు తమ జీవితముల నర్పణము గావించియున్నారు. వారి త్యాగప్రభా వమువలన స్వచ్ఛప్రభల నీను హిమగిరులుసయితము పవిత్ర భూతము లయ్యెనని కవు లెందఱో కీర్తించి ముదమంది యున్నారు. కాని, అటువంటి అహింసాధర్మము నేడు నామా వశిష్టమై పోయినదిగదా! హింసకు ప్రతీకారముగా అహిం సను, క్రోధమునకు ప్రతీకారముగా కరుణను ప్రయోగించు పవిత్రవిధిని పునఃప్రతిష్ఠించుట అత్యవసరముగా నున్నది. నిరప రాధులగు స్త్రీలను, పురుషులను, చిన్నబిడ్డలను హత్యగావిం చుట యెందులకో యోచింపుడు. అదంతయు మతమును సంరక్షించుటకేనా? పొరుగుసోదరుని చంపుమని యేమతమును ఎవరికిని ఎన్నడును బోధింపదు. నేడు జరుగుచున్నది వివేక శూన్యమగు వినాశకర్మయేగాని వేఱుగాదు. అది మతమువేర

జరుపబడినదా, స్వార్థచింతతో చేయబడినదా, పేఁ్‌ో్క తలం పుత్తో కావింపబడినదా యను విచారము మన కవసరము లేదు.

"కాఫరులను అనగా అవిశ్వాసులను వధింపవలసినదే యని ఖురాను బోధించుచున్న దనుచు రుజువుచేయుకొఱకై యొక మిత్రుడు కొంత వాఙ్మయమును నాకు బంపియున్నాడు. నేను నాజీవితకాలము నంతను ముస్లిములమధ్య గడపినాను. కాఫరు వనుచు నన్ను జంపుడని యెవఁడును హెచ్చరించియుండలేదు. నవకాళీలో నేను మహాల్వీలమధ్యనే నివసించియున్నాను. ఖురానులోని యావచనమునకు అవిశ్వాసులను భగవంతుడు శిక్షించు ననిమాత్రమే యర్థమని విద్వాంసులగు ముసల్మానులు తెలుపుచున్నారు. ముసల్మానులవిషయమునను దేవుడటులనే చేయు ననుచున్నారు. భగవంతుడు నరుని చైదములనే పాటించునుగాని వారాడు మాటలను పాటించడు. భాగవతమునందును, మనుస్మృతియందును, వేదములలోను నిట్టి శిక్ష లభివర్ణింపబడియున్నవి. ఐననుగూడ 'అహింసా పరమో ధర్మః' అనియే హిందూమతముయొక్క ఉత్తమబోధగా నున్నది. తులసీదాసుని వాక్కులు చిరస్మరణీయములు : 'మంచివారుగాని చెడ్డవారుగాని యెల్లరును దేవునిబిడ్డలే. నీరమును క్షీరమును కలిపివేసి తనముందు బెట్టునెడల హంస పాలను గ్రహించి నీటిని విడిచివేయుచందమున భగవద్భక్తులు మంచివారి నేరుకొని చెడ్డవారిని విడిచివేయుదురు?'

## 9. ఖివేదికలు

"ఎవరు గావించిన దుష్కృత్యములను వారు ఒప్పుకోవలయును. అది నాకు నిజమగు మనశ్శాంతి నొసగగలదు. చాల

మందిని తాము విచారించిన విషయములగూర్చి నివేదికలుపంపు డని కోరియున్నాను. వారిలో నొకరు ముసల్మానుపక్షమువారు ముందు చేయిమిగిలినా రని వాదించినారు. వాస్తవానికి తగ వెలా ప్రారంభమైన దను నంశము నాకు పట్టదు. ఎంతో హెచ్చుగా అధికసంఖ్యాకులై యున్న హిందువులు అధఃపతితు లైపోయి నిరపరాధులను హత్యగావించుట కెటుల పూనిరా యనునదే నావిచారము. సత్యమగు పశ్చాత్తాపమును, తదను గుణమగు పరిహారచర్యయుమాత్రమే ఈరెండుసోదరసంఘ ములమధ్యను శాశ్వతమగు సమాధానమును మఱల నెల కొలుపగలుగును.

"ఆ నివేదికలో ముసల్మానులచేతులలో బాధ అనుభవించిన హిందువులయెడ గవర్న మెంటువా రుపేక్షాభావమును వహించి రనెడు నేరము మోపబడినది. అటువంటి నివేదికయే ముసల్మా నుల దురవస్థలను ఉపేక్షించి రనెడు నేరమును మోపునది ముసల్మానులకడనుండి వచ్చినది. ఈ నివేదికలలో దేనిని విశ్వ సించుటకును నేను తొందఱపడుట లేదు. బాధ్యతాయుతమగు గవర్న మెంటు ఉపేక్ష వహించినను లేక వీరియెడగాని, వారి యెడగాని పక్షపాతము జూపినను అదెంతకాలమో మన జాలదు. వాదనల నన్నింటిని వినుటకును, భీకరకల్లోలకారణ ముల నన్నింటిని పరిశీలించుటకును, అట్టి విషాదసంఘట్టనలు మఱల సంభవింపకుండు మార్గములను, సదుపాయములను కను గొనుటకును నొక నిష్పాక్షికసంఘమును త్వరలో నియమింతు మని గవర్న మెంటువా రిదివఱకే ప్రకటించియున్నారు. నష్ట పడినవారికి పరిహారముల నొసగుటంగూర్చిన సలహాలను సయి తము ఆసంఘమువా రొసగగలరు. నా కుత్తరములు వ్రాసిన

వారు తమ తమ సాక్ష్యములను ఆ విచారణసంఘమునెదుట నుంచుటకై సిద్ధముగ నుంద్రుగాక. దోషారోపణ చేయుటగాని, న్యాయనిర్ణయము చేయుటగాని నాపని గాదు. మానవసేవయు, సంస్కరణోద్యమమును విసయమొప్ప పూనుకొనుటయే నాపని. కాని తెలిసిన యుదంతముల పాటించి దోషులను తమదోషము లనుగూర్చి పశ్చాత్తాపము జెందు డని నే నాహ్వానింపవలసి యుండును. ముస్లింలీగువారి నివేదికనుగూడ చదివినాను. వారి నివేదికలో అతిశయోక్తు లుండుట శోచనీయము. కాని వారి వ్రాతలో చాలసత్యము నున్నది. ఒకరు నివేదికలలో చదువు దానికిని, స్వయముగా చూచుదానికిని భేదము కాన్పించు చుండును. 'నవకాళీదిన' మను ప్రచారమునకు ఫలితార్థముగా బీహారుదురంతములు జరిగె నను వదంతి కలదు. మఱల పంజాబు దినప్రచారము జరుగు వను వార్తను విని బీహారుముసల్మా నులు కంపించిపోవుచున్నా రని వినుచున్నారము. అది నిరా ధారమగు వదంతియే యగుగాక. అటువంటి ప్రచారము లేవి యైనను సోదరసంఘములవారు తమలోతాము హత్యల జరుపు కొనుటకే మూల మగునుగదా! అటువంటిదే బీహారులో సంభ వించునేని, నే నాఅగ్నిజ్వాలలో పడి మరణించుటకైన నిష్ట పడుదు నని ముసల్మానుసోదరులతో చెప్పినాడను. ఆవిధమగు ఘోరములును, లజ్జాకరములు నగు దృశ్యముల గాంచు మని నన్ను సజీవునిగా నుంచకు మని భగవంతుని వేడుకొందునుగాక.

## 10. సర్వప్రేమ

" ఈప్రార్థనలకు వచ్చువారును, నానుసవినిగూర్చి వినువా రును మానవజీవితగమ్యముంగూర్చి గాఢవిచారము చేయుదురు

గాక. ఏశక్తి తమను సృష్టించినదో, ఏశక్తియొక్క అనుగ్రహము మీదను, అనుమతిమీదను, తమప్రాణవాయువు లాధార పడియున్నవో ఆదివ్యశక్తిని సేవించుటయు, దానిచే సృష్టింప బడిన లోకమునకు హృదయపూర్వకముగా సేవలుచేయుటయు వారి జీవనపరమార్థ మగును. అనగా ఎల్లెడల తాము చూచిన సర్వమును ప్రేమింపవలయు నని అర్థము. అంతియేగాని ద్వేషించుటమాత్రము తగదు. వీరు తమధర్మమును మఱచిపోయినారు. మఱియు తమలోతాము పోట్లాడుకొనుచున్నారు; లేదా అట్టిపోరాటములకు ఆయత్తపడుచున్నారు. ఈదురవస్థనుండి వీరు తప్పుకొననిచో, భారతదేశస్వాతంత్ర్యము అసంభవ మగు స్వప్నముమాత్రమే యగునని గ్రహింతురుగాక. బ్రిటిషువారి అధికారము దేశమునుండి తొలగినంతమాత్రాన తమకు స్వాతంత్ర్యము సిద్ధించు నని వీరు భావించునెడల, కటా! చాల పొరబడినవారే యగుదురు. బ్రిటిషువారు భారతదేశమునుండి వెడలిపోవుట తథ్యమే. కాని వీరు తమలో తాము కలహించుకొనుచుందునెడల వేఱొక ప్రభుత్వమో, ప్రభుత్వకూటమో వచ్చిపడి బ్రిటిషువారు విడిచిపోయిన స్థాన మాక్రమించుట తప్పదు. ప్రపంచ మంతటిని ఎదిరించి పోరాడగల మని మనవారు తలంతురేని అది వట్టిభ్రమయే కాగలదు.

“నేను నవకాళీలో నున్నను, బీహారులో నున్నను ‘కర్తవ్య నిర్వహణమో, మరణమో’ అనెడు ధర్మసూత్రము సదా నాయెదుట నుండును. అల్పసంఖ్యాకులసేవ విధ్యుక్తధర్మ మని నా అహింసాతత్త్వము బోధించుచున్నది. ఆయాతావులందలి హిందువులును, ముసల్మానులును తమ వైరభావముల విసర్జించి ఉభయసంఘములవారును కలసిమెలసి జీవింపగల్గుచో నేను

పునర్జన్మ నంది మహాబలసమన్వితుడనై పుట్టినటుల సంతసింతును. అట్టి పునర్జన్మ సిద్ధించుటకు ఎంతటి యీవేదన యుండవలయునో దైవమునకే యెఱుక. పూర్ణప్రయత్నము చేయుచు అట్టి నడకయందు మరణించుటయే మానవుని ధర్మము. భగవంతుడు సర్వశక్తిస్వరూపుడు. మనమో దాదాపు శక్తిశూన్యులమే అనవలయును. ముసల్మానులయెడ నేను మిత్రభావముతో వర్తించుటవలన హిందువుల యోగక్షేమములను బలిపెట్టుచుంటి నని నిందించు లేఖ లెన్నియో వచ్చుచున్నవనిన మీ కాశ్చర్యము గొలుపును. ముసల్మానులయెడ మిత్రత్వము వహించుటవలన నేను వాస్తవికిహిందువు నగుదు ననియు, హిందువులకును, హిందూమతమునకును మేలుగూర్చినవాడ నగుదు ననియు నా అరువదియేండ్లజీవితము రుజువుచేయజాలనియెడల వట్టిమాటలతో ప్రజలను నేనెట్లు నమ్మించగలను? సర్వభూతములయెడ మైత్రిగలిగి సకలజీవుల సేవించుటయే యథార్థమగు మతధర్మముయొక్క సారమై యున్నది. మాతల్లి యొడిలో నేను దీనిని నేర్చుకొంటిని. నేను హిందువుడనే కానని మీరు త్రోసివేసినను సరియే. ఇక్బలుమహాశకవిగీతమునుండి 'మజహాబ్ సహీ సిఖాతా ఆపస్మె బేర్ రఖ్నా" అనగా మతము ఏవానియెడను ద్వేషము బోధింపజాలదు అనెడు ప్రమాణమును జూపుటకన్న మఱేమియు ప్రతివాదము చేయజాలను. మిత్రునియెడ మైత్రిం జూపుట కడుసులభము. కాని వైరిగా జూచువానిని నెయ్యమున జూచుట వాస్తవికధర్మసారము సుడీ! తదన్య మంతయు వ్యాపారసరళిమాత్రమే యనందగును.

"నేను గవర్నరును జూచివచ్చితిని. ఏమి జరిగెనో యని ప్రజలాతుర పడుచుందురు. అటుల దర్శనముచేయుట నాకొక

మర్యాద. అంతియేగాని పూర్వమువలె గవర్నరులనుండి యేదియో అనుగ్రహములను సంపాదించుకొనుటకై నేను పోయి యుండలేదు. ఈ నాడు మనది బాధ్యతాయుతమగు పరిపాలన కావున నే నాశింపగల సేవలుగాని, ఉపకృతులుగాని ప్రజా ప్రతినిధులగు మంత్రులనుండిమాత్రమే. అల్పసంఖ్యాకులగు వారి సందర్భమున గవర్నరున కధికారములు గలవనుట నిజమే. అతడు నాయధికారములను కడునిగ్రహముతోడనే వినియోగము చేయగలుగును. నేను గవర్నరుతో చర్చించిన యంశములు మంత్రులకుమాత్రమే తెలుపందగినవై యున్నవి. కాని ఒక్క యంశమునుమాత్రము ఇక్కడ ప్రస్తావించుటకు నాకధికారము గలదు. ప్రజలకు బాధ్యులుగా నున్నవారు తమతోడ ప్రారంభములు చేయవలసియుందు రని గవర్న రనినప్పుడు నాకాశ్చర్యమును, ఆనందమును కలిగినవి. వ్యక్తిగతముగా వా రటుల స్వీయజీవితములతో ప్రారంభము చేసి పూర్ణత గాంచుటయందు క్రమాభివృద్ధి చూపనియెడల, వారు యథార్థమగు సంస్కర్తలుగాని, ప్రజాసేవకులుగాని కాజాలరు. సంస్కారములకు పురుషులు పూనుకోవలయును గాని, స్త్రీ లేమి చేయగలరను సంశయము గలదు. స్త్రీలు పురుషులకు లొంగిపోవలసినవారనిగాని, పురుషులకన్న తక్కువవా రనిగాని యెంచవలసిన స్థితి యెన్నడును లేదు. స్త్రీ పురుషునిలో అర్థభాగ మని అన్ని భాషలును చాటుచున్నవి. కేవలము తర్కదృష్టితోడ జూచినను స్త్రీ పురుషునిలో సగభాగ మని యొప్పుకోవలసివచ్చును. వారు వేర్వేరగు నిరువురు వ్యక్తు లని తలంపరాదు. ఇరువురును ఒక్కవ్యక్తిలోని రెండు అంశములే యనదగును. ఆంగ్లభాష యింకొకింత ముందునకు బోయి స్త్రీ పురుషునందు శ్రేష్ఠతరమగు

అర్ధాంశమని చెప్పుచున్నది. కాబట్టి అనర్థములను, అనిష్టములను, నిర్బంధములను నెదిర్చి స్త్రీలు సాత్వికనిరోధమును సాగింప దగునని నాసలహా. నియమనిబంధనము లన్నియు సక్రమముగ సాగవలయునన్నచో అవి ఐచ్ఛికములైనవిగా నుండవలయును. సాత్వికనిరోధమువలన కీడు మూడు ననుట కవకాశములేదు. నిర్మలమును, సవిమర్శకమును, గంభీరమును నగు వర్తన సాత్వికనిరోధమునకు ప్రోద్బలము నొసగగలదు.

## 11. పశ్చాత్తాపము

"నావిన్నపములు చెవులబడిన తావులందు న్యాయము జరుగ గల దనెడు ఆశతో శ్రోతలనుగుఱించి మఱొక విన్నపమును చేయుచున్నాను. బలవంతముగా తమయిండ్లయందు ఇంకను స్త్రీలు నిర్బంధమున నుంచబడియుండునెడల వారిని వారివారి స్వగృహములకు జేర్తురుగాక యని ఆశించుచున్నాను. అట్టి దుష్కర్మల గావించినవారలు సత్యమగు పశ్చాత్తాపమును చూపుదురుగాక. వారటుల పశ్చాత్తప్తులు కావలయు నని నచ్చజెప్ప ప్రయత్నించుట తమవిధిగా నెంచుట ప్రతివానికిని విధియైయున్నది. అట్టివారు పశ్చాత్తప్తులై తమదుష్కృత్యము లకై సాహసించి శిక్షలకు లోబడుదురుగాక. అంతటి సాహస మునువారు పూనజాలరేని, ఆ స్త్రీలను సురక్షితముగా నాకడకు గాని శ్రీరాజేంద్రప్రసాదుగారి కడకుగాని చేర్తురుగాక!

"బీహారుహిందువులు మాటమాత్రపు పశ్చాత్తాపమును తెలిపినను చాలదు. కష్టములపాలైనవారికి ధనరూపమున పరి హారము నిచ్చినను జాలదు. యథార్థముగా జరుగదగిన దిది: వారిహృదయములు పవిత్రభూతములు కావలసియున్నది. వారి

నావహించియున్న ద్వేషమునకో, ఉదాసీనతకో మారుగా వారి హృదయములందు ప్రేమ రాజ్యము చేయగావలయును. దాని ప్రభావమువలన ముసల్మానులలో ప్రతిపురుషుడును, ప్రతి స్త్రీయును, ప్రతిశిశువును పూర్ణమగు రక్షణ గలిగి యిసుమంతేని అభ్యంతరముగాని, ఆటంకముగాని లేకుండ తనతన మతానుష్ఠానమును సాగించుకొనగల స్వాతంత్ర్యము కలిగి యుండవలయును. ఈయుభయసోదరసంఘముల మధ్యమునను అటువంటిబాంధవ్య మేర్పడు అవకాశము గలుగుకొఱకు హోళీ పండుగ వినియోగపడుగాక యని మన మెల్లఱము ప్రార్థింతుముగాక.

"ఇంకను మీరు చేయవలసిన పనులు చాలగానున్నవి.మీరు ముందునకు వచ్చి మీరు గావించిన దుష్కృత్యములను కనీసము నాయెదుటనైనను ఒప్పుకోవలయును. అది నాకు మనశ్శాంతి నొసగగలదు. కొలదినెలలక్రిందట జీవకళలతో వెలయుచుండిన గృహములు ఈనాడు పాడుపడియుండుట యెల్లఱును తెలియునుగదా! ఇక చేయదగిన దేమి? వారు తమపాపములు కొట్టుకొనిపోవునను ఆశతో గంగలో మునుగుటకు పరుగుతీయుదురా? నిస్సహాయులై కుందుచున్న స్త్రీలయెడలను, బిడ్డలయెడలను వా రెటువంటి పాతక మొనరించియుండిరో ఆపాడువడియున్న తావులు కండ్లకు కట్టినటుల చూపుచున్నవి. ఏతీరున ఆపాప పరిహారము చేసికొనుటో యోచించుకొని కార్యశూరులు కావలసియున్నది. విధ్వంసము చేయబడియున్న యాగృహము లను బాగుచేసి శుభ్రపఱచి నివాసయోగ్యములుగ నొనర్పవలయును. జరిగినదానికై తమ పశ్చాత్తాపమును వెల్లడింపవలయును. నష్టపడిపోయిన సోదరులు తిరిగి తమతమగ్రామము

లకు రాదగు ననియు, అంతవరకును మనశ్శాంతి కలుగజాల దనియును చెప్పి వారు తిరిగివచ్చునటుల ప్రోత్సహింప వలయును. వా రెదురుతిరిగి, తమ మిత్రులును, బంధువులును మృత్యువునోట త్రోయబడినచోట ఆయిండ్లకు తాము తిరిగి వచ్చుటయు, అందు కాపురము చేయుటయు ఎట్లు పొసగగల దని మి మ్మడుగవచ్చును. వా రటు లడుగుట సమంజసమే. కాని అపరాధములు చేసినవారో, లేక వారిబంధువులో ఆర్తులైన వారికడకు పోయి పశ్చాత్తప్తహృదయములతో గతమును విస్మరింపు డనియు, అట్టి సంఘటన మజెన్నడును జరుగబో దనియు విశ్వాసము పుట్టునటుల చెప్పవలయును. అప్పుడు కఠినరాతినిబోలు హృదయముసయితము కఱగునని నాకు నిశ్చయమే.

"ద్వేషానలజ్వాలలనడుమ, మరుభూములమధ్యమున ఆరామ సీమలబోలి అల్లరిమూకలమధ్య దుండగీండ్రకు జంకక వారి నెదిర్చి పీడితజనుల జీవములను, ఆస్తులను గాపాడుచు ధీరులై నిలిచిన పురుషులు లేకపోలేదు. అట్టివారికి నాధన్యవాదము లవసరములేకపోయినను నేను నాధన్యవాదముల నర్పించుట అర్హమే యగును. నేను స్వయముగ బోయి వారిని దర్శింప లేకున్నను వారియోగ్యతను నేను గుర్తింపలేకపోలేదు. మఱియు ఆరోగ్యవంతులకడకు బోక రోగపీడితులకడకు బోవు డాక్టరువంటివాడను నేను. ఈపోరాటములందు జిక్కి దుఃఖముల పాలైనవారు ఉభయసంఘములందును గల రనుచున్నారు. వారందరికిని సాహాయ్య మవసరమే. సంరక్షకార్హులపట్టికలో నెల్లరను చేర్చవలసినదియే.

"ఇప్పటికి దాదాపు ఏబదిమంది దాగియుండిన దుండగీండ్రు ప్రభుత్వమునకు లోబడిపోయి రని విన్నాను. సంతోషము. ఈ అల్లరులలో పాల్గొనిన ఇతరులును అధికారులకు లొంగి పోయి తా మొనరించిన దోషములను బహిరంగముగా నొప్పు కొని యేశిక్ష ననుభవింపవలసివచ్చినను అనుభవింతురుగాక. అధికారులకు లోబడుపాటి ధైర్యములేనివారు నాకడకుగాని, బాదుషాఖానుగారికడకుగాని, మేజరుజనరలు షానవాజుగారి యొద్దకుగాని వచ్చి తమనేరములను ఒప్పుకొనదగును.

"మఱల పాకీస్థానుదినమును జరుపుకొనువిషయమై ముస ల్మానులు ఆయత్తపడుచుండి రని నవకాళీహిందువులు భయ పడుచుండిరట. ఖాదీప్రతిష్ఠానమునుండి యొకమిత్రుడు వచ్చి నవకాళీలోని పరిసితులు విషమించుచున్న వని తెలిపి యున్నాడు. ప్రస్తుతము బీహారునందలి నాపనిని విడిచివేయజాల ననియు, నాయుద్యమము బీహారులో జయప్రద మగునెడల దానిఫలితార్థము బెంగాలునందేగాక భారతదేశమం దన్నిభాగ ములందును సర్వత్ర ప్రతిఫలింపజాలుననియు నే నామిత్రునకు విశదపఱచితిని. భిన్నభిన్నవర్గాభిమానులు తమప్రాణములను, ఆస్తులను భగ్నముచేయకుండ సంరక్షించునిమిత్తము బీహారు నందలి ముసల్మానులును, బెంగాలునందలి హిందువులును నన్ను హామీగా అంగీకరింపగోరెదను.కార్యసిద్ధిని సాధించుటో మరణ మును పొందుటో నే నిచ్ఛగించుచున్నాను. నాసేవ లింక తమ కవసర ముండవని హిందూముసల్మాను లిరువురును ధృవపఱచు వఱకు నాధర్మమును నేను విడిచి తొలగిపోవు ప్రసక్తియే లేదు.

"13 వ ఏప్రిలు జాతీయవారమున తుదిదినము. అస్సాము నుండి సరిహద్దురాష్ట్రమువరకును, హిమగిరినుండి కన్యాకుమారి

వలెనకును ప్రజ లందఱు జాతీయవారమును జరుపుచున్నారు. యథార్థపు భారతభూమి యనందగు నేడులక్షల గ్రామసము దాయముయొక్క ప్రబోధమున కది నిదర్శనము. ప్రథమదినము ప్రబోధమును సూచించును; తుదిదినము జలియనువాలాబాగు దినము, ఆనాటి ఘోరయుదంతములను పునః స్మరించుట అనవసరము. ఆదినమున హిందువులయు, ముసల్మానులయు, శిక్కులయు రక్తధార లేకమై యొకేస్రవంతిగా వెల్లివిఱిసి ప్రవహించుటను స్మరణకు దెచ్చిన చాలును. ఆ 13 వ ఏప్రిలు దినస్మరణార్థము నేడు విచ్ఛిన్నమైయున్న ఐకమత్యమును పునః నిర్మించుటకై దీక్షవహించుట యెల్లఱకును విధియై యున్నది.

"భారతదేశములోని సాంఘికపు పోరాటములను గుఱించి విదేశీయులు న న్నడుగునప్పుడు సిగ్గుతో నేను తల వంచుకొన వలసివచ్చుచున్నది. ప్రతివాడును ఉన్మాదావస్థలో జిక్కి పోవుటలేదనిమాత్రమే నేను చెప్పగలిగిన దంతయును. ఈ ఘోరదుష్కృత్యము లన్నియు కొలదిమందియొక్క యున్మాద చేష్టమాత్రమే. ఈశ్వరానుగ్రహామువలన అందఱును సమై క్యము కాగల సుదినము రాగలదని విశ్వసించుచు దైవమును వేడుకొనుచుందుగాక!

## 12. గోమాంసభక్షణ

"ముసల్మానులు గోమాంసభక్షణ చేయుదురుగావున వారు హిందువులకు సహజశత్రువు లనియు, వధ్యులే యనియు హిందు వులు కొందరు సణుగుచున్నా రని విన్నాను. అది గోరక్షణ ధర్మ మట! గోరక్షణ యన నేమియో, దక్షిణాఫ్రికాలో నున్న ప్పుడు హైందవస్వారాజ్య మనెడు గ్రంథమున కొంత వ్రాసి

యున్నాను. గోమాతయందలి భక్తి నాకు చిన్నతనము నుండియు కలదు. గోవు అనగా కలిమి నొసగు కన్నతల్లి యని నానమ్మకము. ఐనను గోమాతసంరక్షణకుమాఱుగా గోరక్షణ సంఘములే గోమాతృవినాశనమున కుపకరించుచున్న వని ఆహైందవస్వరాజ్యమునందు వ్రాసియుంటిని. ఇప్పటికిని నా యభిప్రాయ మటులనే యున్నది. గోజాతిసంరక్షణసంబంధ మగు శాస్త్రమును, తత్సంబంధమగు కళయును విశాలహృద యము, యథార్థవిజ్ఞానము కలవారికిమాత్రమే యలవడగలవు. అప్పుడే గోమాతయెడ వాస్తవమగు భక్తి కుదురును. గోవును, గోసంతానమును భారతదేశ మంతగా హింసించు దేశము మఱొకటి భూలోకమున లేదు. ఐనను గోవునకు హెచ్చుగా పూజ లర్పించుదేశముసయితము ఇదియే యగుట కడు విచిత్రము. మన గోమాతృపూజార్పణములు మనమాటల లోను, మఱియు గోవధ చేయుదు రనుచు ముసల్మానులతో యుద్ధములు సాగించుటలోనుమాత్రమే కానంబడుచున్నవి. వారు తినెడు గోమాంసముకొఱకై ఆవులను జంపుదు రను కార ణమున ముసల్మానుసోదరులతో పోరాటములకు కాలుదువ్వు హిందూప్రజలే యొకవిధముగా చూచినచో ముసల్మానులను మించిన గోవిధ్వంసకు లని ప్రఖ్యాతిగాంచియున్న బ్రిటిషు వారియొక్క పరిపాలనకు లోబడియుండుటకు లజ్జింపకున్నారు. గోమాంసభక్షకు లను కారణముచేత బ్రిటిషరులతో నాకు విరో ధములేదు. డబ్బుకొఱకు కాశపడి బ్రిటిషుజాతిప్రభువులకడ దాస్య మున కొడంబడుచు ముఱిసిపోవు హిందువులు ముసల్మానులతో మాత్రము పోరాటములకుదిగుట జూడ నాకెంతయువిడ్డూరముగ దోచును. ఇంకను విపరీత మేమన, గోమాంసమును మెక్కు

హిందువులును కలరనుమాట మనము మఱచుచున్నారము. డాక్టర్లు విధించుచున్నా రను నెపముతో గోమాంససారము నాశ్రయించు పూర్వాచారపరాయణు లగు వైష్ణవాగ్రేసరులను సయితము నే నెఱుగుదును. ఖిలాఫత్తురోజులలో వేనకువేలుగా గోవులు ముసల్మానులకత్తికి ఆహుతిగాకుండ సంరక్షింపబడుట సుసాధ్యమయ్యె నని మీకు జ్ఞప్తిచేయగోరుచున్నాను. ఖిలాఫత్తును సంరక్షించుటలో హిందువులు ముసల్మానులకు సాయపడిరిగావున హిందువులకొఱకై గోవును సంరక్షించుట ముసల్మానులకు విధియని కీర్తిశేషులయిన మౌలానా అబ్దుల్‌బారీగారు వచించుచుండెడివారు. కాబట్టి యేదృక్పథమునుండి చూచినను ఆవులను జంపి వానిమాంసమును భక్షింతురనెడు కారణముతో ముసల్మానుసోదరులపై క్రోధమువహించుట హిందువులయెడ అర్థహీనమగు కార్య మని నాయభిప్రాయము. ఈవిషయమున హిందువులు కడు నసంగతముగ వర్తించిన యుదంతములను నే నెన్నింటినో చూపగలను. కావున పాడుపడి నేలగూలిన తమ కొంపను హిందువులు ముందుగ సరిదిద్దుకొందురుగాక యని నేను మనవిజేయుచున్నాను.

## 13. ఖురాను

నాప్రార్థనలో ఖురానువాక్యపఠనము చేయుటను కొందఱు హిందువులు ఆక్షేపించుచున్నారు. వా రటుల అభ్యంతరము తెలుపుటకు కారణ మేమియో నేను గ్రహింపజాలకున్నాను. కొన్నిచోట్ల ముసల్మానులు అత్యాచారములు సలిపి రనుట ఖురానుపఠనమునెడ వైరభావము చూపుటద్వారా ప్రతీకారము గావింపవలయు ననెడు వాదవయు నా కర్థమగుట లేదు.

ఖురానునుండి పఠింపబడు వాక్యములు భగవంతుని గూర్చిన మహోత్తమమగు స్తవరూపమున నున్నవి. అట్టి దైవస్తోత్రమును అరబ్బీభాషలో చేసినంతమాత్రాన హిందూమతమునకు వచ్చు ప్రమాద మేమి? ఎవడేని యటు లనునెడల వానిమత మేమొ, వాని ధర్మ మేమియో వానికి తెలియ దనుటకు నిదర్శనము. ఆస్తోత్రమునే దేవాలయములందును చేయనగునే! దాని యర్థ మీతీరుగ నుండును :—

"దుష్టుడగు సైతానునుండి తప్పించుకొను నిమిత్తము ఓ దేవా! నీరక్షణ నర్థించుచున్నాను.

ఓ దేవా! నీనామస్మరణ చేసి, సర్వకార్యములను నేను ప్రారంభించుచుందును.

నీవు కృపాళుడవు మఱియు దయాళుడవు నగుదువు. నీవే విశ్వస్రష్టవు; నీవ జగత్ప్రభుడవు. సర్వాధికారివి.

నేను నిన్నుమాత్రమే స్తుతింతును. నీప్రాపునుమాత్రమే అర్థింతును. న్యాయవిచారణ దినమున నీవ ధర్మనిర్ణయము చేయుదువు.

నాకు ధర్మపథమును జూపుము. నీభక్తులు త్రొక్కు త్రోవను నాకు జూపుము. నీయెడ నపరాధములు చేయువారల దుష్టపథము నాకు వలదు.

దేవు డద్వితీయుడు; నిత్యుడు; సర్వశక్తి సంపన్నుడు; అజుడు; ఆతనికి సాటివేల్పు వేఱొకడు లేడు. అతడేసకలసృష్టికర్త. వానిని సృష్టించినవాడు మఱియొకడు లేడు."

"ఖురానుషరీఫ్‌నుండి నా కీపద్యము నేర్పినది రైహానా తయాబ్జీ యను నొకముసల్మానుబాలిక. నే నీపద్యమును విడిచి వేయ సమ్మతింపలేకున్నాను. జైలులో నేను నిరశనవ్రతమును ముగించుతరి డాక్టరు గిల్డరుగారు జండవెస్టానుండి యొక శ్లోకమును పఠించినాడు. అప్పటినుండియు దానినిగూడ నా ప్రార్థనలో చేర్చితిని. ఈప్రార్థనశ్లోకముల నన్నింటిని చేర్చుట మూలమున రామభజనమునకును, రామనామమహిమమునకును లోటు చేకూర్చినవాడనుగాని, పెంపొందించినవాడనుగాని యగుటలేదు.

"ఖురానుపఠనమును నేను సాగించుచునే యుండునెడల నల్ల జెండాలతో ప్రదర్శనములు సాగింతు మని బెదరించుచు కొందఱు నా కుత్తరములు వ్రాయుచున్నారు. వార లెన్నిప్రదర్శనములు చేసినను బహిరంగప్రార్థనలను నేను సాగించుచునే యుందును. ప్రేక్షకులు వానిని సరకుజేయకుండ కూర్చుండ ప్రార్థితులు. దురదృష్టవశమున మీ రెల్లరును అట్టిప్రదర్శకులతో జేరిపోయి నల్లజెండాలు చూపుచు, లాటీలు పట్టి నన్ను చావమోదినను అట్టి మీయెడ ద్వేష మిసుమంతేని పూనకుండ దెబ్బలను తినుచునే భగవన్నామభజనము చేయుచుండుటే నాకోరిక. మీరు నాప్రాణములను తీయనుగూడ తీయవచ్చునుగాని ఆపిమ్మట మీరు గావించిన పనికై పశ్చాత్తాపపడవలసినవా రగుదురు.

అటులకాక నేను ప్రతీకారమునకు పూనుకొని కొందరిని చంపుటలో కృతకృత్యుడనే యగుదునుబో తుదకేని మీరు నన్ను చంపితీరుదురు. మఱియు నాపై మహావిజయమును సాధించినటుల ప్రగల్భములు పలుకుదురు.

నా కభ్యంతరమును తెలిపిన సోదరికి నేను చెప్పు సమాధాన మిది: 'నేను ఖురానును చదివియున్నాను; నీవో చదువలేదు. నీ వనినటుల ముస్లిములుకానివారిని ముస్లిములు చంపవలయు నని యెచ్చటను ఖురానునంతటిలోనూ బోధింపబడియుండలేదు. సకలమానవులయెడలను న్యాయముగా వర్తింపవలయు నని ఖురాను బోధింపుచున్నది. కాని ముసల్మాను లందఱును ఆ ధర్మమును నిర్వహించుచున్నా రనజాలను. అదేతీరున హిందువు లందఱును గీతోపదేశమును, వేదబోధను తమ జీవితములందు అనువర్తించుచున్నా రనజాలను. హిందువుల అకార్యములవలన వేదశాస్త్రాదులకు కళంకము రాజాలనివిధముననే ముస్లిముల దుష్కార్యములవలన ఖురానుబోధకును కళంకము రాజాలదు. వారిలో కొంద ఱున్మాదులై, ఉద్రేకముపొందిరనుకారణమున వారిధర్మగ్రంథమును ద్వేషించుట సమంజసము కాజాలదు. సర్వత్ర దైవమును గాంచజూచునతడు సర్వజీవులందును, సకలభూతములందును భగవంతుని దర్శింపగల్గును. ప్రతిమతమునందును, ప్రతిధర్మగ్రంథమునందును, ప్రతిభక్తుని వాక్కునందును ఈశ్వరవాణిని గుర్తించు పురుషునితోడ సతతము భగవంతుడు వెనువెంట నుండును. అతడు భగవంతు నెన్నడును మఱువడు. అతడు తనవెంట సదా భగవంతు డున్నటులనే భావించి ఈశ్వరసన్నిధానమును అనుభూతిచేయుచుండును. ఇప్పుడు నేను సనాతహిందువు నని చెప్పుకొను టేలనో అర్థముకాగలదు.

నేను జిన్నాసాహెబుబానిస నైపోతిననియు, స్వమతద్రోహి ననియు కొంద ఱనుచున్నారు. అట్టిదూషణలకును, నిందారోపణలకును జంకువాడను గాను. నేను సనాతనహిందువును

కావుననే నేను క్రైస్తవుడను, బౌద్ధుడను, ముసల్మానుడను నని ప్రకటించుకొనగల్గుచున్నాడను. కొందఱు ముసల్మానుమిత్రులు సయితము ఖురానులోని అరబ్బీభాషాశ్లోకములను పఠించునధికారము నాకు లేదనుచున్నారు. అటువంటివారికి మత మనునది భాషలకును, పుస్తకములకును అతీతమై పఱగున దనెడు విషయమే తెలియదు. నే నెందువలన కల్మాను (ముసల్మానుల ప్రార్థన) పఠింపదగదో, నే నేల అల్లాను సంస్తుతి చేయరాదో, మహమ్మదును ప్రవక్త యని నే నేకారణమున ప్రకటనచేయదగనో వారు చెప్పు అభ్యంతరమును నేను గ్రహింపజాలకున్నాను. ప్రతిమతమందలి ప్రవక్తలను నేను విశ్వసింతును. ఆ మహానుభావులను నేను పూజింతును. నాపైని నేరము నారోపించువారియెడ కోపగించుకొనకుండ వారి కేలాటి యనర్థమును కోరకుండ వారు చేతులార చంపినను నోడంబడుటకు తగినంతబలమును నాకు ప్రసాదింపు మని నేను భగవంతుని వేడుకొందును. హిందూమతము సర్వధర్మములను తనయందిముడ్చుకోగల మతము. నేను నావిశ్వాసము ననుసరించి జీవింతునేని హిందూమతమునకేకాక ఇస్లాముమతమునకుసయితము సేవ యొనర్చినవాడ నగుదును.

## 14. సత్ప్రవర్తనమే భక్తి

"రామ అనునదియు, రహీం అనునదియు దేవుని నామములే యైనయెడల, ఆ రెండుపేరులను వాడు టెందులకు? 'రామ' యను నామ మొక్కటే వాడరాదా యని మఱి కొందఱు మందలించుచు వ్రాయుచున్నారు. హిందూగ్రంథములందు దేవునికి వేలకొలది నామము లున్నట్టుల, అనేకసహస్ర

నామావళు లున్నటుల భావింపబడుచున్నది. నలుబదికోట్ల పేరు లుండుగాక! అభ్యంతరము లేదు. తన ఆధ్యాత్మికోన్నతికొఱకు ప్రతివాడును తనకు హితమగు నామము నేరుకొని దానితో భగవంతుని సంస్మరింపజాలును. నేను ముసల్మానులకు ప్రీతి గావింప యత్నించుచుంటి నని నన్ను నిందించువారు కలరు. నే నటుల ప్రయత్నించినందువలన హాని యేమి? కొందఱు ముసల్మానులు నాకు హాని తలపెట్టువా రున్నారని యొప్పు కొందము. అందుకుమాఱుగా వారికి నేను హాని చేయ సంకల్పింపవలయు నని నిర్బంధమా? ఉత్తమధర్మమా?

"ప్రార్థనసమయమున నాబసచుట్టును కొన్ని సమయము లందు పోలీసువారి కాపలా పెట్టుకొనుటకు సిగ్గులేదా యని యొకమిత్రు డాక్షేపించుచున్నాడు. నాకు నవ్వు వచ్చును. నేను సిగ్గుపడుచు నేయున్నాను. నేను వల దనుచునున్నాను. పరిపాలనాశాసనములతో జోక్యము కల్పించుకొను అధికారము లేని యొక నమ్రుడనగు పౌరుడను నేను. మీ రాపోలీసువారు తొలగింపబడవలయునని కోరుదురేని హోంమెంబరుపదవిలో నున్న సర్దారుకడకు పోవలసియుండును. చట్టనియమ ప్రకారము అటుల చేయుట తన విధి యని అయన చెప్పుచున్నాడు. ఆవిషయమును ఆయనకు విడిచివేయక తప్పదు.

రాము డనగా అల్లా, ఎహోవా, దేవుడు మున్నగు అనేక నామములు పెట్టి పిలువదగిన భగవంతుడే. ఈ రాముని నైవేద్యములు పెట్టి లాలింపజాలము. సత్ప్రవర్తన యొక్కటియే వానిని ప్రీతుని జేయు ప్రార్థన. విశ్వవ్యాప్తమగు ప్రేమ ప్రతిరామభక్తుని కిని అవసరము. హిందూమతముగాని, మహమ్మతముగాని చిర

కాలము వర్ధిలుటకు ప్రేమసూత్రమే ఆధారము. అట్టి అఖండ ప్రేమ శూన్యమయ్యెనా హిందూమతముగాని, మఱేమతముగాని వినాశమందకతీరదు.

"రెండవజూనునాఁడు వైస్రాయిప్రకటన జరుగగానే దేశమందంతటను అల్లరులు జరుగగల వని చాల వదంతులు వ్యాపించుచున్నవి. వైస్రాయి మన కేమి తెచ్చిపెట్టునా యని నిరీక్షణతో ఉబ్బుగుడిచిపోవుచున్నాము. ప్రజ లిట్లు తమభవిష్యత్తుకొఱకై లండనువంక దృష్టినిగుడించుటయు జూడ నాకు విచారము కలుగుచున్నది. భారతభూమియొక్క స్వాతంత్ర్యమే నిజమగు మన కోహినూరువజ్రము. అయ్యది నేఁడు మనయందఱియెదుట నున్నది. దానిని స్వీకరించుటో, పోనాడుటో నిర్ణయించుకోవలసినవారము మనము. బ్రిటిషురాజకీయపక్షములవా రేమి చేయుదురో, యేమి జరుపగోరుచున్నారో యని జోశ్యము లనంతములుగా సాగుచున్నవి. భారతదేశస్వాతంత్ర్యము వచ్చితీరవలయునని మనము నిర్ణయించుకొనుపక్షమున, యిట్టిజోశ్యము లంతటికిని మన స్వాతంత్ర్యము జోలి యుండదగదు.

"లండనులోని బ్రిటిషుమంత్రివర్గ మే మనుచున్నదా యను విచారము పెట్టుకొనుటయే మనకు తగదు. మనకు స్వాతంత్ర్యము నిచ్చునది యింగ్లాండువారు కారు. వారు మన మూఁపురములనుండిమాత్రము దిగిపోవలసియున్నది. అటుల దిగిపోవుదుమని వారు వాగ్దానము చేసియేయున్నారు. వా రావాగ్దానమును నిలుపుకొందురో, దాని కొక నూతనాకారమును కల్పనచేతురో చూడవలసినది మనపని. మీ రాపని నేటుల చేయవలసియుండునో తెలుపుటకు వాగ్దానము చేసియున్నాను.

"బ్రిటిషువారు భారతదేశమున అధికారమును చెల్లించుచుండునంతకాలమును ఇంగితముతో ఆలోచనలు చేయగల సమర్థత మనకు కలుగజాల దని నాదృఢాభిప్రాయము. భారత దేశపటమును మార్పుచేయుపని బ్రిటిషుపాలకులది కాదు. వారి పని యెల్లభారతదేశమున తమఅధికారమును ముగించుకొని ఈదేశమును విడిచి వెళ్ళుటయే. సాధ్యమగునెడల దేశభద్రత చెదరిపోకుండను, అది సాధ్యపడనియెడల భిన్నాభిన్నమగు దశయందైనను సరియే, యెటులైనను వారు తమవాగ్దానమును గడువు దాటకుండ, ఇంతేల అంతకు ముందుగనే బ్రిటిషువారు దేశమును వీడవలయును.

## 15. సమష్టివిన్నపము

"ఖాయిదేఆజాము జిన్నాగారును, నేనును రాజకీయప్రయోజనములకై దౌర్జన్యప్రయోగము చేయదగ దను సూత్రమును మాసమష్టివిజ్ఞాపనమునందు తెలిపియుంటిమి. ఆ ప్రకటనకు ప్రత్యక్షవిరుద్ధముగా దేశ మిప్పుడు సాగించుచున్న ఘోరాతిఘోరమగు రక్తపాతమునే యింకను అనుసరించునెడల ఈరక్త పిపాసయొక్క ఉన్మాదము ఎన్నడో అణగిపోయి సర్వమును చక్కబడు ననెడు అడియాసలతో నిరీక్షించుచుండునంతటి భీరువులై బ్రిటిషుపాలకులు భారతదేశమున నిలిచిపోవునెడల అందునుగుఱించి భారతదేశ మొక్కటియేగాక ప్రపంచమంతయు గూడ వారిని నిందించుటకు మూలమగు రాక్షసభావమునకు మనలను వారసులనుగ జేసినవారు బ్రిటిషరు లగుదురు. ఎంతయో క్రూరకర్మలకు గడంగి సకలమును సాధింప నగు ననెడు పాఠమును నేర్చుకొనినవారము మన మగుదుము. కాబట్టి గత

సంవత్సరము మేనెల పదియారవ తేదీనాటి మంత్రివర్గరాయ బారపత్రికటనానుసారము సాధ్యమగుతీరున, ఘోరతమదార్జ న్యము నెదుర్కొ-వలసివచ్చినను, బ్రిటిషరు లీదేశమును విడిచి వేయవలసియుంతు నని వారికి నొక్కి- చెప్పుచున్నాను. వా రుండుటంబట్టి చంపుకొనుట, తగులబెట్టుట, మానభంగములు మొదలగు నధమాధమకార్యములను గావించుకొనుట యనెడు రాక్షసచర్యవలన నేడు నీతిబాహుళ్యమై పోవుచున్నారము. వారు వెడలిపోయినపిమ్మట మనము వివేకముతో యోచింప జాలి భారతభూమిని అఖండముగా నుంచుకొనుటకో లేదా రెండుగగాని, అంతకన్న హెచ్చుగగాని విభాగములు చేసికొను టకో నిర్ణయించుకోగల జ్ఞానము గలిగినవార మగుదు మని నా యాకాంక్ష. అప్పుడును మన మొకవేళ కుమ్ములాడుకొనుటకే తలపడినను, మన దౌర్జన్యచర్యలు ఏదియో యొకింత అవినీతి పాలుచేసినను ఈనాటియంతగా నీతిశూన్యులమై పోమని నాకు గట్టినమ్మకము గలదు.

"నేను ముసల్మానులకు తోడ్పడునిమిత్తమే బీహారులో నుంటి ననియు, తత్కారణమున హిందువులు వధలపాలు కావలసివచ్చె ననియు వదంతులు కలవు. ముసల్మానులు ద్వేకముతో పిచ్చి యెత్తిన వారైనను హిందువులు వివేకము పోనాడుకో దగదని తెలుపుచున్నాను. తదితరుల కెల్లజకును ఆ సలహానే నే నిచ్చు టకు సిగ్గుపడను. పంజాబులో హిందువులు అల్పసంఖ్యాకులుగా నున్నారు. కాని ఒక్కొ-క్క-డు సవాలక్షమందికి సమాన మని చెప్పుకొను సాహసవంతులగు శిక్కు- లున్నారు. అనగా నేమి? ఒక్కొ-క్క శిక్కు- సవాలక్షమందినెత్తురు తీయు ననియా అర్థము? ఒక్కొ-క్క- శిక్కు- సవాలక్షమందినైనను ఎదిర్చి నిలువజాలు

సాహసము గలవా డనియే దానిభావము. ఆ అర్థమున ఆమాట శిక్కుల శౌర్యమునకు సంస్తుతియే. ఒక్క శిక్కుని అధర్మము జరుగుచుంట జూచి దూరమున నిలువబడి యుపేక్షింపదగదు. ఆ యధర్మమును నివారించుటకై అతడు తన ప్రాణమును సయితము అర్పింపవలసినవా డనిభావము. అట్టి శిక్కులకు నాయొక్క సలహా యిది :

‘శిక్కుచరిత్రలో ఖడ్గప్రయోగమున కెట్టి ఖ్యాతియున్నను, ఈయాటంబాంబుప్రయోగపుదినములలో అహింసాయుతనిరోధమునకు సాటిరాగల మఱొక ఆయుధము లేదు. అది పురుషులను పిఱికిపందలను చేయదు. స్త్రీలలో సయితము అహింసాస్త్రము సాహసమును పురిగొలుపును. యథార్థసాహసవంతుల చేతిలో నుండ నర్హమగు అస్త్రముగావుననే నే నీ అహింస నంతగా శ్లాఘించుచుందును.’

“శత్రువు పిచ్చికుక్కవంటివా డైనచో నేమి చేయవలయు నని యొక రడుగుచున్నారు. ఆయన వాస్తవముగా నొకపిచ్చి కుక్కను మనస్సులో పెట్టుకొని యీమాట నడుగుటలేదు. నిజమగుదైవభక్తులనడుమ నేకుక్కకును పిచ్చియే యెత్తదనుట మొట్టమొదటగనే యీయన యంగీకరించు ననుకొందును. ఒకపిచ్చికుక్క యున్మాదచేష్టల జేయుచు భక్తుల మనుకొనెడు వారికడనున్న దనుకొనుడు. వా రాపిచ్చికుక్కను సహజముగానే చంపివేయుదురుగాని దానికాటు నందుకొనరు. సరే. నరునకు పిచ్చియెత్తిన నేమి చేయవలయును ?

“నాసోదరునకే పిచ్చియెత్తినది. నాతల్లిదండ్రులు వానిని చంపలేదు. నే నప్పుడు పదేండ్లబాలుడను. వారు వైద్యవరులను

డాక్టర్లను రప్పించిరి. వానికి చికిత్స చేయించిరి. వానిపిచ్చి కుదిరినదికూడను.

"హిందువులైనను, ముసల్మానులైనను ఎల్లరు నాసహోదరులే. మీలో నొకనికి పిచ్చియెత్తిన దనుకొనుడు. నాయొద్ద సైనికులున్నారు. అతనిని కాల్పించివేతునా? ఎన్నడు నటుల కాదు. నేను పిచ్చవాడ నైనచో కాల్చివేయబడుట కిష్టపడనే! నామిత్రునికుమారునకు పిచ్చి యెత్తినది. వాని నొకగదిలో బంధించియుంచి చికిత్స చేయించినారు. కాని చంపించలేదు.

"నేడు 'సాంఘికద్వేష' మను పిచ్చి దేశమును పట్టుకొనినది. జూను రెండవ తేదీనాడు దేశమందెల్లెడల అల్లరులు జరుగునని ప్రజలు చెప్పుకొనసాగిరి. వారిలో నెవరును నెత్తురువెల్లువలు ప్రవహించవలె నని కోరువారు లేరు. ఎవరేని పిచ్చియుద్రేకములను సహించుకోవలసియుందుము. కాని కసిదీర్చుకోవలెననుచు వెఱ్ఱిపూని శివా లాడదగదు.

"తమలో అధమాధమునిసయితము తదితరులందఱితో సమానముగ జూచుట ప్రతిపౌరునకు విధియై యున్నది. ఏకొందఱో వెఱ్ఱెత్తిపోయి రను కారణముచేత, తదితరులును అద్దేత్రోవ పట్టుట సమంజసముకాదు. భారతప్రజలు తాము స్వతంత్రులై యుండ నిశ్చయించుకొనునెడల ప్రపంచములో నెవ్వరును, మహాబలసమన్వితులైన జాతులన్నియు గుమిగూడివచ్చినను వీరిని చెనకనోపరు.

•

## 18. ఎవనిధర్మము వానిది

"చిరకాలమునుండిమనము వైస్రాయివంకను,లండనువంకను దేవురించుచు చూచుచుంటిమి. అటుల చూచుచుండుట తగదని చెప్పుచున్నాను. అందుమూలాన లండనులోని ఆంగ్ల ప్రజలు చెడ్డవారనిగాని, వైస్రాయి మంచివాడు కాడనిగాని నేననుటలేదు. వారు మంచివారనియే నా నమ్మకము. అయినను మనగృహవ్యవహారములలో మంచివారైనను యితరుల జోక్యమునుసయితము వాంఛింపదగదు. బ్రిటిషువారు వెడలిపోవ నిశ్చయించుకొనియున్నారు. ఇచ్చటి బ్రిటిషువారి ప్రయోజనములయొక్క సంరక్షణాల ప్రసక్తి సూచనగనైనను లేదు. సివిలు ఉద్యోగాలలో నున్న బ్రిటిషువారుసయితము భారతప్రభుత్వము వారు నిలుపకొననెంచిననే యిచ్చట నుండగలరు. అప్పుడును వారు స్వంతబాధ్యతతోడనే నిలువవలసియుందురు. వారు తమ సంరక్షణార్థమని ఒక్క బ్రిటిషుసైనికునైనను నిలుపుకొనజాలరు. బ్రిటిషరులు తమ సేవాద్వారమున మాత్రమే భారతీయుల సదభిప్రాయమును, ఆదరణను సంపాదించుకొనుటయే వారికి రక్ష. 'క్విట్ యిండియా' భారతదేశమునుండి వైదొలగుడనుట కిదియే యర్థము. 1948 జూన్ దినము బ్రిటిషువారు భారతదేశమును వీడిపోవ ప్రయాణముచేసిన తుదిగడువు. వారి ధర్మమేమో వారే చూచుకొందురు. మన ధర్మమును మనము చూచుకొందముగాక !

ఇక భారతీయులు తమధర్మమును తాము నిర్వహించుకొనుటెట్లు ?

నేను నాకుదప్ప మఱెవరికేనియు ప్రతినిధిని కాగలనాయని వింతపడుచుందును. కాంగ్రెసులో నేను పావలాసభ్యుడనై నను కానందున నేను కాంగ్రెసుప్రతినిధిని కాజాలను. నేను కాంగ్రెసు పక్షమున అప్పుడప్పుడు మాటలాడుచుండుట నిజమే. కాని నే నటుల చేయుట సేవచేయు నా అర్హతనుబట్టియే. ఆతీరున నేను సంస్థానాధిపతులపక్షమున మాటలాడగలను; ముస్లిములీగు పక్షముననను మాటలాడగలను. మొన్న ఖాయిదేఅజాముజిన్నా గారితో గూడి నేనును శాంతికొఱకై చేయబడిన విన్నపము మీాద సంతకము చేయవలయు నని ఆయన నన్ను కోరి యున్నాడు. మే ముభయులము సంతకముచేసిన ఆ విన్నపము యొక్క రచయిత నగుటచేత శాంతినిగూర్చిన నిర్ధారితములును, ప్రధానములు నగు నంశములలో నొక్కదాని సందర్భమున నైనను నేను జిన్నాగారి ప్రతినిధినై యుండవలసియున్నది. నే నట్లు ఖాయిదేఅజాముగారి ప్రతినిధినేనా? అగుచో మే మిరు వురము ఒకేవేదికమీాదినుండి యుపన్యసించుచు, మాయుభ యుల జన్మభూమియగు భారతదేశమందు శాంతి సంస్థాపించు వఱకును విశ్రాంతి దీసికొనకుండ పనిచేయవలసినది : లేదా ఆప్రయత్నమున మరణించనైన మరణించవలసినదే. గోర్గాను, దాపుగ్రామాలను తగులబెట్టి హత్యలు గావించినవారి ప్రతి నిధిని నేను గాననుట నిశ్చయము. వారు హిందువులా, మహమ్మదీయులా, లేక ఉభయసంఘములవారా యను విచా రణయే నా కవసరము లేదు. వా రెవరైనను నాభారతమాత యొక్క సంతానమే. పాకిస్థానుస్థాపనకు నిష్కపటమగు చర్చద్వారమున సమ్మతిసంపాదించుటతప్ప వేఱగు మార్గమును ఖాయిదేఅజాముగారు అనుసరింపజాలరు. నాతోడ్పాటుతో

గాని, నాతోడ్పాటు లేకుండగాని ఆయన మున్ముందుగా శాంతిని నెలకొలుపుగాక. ఆపిమ్మట తనగృహమందైనను, మఱేచోటు నందైనను అన్నిసంఘములవారియు, అన్నివర్ణములవారియు నాయకులను సమావేశపఱచి వారితో చర్చించి, వారికి నచ్చ చెప్పువఱకును వేచియుందునుగాక. తనమెడనుంచి సవర్ణహిందువులను తొలగించి వేయుగాక. ఈసవర్ణహిందువుల నెడువారు, ‘భారతప్రజాళి’ యను మహాసముద్రమున, యింతేల హిందూ జనసంఘమునందుసయితము శూద్రులను మినహాయించిన యెడల అత్యంతము చిన్నసంఘమువారై పోదురని నేను జిన్నాసాహెబు గారికి దృఢముగా జెప్పగోరెదను. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అనబడువారే సామాన్యముగా ‘సవర్ణహిందువు’ లని యెంచబడు చున్నారు. వీరినుండి షెడ్యూల్డుతరగతు లనబడెడు వారిని జిన్నాసాహెబుగారే మినహాయించుచున్నారు. కాబట్టి శూద్రులనుకూడ మినహాయించవలసినవాడగుచున్నాడు. మన దౌర్భాగ్యపు కులవ్యవస్థ అతిశూద్రులతో అనగా హరిజనులతో గూడి కోట్లాదిజనమగు శూద్రులను సదా దూష్యులను జేసి వేయుచున్నది. జిన్నాసాహెబుగారి అభిప్రాయము ననుసరించి పాకిస్థానోద్యమము సమంజసమైనదే యైనయెడల ఆయనకు భారతీయుల సమ్మతి గొనుటలో కష్టముండదు. కావున ఆయన బ్రిటిషుపాలకులనుగాని, లేక వారిప్రతినిధియగు మౌంటుబాటెనుప్రభువునుగాని ఆశ్రయింపకుండుగాక. రాబోవు సంవత్సరము జూను నెలతుదినైనను, భారతదేశమును చివఱకు విడిచివేసిపోవుటే వారి కర్తవ్యముగదా. సాధ్యమగునెడల శాంతిపూర్వకముగను, అటుల కాదేని శాంతియో అశాంతియో యను చింత లేకుండగను, వారెటులైనను భారతభూమిని

విడిచిపోవలసినవారేగదా! బలాత్కారముగా నెత్తిని రుద్దబడు శాంతి స్మశానశాంతిని బోలునదై యుండును. దానింగూర్చి భారత దేశము యావత్తును, బ్రిటనుసయితము, సిగ్గుచెంద వలసియే యుండును. నేను రంగములోనికి దిగుటలో నత్యాలస్యము చేసితినని వాదింపకుందురుగాక. నే నాలస్యముగ రాలేదు. తప్పుల దిద్దుకొనుట కెన్నడును మించిపోయె నను నది లేదు. కత్తిబలమునకు మారుగా వివేకబలమును ప్రవేశ పెట్టుట కెన్నడును తరుణము మించిపోదు.

## 17. పాకిస్థానుస్వరూపము

జిన్నాగారి భావనలో 'పాకిస్థాన' మనగా, ఏప్రదేశమున ప్రతిపసివానికిసయితము క్షేమ ముండగలదో, వర్ణభేదములుగాని, హెచ్చువారు, తగ్గువా రనెడు వ్యత్యాసముగాని యుండదో, ఎచ్చో సర్వప్రజలకు న్యాయము జరుగునో అట్టి రాజ్యమే యగునా? అట్లగుచో అటువంటి పాకిస్థానమున కభ్యంతరము తెలుపువా డుండబోడు. నామట్టుకు నేనే ఖాయిదేఅజాము జిన్నాగారితో కలిసి భారతదేశ మెల్లెడల పర్యటనము సాగించి ఆతీరు పాకిస్థానములో సకలప్రజలును సౌఖ్యానందముల ననుభ వింపగల రని జనులకు వివరించి చెప్పెడువాడను. కాని బెంగాలు, పంజాబు, వాయవ్యరాష్ట్రములందు జరుగుచున్న యుదంతము లట్టివిశ్వాసములకు తా వొసగుటలేదు.

స్వతంత్రభారతములో బిర్లారాజ్యముగాని, భోపాలునవాబు రాజ్యముగాని యుండజాలవు. ఉండునదెల్ల పంచాయతీరాజ్యమే. స్వతంత్రభారతదేశమున వ్యక్తిపరముగాగాక యే మానవుని కిని అధికమగు విలువయుండజాలదు. కాబట్టి కాశ్మీరము

రము లోని సైన్యయుతుడగు మహారాజున క్షేమంత అధికృత యుండబోదు. అక్కడ అత్యధికసంఖ్యాకులుగ నున్న ముసల్మానులకే హెచ్చుపలుకుబడి యుండును. ఇదేసూత్రము హైదరాబాదు, భోపాలు, తిరువాన్కూరు, బరోడా మొదలగు సంస్థానముల ప్రభువులకును అనువర్తించును. కాన హిందూముస్లిము సంస్థానాధిపతులు కక్షలుపూని పోరాటములకు దిగకుందురుగాక యని ఆశించుచున్నాను. కాబట్టి సంస్థానాధీశు లెల్లలును రాజ్యాంగనిర్మాణసంఘమున పాల్గొనుట వివేకచర్య కాగలదు. బ్రిటిషువారు నిష్కపటముగా వర్తించుచో ఏసంస్థానపరిపాలకుడును దుశ్చర్యకు గడంగుటకు సమర్థుడు కాకుండ జూడగలరు.

## 18. సంస్థానప్రజలు

"సంస్థానప్రజల హక్కులనుగూర్చి అఖిలభారత కాంగ్రెసు కమిటీవా రీతీర్మానమును జేసియున్నారు :—ఏసంస్థానముగాని సర్వస్వతంత్రతను ప్రకటించి వేఱుపడిపోవుటకు అ. భా. కాం. కమిటీ అంగీకరింపజాలదు.... ... ...సంస్థానప్రభువు లందఱు తమమేలుకొఱకును, భారతదేశపు మేలుకొఱకును ప్రజాపరిషత్తులో చేరగల రని అ. భా. కాం. కమిటీ ఆశించుచున్నది.

"1946 మే 16–వ తేదీ అమాత్యపథకమునందు భారత సంస్థానములకు రెండుమార్గములు సూచింపబడినవి. అవి తక్కిన రాష్ట్రములవలె భారతరిపబ్లిక్కులో చేరిపోవలయును; లేదా భారత కేంద్రప్రభుత్వముతో ప్రత్యేకపు టొడంబడికనైనను చేసికోవలయును. 1947 జూను 3 వ తేదీపథకమునందు అన్య మార్గ మేమియు తెలుపబడి యుండలేదు. కొన్ని సంస్థానములు ఐచ్ఛికముగా తమమేలుకొఱకును భారతదేశపు మేలు

కొనుటకును రాజ్యాంగచట్టనిర్మాణములో పాల్గొనుటకు తమ సమ్మతిని బ్రిటిషుప్రభుత్వమునకు తెలియజేసిననట.

"సంస్థానప్రభువులు తమప్రజలయుద్దేశ్యముల కనుగొని వాని కనుసరణముగా వర్తింపవలయు ననియు అమాత్యపథకములో తెలుపబడియున్నది. కొన్నిసంస్థానములుమాత్రము అటుల ప్రజాపరిషత్తులో చేరినవి. కాని చాలసంస్థానములు తమ పంథాను నిశ్చయించుకోలేదు. జూను 3 వ తేదీపథకము వలన త్వరలో కార్యక్రమ మంతయు చక్కబెట్టుకొనవలయు పరిస్థితు లేర్పడినవి. దీనిని గమనించి తక్కినసంస్థానములు వెంటనే తమసంస్థానములలో బాధ్యతాయుతప్రభుత్వములను నెలకొలుపుచు తాము ప్రజాపరిషత్తులో చేరవలయునని అ. భా. కాం. కమిటీ కోరుచున్నది.

"బ్రిటిషుసార్వభౌమత్వము అంతరించినను భారతప్రభుత్వానికిని, సంస్థానములకును నున్న సంబంధము లంతరించవు. క్రొత్తఒడంబడికలు చేసికొనదగును. అంతేకాని స్వాతంత్ర్యము ప్రకటించు హక్కు సంస్థానాలకు లేదు. అది సర్వవిధముల అమాత్యపథకమునకు విరుద్ధము. ఆపథకములో ప్రజలకు బాధ్యతాయుతప్రభుత్వ ముండవలయు నని అంగీకరింపబడియున్నది. అనగా సార్వభౌమాధికారము అంతరించునెడల అది ప్రజలకే చెందవలయును గాని సంస్థాధీశులకు కాజాలదు అని యీకమిటీ నిర్ణయించుచున్నది.

## 19. కీడులో మేలు

"బ్రిటిషుప్రభుత్వపథకమును అంగీకరించుట ఒక్కకాంగ్రెసు కార్యవర్గమునకుమాత్రమే సంబంధించినపని కాదు. అందు

మఱియిద్దరు కక్షిదారు లున్నారు. బ్రిటిషు ప్రభుత్వము, అఖిల భారతముస్లింలీగు. ఈపథకము దేశమును ఘోరవిపత్తుపాలు చేయు నని అఖిలభారతకాంగ్రెసుకమిటీవారు అభిప్రాయపడు నెడలను, మఱియు గాఢతరముగా విశ్వసించు నెడలను, వారీపథకమును త్రోసివేయవలసినదే. ఆతిరస్కారమునకు ప్రతిఫలముగా నిప్పటి కాంగ్రెసుకార్యవర్గము తొలగిపోయి క్రొత్త వారు ఏర్పఱుపబడవలసియుండును. కాని నేటి దేశక్లిష్టపరిస్థితిలో శాంతి అత్యవసరము.

"పాకిస్థానమా కాంగ్రెసునకు ప్రతికూలముగ నున్నది. దేశవిభజనను ప్రతిఘటించి యెదిరించినవారిలో నేను నొక్కడనే. అటు లయ్యును విభజనకు సమ్మతించు ఈతీర్మానము నంగీకరింపు డని కోరుటకు మీయెదుట నిలుచున్నాడను. కొన్నికొన్ని పరిస్థితులలో ఎంతయో అయిష్టమగు నిర్ణయములకు కొన్నింటికి సమ్మతింపవలసివచ్చును.

"ఏవో నైతికనిర్బంధములకు లోనై ఈఅఖిలభారత కాంగ్రెసుకమిటీవారు దీనిని హర్షింపదగుదు. గాఢవిశ్వాసముతోడను, బాధ్యతతోడను, విషయపరిజ్ఞానముతోడను అంగీకరింపవలసియున్నారు. వారీతీర్మానమును త్రోసిపుచ్చినయెడల దేశములో అంతఃకలహములు, అల్లరులు ప్రజ్వరిల్ల వనెడు గట్టి నమ్మకము ముండునేని ఈతీర్మానమును నిస్సంకోచముగా నిరాకరింపవచ్చును. ఒక్కొక్కప్పుడు కీడులో మేలు గలుగును. తండ్రిమాటబాటువలన శ్రీరామచంద్రుడు వనవాసము చేయవలసివచ్చినది. ఆవనవాసమే తుదకు రావణాసంహారమునకు అనగా దుష్టనిగ్రహమునకు దారితీసినది. ఇప్పు డంగీకరింపబడు

పథక మేలాటిదైనం గానిండు. శ్రేష్ఠమైనది కా దనుట నొప్పు కోవలసినదే. అయినను దానినుండి మేలు సమకూరగల దని నాకు గట్టినమ్మకము గలదు. మన్నును త్రవ్వి బంగారును దీయునటుల ఈలోపభూయిష్ఠమగు పథకమునుండి మీరు మంచిఫలితార్థములను సాధింపగల రని నావిశ్వాసము.

"హిందూముసల్మానుమతముల రెంటిపరీక్షార్థమై యీపథకము వచ్చినది. జిన్నాగారు కేవలము అపమార్గము బట్టినాడని హిందువులు రుజువుచేయగలరా? హిందువులును, ముసల్మానులును వేర్వేఱుజాతులవా రనియు, వారికి పరస్పరము ఐక్యభావము లేదనియు జిన్నాగారుచేయు సిద్ధాంతము పొరబాటని యీపథకమువలన రుజువగు నవకాశ మున్నది. అల్పసంఖ్యాకులై దుర్బలురుగ నున్నవారుసయితము మనదేశమున సురక్షితముగ బ్రతుకగల్గియుండవలయును. అస్పృశ్యత పూర్తిగా తొలగిపోవలయు ననియు, అప్పుడుగాని భారతభూమి వాస్తవమగు ప్రజాస్వామికరాజ్యము కాజాల దనియు హరిజనులు భావించుచున్నారు. లోపములతో నిండియున్న ఈపథకమునే స్వీకరించి, దీనినే పుటముపెట్టి, హెచ్చుతగ్గుల పాటింపనట్టియు, భిన్నత్వమును హర్షింపనట్టియు భారతరాజ్యమును మీరు ప్రతిష్ఠింపవలసియున్నది.

"ఇరుగుపొరుగువారై జీవించు మహమ్మదీయులయెడ హిందువులు నిర్వహింపదగు బాధ్యతలు గలవు. వారిని మిత్రులను జేసికొని, వారికష్టసుఖములను పంచుకొనుచు వారికి సాయపడుట హిందువుల విధి. అప్పుడు ఇరుగుపొరుగువారగు ముసల్మానులును హిందువులయెడల అటులనే వర్తింతు రని

ఆశించు హక్కు హిందువులకు కలుగును. వా రటుల వర్తింతు రనియు తలంపవచ్చును. ఒకగ్రామములో అధికసంఖ్యాకులగు హిందువు లుండి అల్పసంఖ్యాకులగు ముసల్మానులు వారిమధ్య నివసించుచుండి రనుకొనుడు. అప్పు డాకొలదిమంది ముసల్మానులయెడల అధికసంఖ్యాకులగు హిందువుల విధి యెన్నియో మడుంగులు హెచ్చుగానుండును. ముసల్మాను లయినకారణమున తమయెడల హిందువులు వ్యత్యాసములు చూపుచుండి రని ఆయల్పసంఖ్యాకు లనుకొనకుండునటుల హిందువులు వర్తించుటయే ఒప్పగును. అప్పుడు ముసల్మానులును తమసన్మిత్రులుగా వర్తింతు రనియు, ఆపదలు వచ్చునెడల నుభయమతముల వారును నేకమై ఒక్కవ్యక్తివలె మెలగగల రనియు ఆశించు హక్కు హిందువులకు లభించును. అంతవఱకును వారి కటువంటి హక్కు చేకూరబోదు. అధికసంఖ్యాకులగు హిందువులు న్యాయముగా వర్తించినను గూడ అల్పసంఖ్యాకులగు ముసల్మానులు సక్రమముగా ప్రవర్తింపక, ప్రతివ్యవహారమునందును పోరాటమునకు తలపడుచునేయుండుచో నది పౌరుషశూన్యమగు చర్య యగును. అట్టిసందర్భమున హిందువుల ధర్మమేమి? అధికసంఖ్యాకులగుటంబట్టి తమకు లభింపగల పశుబలముతో ముసల్మానుల లొంగదీయనెంచుట తగదు. ఏకోదరులగు నన్నదమ్ముల పౌరుషహీనవర్తనమైనచో ఎట్లు నిగ్రహింతుమో ఆరీతిన ఆముసల్మానులయెడ హిందువులు వర్తింపదగును. హిందువులు అధికసంఖ్యాకులును ముసల్మానులు అల్పసంఖ్యాకులును నైయుంటకుమారుగా ముసల్మానులు అధికసంఖ్యాకులును, హిందువులు అల్పసంఖ్యాకులు నైయున్నను గూడ ఈసూత్రమే అనువర్తించును. ఈసిద్ధాంతమును ప్రస్తుత

పరిస్థితుల కన్నింటికిని వర్తింపజేయుట సులభమును, లాభదాయకమును నగును. 'తమవిధులను సక్రమముగా నిర్వహించువారికి హక్కులు తమంతట నవియే చేకూరును' అనెడు సూత్రమును ఆచరణలో పెట్టకపోవుటవలన ప్రస్తుతపు చిక్కు లన్నియు నేర్పడు చున్నవి.

ఈసూత్రమే సంస్థానాధిపతులకును, రయితులకును వర్తించును. వాస్తవమగు ప్రజాసేవకులుగా వర్తించుట సంస్థానప్రభువులకు విధి. అన్యులు కల్పించిన హక్కులసాహాయ్యమున వారు అధికారములను సాగింపరాదు. ఆయుధబలమువలన చేకూరిన హక్కులను అండగాగొని వారు తమప్రభుత్వమును చెల్లింపదగదు. సేవామూలమునను, హెచ్చు తెలివి తేటలవలనను లభ్యమగు హక్కులను ఆధారము చేసికొని వారు పరిపాలన చేయవలసియుండును. అప్పుడు ప్రజలు ఇచ్ఛాపూర్వకముగా చెల్లించు పన్నులు గైకొనుహక్కును గడించుకొనినవా రగుదురు. మఱియు కొన్ని సేవలను కోరి చేయించుకొను హక్కు వారికుండును. ఈసేవలుసయితము ప్రజ లైచ్ఛికముగా నొసగునవిగా నుండవలయును. అవియు వారిభోగముకొఱ కగునవిగాక వారి పరిపాలనముక్రింద నున్న ప్రజల ప్రయోజనముల కక్కఱకు వచ్చునవిగను నుండవలయును. సంస్థానాధిపతు లీప్రధానధర్మమును నిర్వహింపనియెడల వారియెడల నిర్వహింపవలసిన విధులు శూన్యము లైపోవుటేగాక, అటువంటి సంస్థానాధిపతుల యొక్క దుష్టపరిపాలనమును, మఱియు వారి అధికారాక్రమణమును నిరోధించు హక్కు ప్రజలకు చేకూరును. ఐనను ప్రజలిటుల నిరోధించుటలో హత్యలు గావించినను, ద్రోహములు చేసినను మానవజాతికే మహాపకారము చేసినవా రగుదురు. విధుల

నిర్వహించుటవలన ఒకానొక శక్తి సహజముగా నుత్పన్న మగును. అయ్యదియే సత్యాగ్రహమువలన నుత్పన్నమగు అహింసాత్మకమును, అప్రతిహతము నగు ఆత్మశక్తి.

## 20. కాంగ్రెసుగోత్రీకులలో దురాశలు

"సత్యాగ్రహపుదినములలో జైళ్ళకుపోయినవారు ఇప్పుడు ఉన్నతపదవులను పొందుటకు తమకే హక్కుగలట్లుభావించుచుండిరని యొకరు నాకు వ్రాయుచున్నారు. మంత్రిగా తానుగాక వేఱొకరు నియమింపబడు నెడల నిట్టివ్యక్తికి కోపతాపములు సయితము కలుగుచున్నట. ఈతీరున మనస్థితి యేర్పడుట చాల నింద్యము. అందువలన కాంగ్రెసుప్రతిష్ఠ మట్టిపాలగును. కాంగ్రెసువంటిసంస్థ ముఖ్యముగా ప్రజాసేవకై యేర్పడినది. జైళ్ళకుపోవుటవలన భారతదేశమున కేదో మహోపకారమును తాము చేసినటుల కాంగ్రెసుగోత్రీకులు కొందఱుభావించుచున్నట్లున్నారు. పండితజవహరులాలు, సర్దారుపటేలు ప్రభృతులు జైళ్ళకు వెళ్ళుటవలననే యిప్పటి మహోన్నతపదవుల నాక్రమించి రని వీరి అభిప్రాయ మగునెడల, చాల పొరబడినవారగుచున్నారు. వారు తా మొనరించిన త్యాగములవలనను, తాము చేసిన నిరంతరప్రజాసేవవలనను నాయకులు కాగలిగిరి. వారు తమ ఐశ్వర్యములను, జీవితములను దేశముకొఱకై ధారవోసియున్నారు. ఉన్నతపదవుల నాక్రమించుటకు శక్తిసామర్థ్యములుమాత్రమే ప్రధానములుగా నెంచవలయును. భారతదేశము యథార్థమగు స్వాతంత్ర్యము పొందవలయు నన్న యెడల అధికారవ్యామోహముగాని, తదితరఫలాపేక్షగాని దరి రానీయని కేవలసేవాపరాయణతయే అవసరముసుడీ !

## 21. ప్రప్రథమాధ్యక్షురాలు

భారతదేశమున ప్రజాస్వామ్యప్రభుత్వమునకు మొట్టమొదటి అధ్యక్షస్థానము నాక్రమించు టనెడు మహోన్నతగౌరవమును పొంద నర్హుడగు ప్రసిద్ధభారతనాయకు డెవ డని న న్నడుగు చుందురు. నాసమాధానమును తెలిపియేయున్నాను. పదునే డేండ్ల బ్రిటిషుపడుచు ఇంగ్లాండుదేశపు రాణియైనపిమ్మట భారత దేశమునకును, చక్రవర్తిని కాగలిగినది. అట్టియెడ భారతప్రజల క్షేమాభిమానములకు పాత్రురాలు కాగలట్టియు, నిండుగా సద్వర్తన గలట్టియు భంగీజాతి (హరిజన)బాలిక భారతప్రజా స్వామ్యప్రభుత్వమునకు ప్రథమాధ్యక్షురాలు ఏల కాదగదు? నిజముగా నటువంటి శుభంకరసంఘటనయే ప్రాప్తించుపట్ల భారతదేశ మిదివరలో కోల్పోయిన ప్రతిష్ఠను మఱల సంపాదిం చుకోగలును. క్రమశిక్షణయందును, సంఘీభావమునందును భారతదేశ మున్నతస్థానము నందిన దని చెప్పుకొనుట కొక ప్రబలనిదర్శనము కాగలదు. మఱియు భారతదేశమును ధనాధి ష్ఠానదేవతగాని, పశుబలసంపదగాని పరిపాలనము చేయుటలే దనియు, ఒకానొక భారతబాలికయొక్క హృదయమున తేజ రిల్లుచున్న ఆత్మశక్తి పరిపాలనము సాగించుచుండె ననియు రుజువు కాగలదు.

## 22. అహింస, ప్రపంచశాంతి

స్వాతంత్ర్యము సంప్రాప్త మాదినము సమీపించవచ్చును. ఐనను మన మీభ్రాతృహింసాకృత్యములను సాగించుచునే యుండునెడల స్వాతంత్ర్య మనునది యెక్కడ నిలువగలదు?

వైస్రాయి నన్ను తనమిత్రుడ నని వచించెను. నేను పేదలకు మిత్రుడను గాన ఈదరిద్రుల స్నేహితుడ నని విశ్వసించుచున్నాడను. కాని వైస్రాయికి నెయ్యుడను గాగలిగి ఆయనకును సేవచేయుటకు సంసిద్ధుడనే.

"ఈ కల్లోలితప్రపంచమున శాంతి యేర్పడవలయు నని వాంఛించుచో, అందు కుపకరింపగలది అహింసావలంబన మొక్కటియే. అదితప్ప వేఱొకమార్గము లేదు. ప్రపంచ శాంతియొక్క సుస్థాపనకు అయ్యదియే ఉత్తమోత్తమమార్గ మని చాలమంది అంగీకరింతురుగాని, కటా! ఆమహత్తర విధానమును ఆచరింపగలిగిన సాహసము వారికి లేకున్నది. అహింసాసాధనము ఎన్నడును పరాజయము పొందలేదని బాహాటముగా చాటగలను. విశ్వమానవైక్యసంధాయకమైన ప్రేమను మించిన యుత్తమోపాయము ప్రపంచమున లేదని తెలుపు భజనకీర్తనను వినుచుందుము. యుధిష్ఠిరమహారాజు యజ్ఞము చేసినది యే యాశయముతోడనో తెలియునా? ప్రేమ సాధనద్వారమున. అనగా అహింసద్వారమున. తనప్రజయొక్క సేవకుడు కావలయు ననెడు అభిలాషతోడనే ఆ యుధిష్ఠిరుడు యజ్ఞము చేసియున్నాడు. ఆయన రాచరికమున అధికారమునకు బదులుగా ప్రజాసేవనే వరించినాడు. ప్రజాసేవయందే యథార్థమగు రాచరిక మున్నదని ఆయన తలంచియున్నాడు.

"నేడు హత్యలు, దోపిడులు, గృహదహనములు ఘోరాతి ఘోరముగా జరుగుచున్నమాట వాస్తవమే. గడచిన ముప్పది యేండ్లనుండి నానాయకత్వముక్రింద సాధనము చేయగలిగినది సత్యాగ్రహముకన్న మెరుగైన దేమియు కాదు. కావుననే నేటి

దౌర్భాగ్యపరిస్థితులయెడగల బాధ్యతలో న్యాయమంతు నేను అంగీకరించుచున్నాను. మానవహృదయపరివర్తనమును కల్పించుటలో కేవలసత్యాగ్రహము అహింస యంతటి శక్తివంతమైనది కాజాలదు. కేవలసత్యాగ్రహమువలన సాధింపగలది మనకు తెలియవచ్చినది. కావున దానిమీదనే ఇంకను మన దృష్టిని కేంద్రీకరింపవలసిన యవసరము లేదు. మన కలలకు గుఱియైన సంపూర్ణస్వరాజ్యము చేరువకు రాలేదు. కాని ఈ విషమును అమృతముగా మార్పుచేసికొనుటకు మన మేమి చేయవలసియున్నది? దానిని హృదయపరివర్తనముద్వారమున సిద్ధింపజేసికొనగల్గుదుము. అది తప్పక సాధ్య మగునని నాకు దెలియును. అందుకై మన మవలంబింపవలసిన విధానమును నాకు దెలియును. కాని సత్యాగ్రహమునకు సంసిద్ధత జూపిన ప్రజాహృదయము అహింసావిధానపు పాఠమును తనలో నిముడ్చుకో సిద్ధముగ లేదయ్యె. విషమునుఅమృతముగా మార్చి వేయగలయేకైకసాధనము ఒక్క అహింసమాత్రమే. అహింసా సిద్ధాంతము మహోత్తమమైనదని అనేకులు అంగీకరించియే యున్నారు. కాని దాని అవలంబనమునకు వలయు గుండెనిబ్బరము వారికి కొఱవడినది.

## 23. స్వతంత్రభారతాదర్శము

" 1947 సం. 15 వ ఆగష్టుస్వరాజ్యప్రకటన దేశమున దశదిశలందును, కుగ్రామములందుసయితము చేయబడినది. ఆనాడు స్వాతంత్రభానుప్రభ లెల్లెడల ప్రసరించినవి. విదేశములతో సహా ప్రపంచ మంతయు సంతసించినది. కాని కొందరి హృదయములలో భారతస్వాతంత్ర్యముయొక్క ఆశయములు సుస్పష్టముగా

వెల్లడికాలేదనెడు సంశయము వొడమినది. జాతిద్వయసిద్ధాంతముపై ఆధారపడి భారతదేశము భారతయూనియను, పాకిస్థానుననెడు రెండుఖండములుగా విడిపోయెగదా ! ఇక వీరు సోదరసంఘములుగగాని, మిత్రరాజ్యములుగగాని మనగల్గుదురా యను సందేహము భారతీయులనే కొందఱిని పీడింపుచుండెను. అట్టితరిని శ్రీ రాజేంద్రప్రసాదు కాంగ్రెసుపక్షమున అసందిగ్ధప్రకటన గావించియున్నాడు.

'ఈదినము మన మందరము నిస్సందేహముగా సంతోషింపవలసిన పర్వదినము. ఐనను మనసంతోషము సమగ్రముగ లేదు. కొంత విషాదచ్ఛాయ, ఒకానొక ఊహ మనలను బాధించుచునే యున్నది. దైవసృష్టినిబట్టి చూచినను, వైజ్ఞానిక సంప్రదాయములబట్టి చూచినను, యుగయుగాంతరముల చరిత్రనుబట్టి చూచినను, ప్రకృతిసిద్ధముగా అఖండమైయున్న భారతదేశము ఈనాడు విభక్తమైనది. ఇప్పు డేర్పడిన హద్దులలో మనతో నివసింపదలచినవా రెందరో ఆహద్దుల కావల నుండవలసినవా రగుచున్నారు. కాని భయపడ నవసరము లేదనియు, విశ్వాసముతోడను, ధైర్యముతోడను తమ చుట్టు ప్రక్కల నుండు ప్రజలతో కలసిమెలిసి నివసింపుచు, విధేయులగు పౌరులుగా తమవిధిని తాము నిర్వహింపుచు శాంతియుతముగా తమ అర్హస్థానమును పొంది గౌరవపాత్రులు కావలయునని మన మీనాడు వార లందఱకును ప్రోత్సాహకరమగు సమాశ్వాసముతో గూడిన సందేశమును పంపుదము. నేమ అక్కడ నిర్మింపబడుచున్న క్రొత్త అధినివేశరాజ్యముకూడ, ఆప్రాంతమును పరిపాలించుటలోను, అచ్చటి పౌరుల నందఱును సుఖవంతుల గావించుటలోను, అఖండవిజయమును

పొందుగాక యని వాంఛింపుచు మనశుభాకాంక్షలను పంపు దముగాక. ఆయధినివేశరాజ్యపు పౌరు లందఱును ఎటువంటి విచక్షణతారతమ్యములు లేకుండ సరిసమానముగా న్యాయముగా చూడబడుదు రని హృదయపూర్వకముగా మనము విశ్వసించె దముగాక. ఈనాడు దేశమును విభజింపవలయు నను పట్టుపట్టి, మననుండి విడిపోయినవారుసయితము ప్రస్ఫుటమగు భారత దేశపు సహజైక్యతను గుర్తించి, మరల మన మందరము నేకమగుకొఱకు కృషిచేయుదు రని మనము గాఢముగా కాంక్షించుచుందుగాక, అట్టి సత్పరిణామమును సమకూర్పు మని దైవమును ప్రార్థింతముగాక. ఈసమైక్యత కేవలము పాశవ శక్తి ప్రయోగమువలన లభింపదు. విశాలహృదయముతో, పరస్పర సహకారముతో, శాంతిసౌజన్యములతో మనము ప్రవర్తించుట మూలమున, నేడు మననుండి విడిపోవుచున్న సోదరులనుగూడ ఆకర్షింపగల సన్మార్గమున మన వ్యవహారములను నడుపు కొనుటమూలమున ఆసమైక్యత సిద్ధింపగల దని మనము గట్టిగ తెలిసికోవలయును. ఈసమైక్యతాసిద్ధి కేవలము స్వప్నోదంతముగా నేడు కాన్పింపవచ్చును. కాని ఇది దేశవిభజనను సంకల్పించిన వారి కలను మించినది కాదు. ఈనాడు మన మూహింపగల్గు నంతకంటె అత్యల్పవ్యవధిలోనే మన సమైక్యభారతనిర్మాణ స్వప్నము ప్రత్యక్షసంఘటన కాగలదు:

... ... ... ... ... ... ...

"ఏనా డీదేశమునప్రతివ్యక్తియు సంపూర్ణస్వాతంత్ర్యమును పొందునో, ఏనాడు ప్రతివ్యక్తికిని సమగ్రాభివృద్ధిని పొందు అవకాశము లభించునో, ఏనాడు అజ్ఞానము, దారిద్ర్యము, రోగ

బాధలుతొలగిపోవునో, ఏనాడు మతధర్మము పట్టియుపన్యాసము లందును, ఆడంబరప్రచారములందునుమాత్రము గోచరించుచు మానవసమాజమును పరస్పరము విరుద్ధపక్షములుగా విభజించి పోరాటములు కల్పించి యుద్రేకములను పుట్టించి ధ్వంసము చేయుటకుమారుగా అనుక్షణము మనచర్యలలోను, ఆచార ములలోను నిలిచి మానవులను హృదంతర్గతమైన దృఢానురాగ ముతో బంధించెడు సాధనముగా పరిణమించునో,ఏనాడుదారుణ మగు అస్పృశ్యతాదురాచారము దుస్స్వప్నప్రాయమై మటు మాయమగునో, ఏనాడు నరుని నరుడు పీడించి పిప్పిచేసివేయు దోపిడిపద్ధతి నిర్మూలమైపోవునో,ఏనాడు దేశములో నధమాధమ స్థితిలోబడియున్న ఆదిమనివాసులకు, తక్కిన వెనుకబడియున్న జనులకు తదితరులతోడి సమానప్రతిపత్తి చేకూర్చుకొను కగు ఉద్యమములు సఫలీకృతములగునో, ఏనాడు కోట్లకొలది ప్రజల కవసరములగు అన్నవస్త్రాదులు సమృద్ధిగా దొరకుటేగాక పాడి పంటలు దేశమందంతట నవ్వారిగ లభ్యములగునో, ఏనాడు ప్రజానీక మెల్ల నవ్వుచు నాడుచు పాడుచు తమ తమ పని పాటలు చేసికొనగల్గునో, ఏ నాడు ప్రతికుటీరము హస్తపరిశ్రమ లకు నిలయమై దేశమును సుసంపన్నము గావించునో, ఏనాడు గ్రామసీమల బాలబాలిక లెల్లరు సౌఖ్యానందములతో దివా రాత్రులు నుత్సాహితులై వెలయుదురో ఆ పర్వదినము ఘటిల్లుటకు వలయు త్యాగములు చేయుటకై సిద్ధముగా నుందుమని ఈ సమయమున మనము దీక్షాబద్ధకంకణులము గావలయును.

## సంయుక్త ప్రకటన

"1947 ఆగష్టు 15 వ తేదీనుండి రెండు స్వాతంత్ర్యఅధినివేశాలను నెలకొలుపుటకు అంతిమనిర్ణయము జరిగినది. కాబట్టి భావికాలపు ప్రభుత్వముల పక్షమున విభజనసంఘ సభ్యులు విభజనకార్యక్రమమును సత్యముగా జరుపునిమిత్తమును, పరిపాలనకును, ఆర్థిక పునర్నిర్మాణమునకునుసంబంధించిన అత్యావసర కార్యములను నిర్వర్తించుటకొఱకును వీలగునటుల ప్రశాంత పరిస్థితులను నెలకొలుపుటకై దృఢనిశ్చయులై యున్నటుల ప్రకటించియున్నారు.

"అధికారస్వీకరణానంతరముసముచితము న్యాయముగను, ఇతరులతో సరిసమానముగను మైనారిటీలను (అల్పసంఖ్యాకులను) చూచెదమని కాంగ్రెసు, ముస్లిములీగు రెండును వాగ్దానము చేసియుండెను. ఈవాగ్దానములను భవిష్యత్ప్రభుత్వములు రెండును పునరుద్ఘాటించియున్నారు. జాతిమతలింగవిచక్షణ లేకుండ సర్వప్రజల క్షేమమును కాపాడవలయు నని వారి ఆశయము.

"పరిపాటిగా సాగుచున్న పౌరుల హక్కులసందర్భములో అందరు పౌరులును సరిసమానముగా చూడబడుదురు. తమతమ మండలములలో నున్న ప్రజల కందరకును వాక్స్వాతంత్ర్యము, సమ్మేళనస్వాతంత్ర్యము, పూజార్చనాదిస్వాతంత్ర్యము పరిపూర్ణముగా నుండు నని ఉభయప్రభుత్వములును వాగ్దానము చేసియున్నారు.

"ఆగష్టు 15 వ తేదీలోపల రాజకీయముగా విరుద్ధాభిప్రాయములు ప్రకటించినవారియెడలగూడ ఎటువంటి విచక్షణాయును చూపబడకూడ దని ఉభయప్రభుత్వములును అంగీకరించియున్నారు.

" ఉభయప్రభుత్వములును తమ తమ ప్రాంతములయందు ప్రజలను తప్పక రక్షించుదు మని యనుచుండిరి. అనగా ఏ ప్రాంతములోనైనను ఎటువంటి హింసాచర్యకు ప్రకోపము సంభవించినను ఎంతమాత్రమును సహింప మనెడి భావమును అందులోనే యిమిడియున్నది. ఈ నిశ్చయములో రెండు ప్రభుత్వములును ఏకాభిప్రాయము కలిగియున్నటుల దృఢముగా చెప్పదలచియుండిరి.

"పరిణామకాలములో పంజాబునందు శాంతిని కాపాడుటకు ప్రాక్పశ్చిమపంజాబుభాగములకు సంబంధించిన ... ... ... జిల్లాలలో ప్రత్యేకసైన్యవ్యవస్థను నెలకొలుపవలయునని ఉభయప్రభుత్వములును కలిసి అంగీకరించియుండిరి. ఈ ఉభయుల అంగీకారముమూలమున ఆగష్టు 1_వ తేదీనుండి యీ ప్రాంతములలో ఉభయరాజ్యముల సైన్యములను మేజరుజనరలు రీస్ గారు నిర్వహించుచుండును.

"సరిహద్దుసంఘముల నిర్ణయము లెటులున్నను వాని నంగీకరించి తీరవలయు నని ఉభయప్రభుత్వములును ప్రమాణము చేసియుండిరి. వారు తమవిధిని సంతృప్తికరముగా నిర్వహించవలయు ననిన యెడల, బహిష్కరణకార్యములకును, ప్రత్యక్షచర్యలకును పూనుకొందు మని బెదరించుచు బహిరంగోపన్యాసములుగాని, పత్రికాప్రకటనలుగాని వారి కార్యక్రమమునకు ఆటంకము

కల్పించకుండుట చాల యవసరము. ఇందుకొఱకై ఉభయ ప్రభుత్వములు తగినచర్యలు తీసికొందురు. తమనిర్ణయములను ప్రకటించుటతోడనే ఉభయప్రభుత్వములును తక్షణమే పక్షపాతరహితముగా ఆతమ నిర్ణయములను ఆచరణలో పెట్టుదురు.

ఈప్రకటన చేయునప్పుడు దేశవిభజనసంఘసభయందు వైస్రాయిగారు, భవిష్యద్భారతప్రభుత్వప్రతినిధు లగు సర్దారు వల్లభాయిపటేలువారు, డాక్టరు రాజేంద్రప్రసాదుగారు, భవిష్యత్పాకీస్థానుప్రభుత్వప్రతినిధు లగు లియాఖత్ అలీఖానుగారు, జిన్నాగారును నుండిరి.

## గవర్నరుజనరలులు

కాంగ్రెసునాయకులు అసమర్థులైపోయి మౌంటుబాటను ప్రభువు నింకను నిలిచియుండు డని కోరుట యింకను ఇంగ్లాండునకు లోబడియుండుటకు నిదర్శన మని యాక్షేపించువారికి గాంధీజీ సమాధానము:— అట్టి విమర్శకు లందఱు తమసంశయములను తొలగించుకోవలయు నని నాకోరిక. పండిట్జీ, సర్దారు పటేలువంటి ఆజన్మస్వాతంత్ర్యసమరయోధులు ఎన్నడైనను ఇతరులకడ మోకరింతు రని యీవిమర్శకులు ఊహింపగలరా? ఆగష్టు 15-వ తేదీపిమ్మట మనయిష్టమువచ్చినవారిని గవర్నరు జనరలుగా నియమించుకొనే అధికారము మన కుండునని వీరందఱు గ్రహింతురుగాక. ఈపదవి కెవరినైనను ఎన్నుకొను నధికారము నాకే యుండెనేని ఒక హరిజనబాలికను ఎన్నుకొనేవాడను. లార్డుమౌంటుబాటనునియామకమును నేను శంకింపవలదనుటలో ప్రజలను మోసముచేయవలయు ననెడు ఉద్దేశ్యము

నాకు లేదు. ఆయన మన కన్యాయము చేయుచుండెనని తోచు నెడల నెప్పుడైనను ఆయనను మనము అరికట్టజాలుదుము. మొదటిలో, పాకిస్థానుఇండియూలకు మౌంటుబాటనుప్రభువే గవర్నరుజనరలుగా నుండవలయు నని ఉభయపక్షములవారు నంగీకరించి రను విషయము వార్తాపత్రికలద్వారా తెలిసికొంటిమి. చిట్టచివఱకు తుదిక్షణములో జిన్నాసాహెబు తన అభిప్రాయమును మార్చుకొని ఆయుద్యోగమునకు తననే పేర్కొనినాడు. కాంగ్రెసునాయకులును అదేతీరున మార్చుకోగల్గుదురు. కాని తా మాడినమాటను వీరు తప్ప దలంపలేము. ఈక్రొత్త యుద్యోగములో మౌంటుబాటనుప్రభువు నిజానికి చట్టరీత్యా ప్రభుత్వాధికారిగా నున్నను,అది ఆయనకు కఠినపరీక్ష కాగలదు. నిజానికీయుద్యోగము ప్రజాసేవకొఱ కేర్పడినది. ప్రజాసేవాపరాయణుడై యీపరీక్షలో ఆయన మహత్తరవిజయమును సాధించు నని నే నాశించుచున్నాను. ఇంగ్లీషువా డెవడును, భారతదేశమున కెన్నడును మిత్రుడుగా వర్తింపజాల డనియు, విధేయుడుగా మొదలే మెలగజాల డనియు, అందునను రాజవంశీకుడై యుండి, తనసోదరకుమారు డిప్పుడు ఇంగ్లాండునకు భవిష్యద్రాణి కాగల పడుచును వివాహము చేసికోబోవుచుండగా అలార్డుమౌంటుబాటను భారతయూనియనునకు నిజమైన సేవలు చేయనోప డనియు నూహించుట వట్టి తెలివితక్కువతన మనువా రున్నారు.

అయోగ్యుడనని రుజువుచేసికొనువఱకును మన మెవ్వనిగాని శంకింపదగదు.

జిన్నాసంగతియు అట్టిదే. ప్రపంచమునకు తాను ఇస్లాము రాజ్యమును స్థాపించితి నని తెలుపుకొఱకు గవర్నరుజనరలు

పదవిని ఆయన స్వీకరించుచున్నాడు. కాని ప్రజల అడుగుజాడ లలో నడిచిననేతప్ప ఆయనయుద్యోగము నిరర్థకమై పోగలదు. ఆపదవి ఆయన కేగాక, యిస్లామునుతమునకును, కఠినపరీక్షయే యగును. ఈపరీక్షలో జనాబ్ జిన్నాసాహెబుసయితము మహా త్తరవిజయమును సాధింపగల డని నాయాశయము.

## సాకులు

### 'డాను' పత్రికకు గాంధీజీసమాధానము

"ఖాయిదేఅజాంజిన్నాగారి వాక్ప్రతిబింబ మనదగు 'డాను' పత్రికయొక్క సంపాదకుడు నాకొక బహిరంగ లేఖను ప్రకటించి యున్నాడు. అల్పసంఖ్యాకవర్గముల వారికి సంరక్షణ యొసగబడు నని జిన్నాసాహెబుగా రిడిన వాగ్దానముయొక్క సార్థకత పాకి స్థానమునందలి ముసల్మానులు తదనుగుణముగా వర్తించుటను బట్టియుండు నని నే నన్నందుకు ఆలేఖలో ఆక్షేపించుచున్నాడు. నే నిప్పటికిని ఆమాటనే యందును. నామాటలో నెట్టి ఎత్తి పొడుపును లేదు. వైస్రాయినిగూర్చియు, కాంగ్రెసు మంత్రుల గూర్చియు నే నటులనే అనుచున్నాను. సింధురాష్ట్రమందలి హిందువుల నావేశించిన భీతి దుర్దశాప్రారంభమునే సూచించు చున్నది. ఆసంపాదకుడు యు. పి. లోని మైనారిటీ లగు ముస ల్మానుల కష్టములనుగురించియును, భయముల గురించియును నింకను ప్రస్తావించుచున్నాడు. తనమాటకు బలము నిచ్చు నిమిత్తము కొన్నియుదంతముల పేర్కొనుచున్నాడు. ఆసంఘు టనలు సత్యములే యని రుజువైననుకూడ, సింధురాష్ట్రమునందలి అత్యాచారములు యు. పి. లో జరుగునవి కానికారణముచేత,

తత్తుల్యములగు దుష్కార్యములు సింధురాష్ట్రములో జరుగుట భావ్యము కాజాలదు. యు.పి.యెడల నిందారోపణముచేయుచు వ్రాసిన విషయము లనేకము నే నెఱుగ నని యొప్పుకోవలసి యున్నది. నే నెఱుగని నిందలంగూర్చి బహిరంగముగా తాను ప్రస్తావించుచున్నటుల, బహుశః, ఆసంపాదకు డెఱుంగడు కాబోలు.......డానుపత్రికాసంపాదకునకును, మఱియు నన్ని పత్రికలసంపాదకులకును నాదొక సలహా కలదు. తమతమ భావము లెట్టివైనను, అతిశయోక్తులను మానవలయును. నా సలహా ననుసరించుకొనుటకు వారొక సమిష్టిఉపసంఘమును ఏర్పాటుచేయవలయును. సాంఘికవివాదలగూర్చిన నివేదికల నన్నింటిని ఆ యుపసంఘమునకు బంపవలయును. మఱియు బాధ్యతాయుతులగు మంత్రులకును పంపవలయును. అవసరము లగువానినే ప్రకటింపవలయును. ప్రజలయెడ తమకర్తవ్యమును గ్రహించి సాంఘికద్వేషముల నన్నింటిని వెంటనే తప్పక సమ యింపజేయవలయు నని సంపాదకులు ఆతురపడువా రగునెడల నా సలహా వారికి హితవు కాగలదు. దేశవిభజనమేమో జరిగి పోయినది. తిండికిని, గుడ్డకును కఱవై అగచాట్లు గుడుచుచున్న లక్షలకొలది జనమునకు ఆహారమును, వస్త్రమును సమకూర్చి నిర్మాణకార్యక్రమమును పూనుకొని దేశము శాంతి ననుభ వించుటకు తరుణ మాసన్నమై యున్నది.

## యూనియన్ జాక్ (బ్రిటిషువారి జండా)

"15 ఆగష్టునుండి జాతీయపతాకమునం దొకమూల యూని యన్‌జాక్ ఆక్రమించుకొనియుండు నను కింవదంతి విని యొక విలేఖరి క్రోధోద్రేకముతో నా కొక లేఖను వ్రాసియున్నాడు.

అటుల జరుగునెడల తా నాజండాను చించిపారవేసి అట్టి దానిని సైరించుటకంటె తాను మరణమునైన పొందుదు ననుచున్నాడు. ఎంతటి అనాలోచితపు నిర్ణయమో! యూని యనుజాకు తానుగా నేమియు పాపము చేయలేదు. దాస్య మునబడియున్న యాకాలమునుండి భారతదేశమునకు జరిగిన అపకృతి బ్రిటిషు ఉద్యోగులు చేసినదై యున్నది. ఐనను, వారిప్పుడు వెడలిచనుచున్నారు. మాంటుబాటను ప్రభువు నిలిచియుండును. కాని వైస్రాయిగామాత్రము కాదు. ఇక మీదట ఆయన ప్రజల ప్రథమసేవకుడుగా పనిచేయును. ప్రజల ప్రతినిధులగు మంత్రివర్గపు ఆజ్ఞలను నిర్వర్తించును.

"భారతదేశము అధినివేశము గానున్నకాలమున మన జండాలో నొకమూల యూనియనుజాకు ఉండినను హాని యేమో నాకు బోధపడుటలేదు. మొన్నటివరకు మన శత్రువు లుగా నుండినవారియెడ మన యౌదార్యమును చాటు కార్య ముగ నుండగలదు. ఎంతయో యోర్పుతో మనము కూర్చు కొనివచ్చిన సదాచారమున కది యొక చిహ్నముగా నుండును గదా. ... ... గతకాలమునసయితము మీరు బ్రిటిషువారిని శత్రువులుగ భావించియున్నను, నే నెన్నడును ఎవరిని శత్రువుగా జూడను. తండ్రు లెన్నడో చేసిన నేరములకై వారి బిడ్డల దండిం చుట పాడి కాజాలదు. నేను పుట్టినదాది పోరాటమును నేర్చిన వాడను. నాజీవితకాల మంతయు తిరుగుబాటుదారుగనేయుంటిని. ప్రపంచములో, అవమానమునకు తలయొగ్గువారిలో, నేను తుట్టతుదివాడను. ఇంతకును యథార్థ మేమన కాంగ్రెసు వర్కింగుకమిటీవారు జాతీయపతాకములో నొకమూలకూడ యూనియనుజాకు ఉండుట కంగీకరించలే దని విని విచారపడి

నాను. వానిని విసర్జించి వేసినందులకై మీ రానందింపబోకుడు. బ్రిటిషుదొరతనమువారు మీస్వాతంత్ర్యమును గుఱుతించి యుండిరి గావున మీరు మీ యిష్టముచొప్పున చేయవచ్చును. మీపూర్వసంప్రదాయములను గుర్తుంచుకొనుడని విన్నవించెద గాక !

## జిన్నాసాహెబు అభయవాక్కు

“పాకీస్థానములో వసించు అల్పసంఖ్యాకవర్గములవా రందఱకును మతవిశ్వాసవిషయమునను, మతానుష్ఠానవిషయమునను సంపూర్ణస్వేచ్ఛ యుండు ననియు, వారి ప్రాణములకు, ఆస్తికి పూర్తిరక్షణ యుండుననియు అభయప్రకటన చేసినటుల తెలిసి నాహృదయ మానందము నందినది. ఏనాయకుడైనను ఏమైనను చెప్పవచ్చును. నిష్కపటముగనే చెప్పవచ్చునుకూడను. కాని అంతమాత్రాన వానిసదోబోధ ఆచరణలోనికి వచ్చునని ధృవపడజాలదు. దేశవిభజనము సాధించినపిమ్మటనుగూడ కత్తిపోటులు, హత్యలు, ద్రోహములు, ఇండ్లు తగులబెట్టుటలు ఎల్లెడలను జరుగుచునేయున్నటుల వినవచ్చుచున్నది. నాకు సింధుమిత్రులు చాలమంది కలరు. వా రిండ్లువాకిండ్లు విడిచి వేసి పోవుచున్నారు. వారి కింక రక్షణ లేదని తోచుచున్నదట! కరాచీనగరము పాకీస్థానపు రాజధాని కాబోవుచున్నదిగదా! సింధురాష్ట్రమునందలి హిందువులకు రక్షణ నొసగుటకై ఆగష్టు 15 వ తేదీవరకు ఆగు డనునా యని నేను జిన్నాసాహెబుగారి నడుగగోరుచున్నాను. అన్యాయము జరుగనోపు ననెడు భీతితో నేహిందువైనను పాకిస్థానములో తనయింటిని వీడి పోవుచుండె నని వినుచో నాకు మితిలేని దుఃఖము కలుగును. ఖాయిదే

అజామహమ్మదుజిన్నాగారు పాకిస్థానమునకు గవర్నరుజనరలు కాబోవు చున్నను తన మంత్రులమాట తీసికొనకుండ ఆయన యేమియు చేయజాలడు. ఐనను లీగువారిమీద ఆయన పలుకుబడి సన్నగిలుచున్న దని నే ననుటలేదు. అందుకుమారుగా ఆయన రాజకీయాధికారము మనుపటికన్న హెచ్చే యగును. కాబట్టి తాను గవర్నరుజనరలు కాబోవుచున్న అధినివేశములో సింధు రాష్ట్రమునందును, తదితరప్రాంతములందును జరుగుచున్నటుల తెలియవచ్చుచున్న సంఘటనల నాపివేయుట ఆయనకర్తవ్యమగును. ఒకపురుషునిగాని, గవర్నమెంటునుగాని చేతల ననుసరించి యెన్నిక చేయుదురు. ఈమాట భారతదేశమునకును వర్తించును. యు. పి. లో కొందఱు ముసల్మానులు తా మక్కడ సురక్షితముగ జీవింపగలమా యని భీతిలుచున్నారు. యు. పి. వారి మాతృస్థానమే యనియు, నెప్పటియట్లు నిర్భయముగా నందు జీవింపగ్లుదు రనియు వారికి సర్వవిధముల విశ్వాసము కల్పించుట అచ్చటి గవర్నమెంటు కర్తవ్యమై యున్నది. 'విడదీసి పరిపాలనము చేయుట' బ్రిటిషువారి రాజనీతిగా నుండెను. వారి పరిపాలన మిప్పు డంతరించినది. అదే తీరున పక్షపాతనీతియు నంతరించవలయును. ఏదేని అల్పసంఖ్యాక వర్గము ఉద్యోగపదవులందుగాని, ఉద్యోగలాభములందుగాని వారికి రాదగినదానికన్న కొంత హెచ్చుగా సంపాదించుకొని నంతమాత్రాన నేగి యేమి? అల్పసంఖ్యాక వర్గమువారికి పూర్తిన్యాయమును బడయు హక్కుగలదు. సమర్థతయు, యోగ్యతయును మాత్రమే పాటింపబడవలయును. బ్రిటిషు వారు తమపబ్బము గడుపుకొనుటకుగాను అల్పసంఖ్యాకవర్గములకు చాలకాలమునుండి ఉద్యోగలాభముల నవ్వారిగ కట్టి

పెట్టుచు వచ్చిరి. ఆ పద్ధతి యికమీదట వారిని వంచింపదగదు. అట్టివన్నియు లంచములవంటివే యని వారు గ్రహింప దగుదురు. ఇంతచేసినను బ్రిటిషువారు అస్పృశ్యతను తొలగింప జాలరైరి. హిందువులే దక్షిణభారతదేశమందలి పురాతన దేవాలయములలోనికి అస్పృశ్యులకు ప్రవేశము నొసగిరి. అస్పృశ్యతాకళంకమును తొలగించుట వలననే హిందూమతము సజీవమై పఱగగలదుగావున నీవిషయము నన్ను సంతోషాంతరంగుని గావించినది. అభినవభారతదేశమున అసామాన్యాధికారము లెవరికిని నొసగదగదు. పేదలును, వెనుకద్రొక్కబడియున్నవారును, దుర్బలురును, నుపేక్షపాలైన వారును మాత్రమే మనదృష్టి నాకర్షించి ప్రత్యేకశ్రద్ధను బడయ నర్హులగుదురు. హరిజనుల నుద్ధరించు నిమిత్తము హెచ్చుసొమ్మును వ్యయము చేయునెడల బ్రాహ్మణుడు గొణుగుకొనక్కఱయుండదు. అయినను అతడు బ్రాహ్మణుడను కారణముచేత క్రిందికి పడలాగవేయబడదగదు. ఇంతకును బ్రాహ్మణులు మిక్కిలి అల్పసంఖ్యాకులుగ నున్నారు. కావున వారు నిష్కళంకులుగా నుండవలయును. పాకిస్థానమునందును, హిందూస్థానమునందునుగూడ నిర్దుష్టమగున్యాయము ఎల్లవారియెడలను జరుగగావలయును.

## దుర్బలుర అహింస

"దుర్బలురదేయైనను అహింసపైన మనపోరాటమాధారపడి నడిచిన దని ఒకమిత్రుడు నాతో ననుచున్నాడు. ఆ మాట పొరపాటు. 'దుర్బలుర అహింస' యనునదే యుండజాలదు. అహింసయు, దుర్బలతయు పరస్పరవిరుద్ధవిషయములు. నేడు

నాలో చూపట్టుచున్న నిరాశవంటిదానిని నే నెన్నడును ననుభవించియుండలేదు. నేను పుట్టినదిమొదలు పోరాటము చేయువాడనై యుంటిని. ఓటమి యనున దెఱుగనైతిని. కాని యీ నాడు చీకటిలో పడి తడవులాడుకొనుచున్నాను.

"అంతటి నిరుత్సాహ మేల యని యీస్నేహితుడు శంకించుచున్నాడు.

"మన దేశ మిప్పుడు అహింసావలంబనము చేయనియెడల అందువలన మన దేశమునకును, ప్రపంచమునకును క్షేమ మూడ నున్నదని నాకు స్పష్టముగా గోచరించుచున్నది. అందువలన స్వాతంత్ర్యమునకు నీళ్ళు వదలుకోవలసివచ్చును. దానివలన సైనికనిరంకుశత్వము వచ్చి పైబడినను పడవచ్చును. బలయుతుల అహింసను సేవించు టెట్లా యని నేను రేయింబవళ్ళు చింతనచేయుచున్నాను.

"ఆసియావాసులమహాసభయందు, భారతదేశపు అహింసా సౌరభము జగ మెల్ల వ్యాపించుగాక యను ఆశయమును వెల్లడించితిని. ఆమహాశయ మెన్నడేని నెరవేరునా యని విస్మయముచెందుచున్నాడను.

## జాతీయముసల్మానులు

"జాతీయపక్షము వహించిన ముసల్మానుల స్థితి శోచనీయముగ నున్నది. భారతదేశైక్యతయందు వారు విశ్వాసము పూనియుండిరి. వారు ఇస్లాముమతమునెడ గాఢతరాభిమానము గలవారయ్యును, తాము సర్వవిధముల భారతీయులై యున్నటుల భావించెడువారు. జాతీయత, మతము నను రెంటిమధ్యను

వైరుధ్యము లేదు. ఐనను వారు సంశయాస్పదులైపోయిరి. సత్యసంధులై నిలువబడువారుమాత్రమే నిరపాయులై వెలయ గల్గుదురు.

"ప్రఫుల్లబాబు, సురేశబాబు తూర్పుబెంగాలునకు చెంది నవారైయుండియు అట్టితూర్పుబెంగాలులోని తమ సోదరులను నెడబాసి పశ్చిమబెంగాలులో మంత్రిపదవుల స్వీకరించుటేల యను శంక బయలుదేరినది. వారు పశ్చిమబెంగాలులో నెందుకు సేవ లొనరింపదగదో నాకు తెలియుటలేదు. అందు మూలాన వారు స్వస్థానముల పరిత్యజించుచుండి రని అర్థము కాదు. నిజానికి వారారెండురాష్ట్రములబంధుత్వమును బలపఱచువారగుచున్నారు. ఎల్లెడల కీడునే చూచు నలవాటు కూడదు. ముసల్మానులెల్లరును చెడువారు కారు. అదేరీతిన హిందువులెల్లఱును చెడువారు కారు. దోషబుద్ధుల కితరులందు దోషములే గోచరించును. ఉత్తమదృష్టి నవలంబించి, నిర్భయులై యుంట యెల్లఱకును నేడు ప్రధానకర్తవ్యముగ నున్నది.

## 31. అహింస – స్వతంత్రభారతదేశము

"అనివార్యమగు స్వరక్షణధర్మ మని వాకొనుచు మానవజాతి హింసను, యుద్ధములను సదా సమర్థించుచు వచ్చిరి. కలహమునకు కాలుదువ్వు దుండగుని హింసావర్తనమును అణచుటకు వానిదౌష్ట్యమును మించిన హింసాచర్యను ఆత్మరక్షణకు బూనునతడు చూపవలయు ననుట సులభమగు సూత్రము. ప్రపంచమం దెల్లెడలను, ఆసూత్రానుసారముగ

మానవులు యుద్ధసన్నాహముల గూర్చికొనుటలో పోటీలుపడి వెఱ్ఱి పర్వులెత్తుచున్నారు. ఏనాడేస్థితియందు ప్రపంచము ఖడ్గములను విసర్జించివేసి నాగళ్ళను చేబూనగల సర్వశాంతి దశకు చేరగల్గుదురో ఎవరికిని తెలియరాకున్నది. ఏయ్యది ఆత్మరక్షణోపాయమో యిప్పటికిని మానవుడు నిజముగా గ్రహింపజాలకున్నాడు.

"ఐనను తా ముపదేశించు ధర్మమును తా మాచరించిన పురుషశ్రేష్ఠులు, యథార్థమగు ఆత్మరక్షణోపాయము అప్రతీకారావలంబనమే యని బహువిస్పష్టముగా నిరూపించియున్నారు. ఈమాటయందు విరోధాభాసము స్ఫురింపనగును. కాని యథార్థమునే ఆనుడి బోధించుచున్నది. హింస ప్రవర్ధనమగుటకు ప్రతిహింసాచరణమే ఆధారము. కలహమునకు కాలుదువ్వువాని దుశ్చర్యకు వెనుక సదా యొకయుద్దేశ్యము దాగియుండును. వాడు సాధించుకోగోరు వాంఛితార్థ మొకటి యుండును. స్వరక్షణకు బూనువాడు తనకు దేనినో వశము చేసివేయవలయు నని కోరుచుండును. సరే, ఆత్మరక్షణ చేసికోవలసిన యతడు తనహృదయమును దిట్టపఱచుకొని, యిసుమంతయు లోబడకుండ నిశ్చయించుకొని, ఐనను తనపై బడవచ్చువాని హింసాకార్యమునకు సమమగు హింసాచర్యనే పూనుకోవలయు ననెడు దుష్ప్రేరణను అణంచుకోగలుగునెడల, వానిపై బడవచ్చినవాడు వానిని శిక్షింపదలపడుట లాభకారి కాదనియు, ఆరీతిగా వానిని వంచ శక్యముకా దనియు అచిరకాలముననే గ్రహింపవలసినవా డగును. ఇందుకు బాధాసహన మవసరమనుట సత్యము. నిష్కళంకమగు సహనదీక్ష అప్రతిహతమగు ఆత్మరక్షణోపాయ మగుట నిశ్చయము.

"అటుల అప్రతీకారదీక్షపూని ఆత్మరక్షణకు గడంగినవాడు తనప్రాణము గోల్పోవునెడల, వానిపూనిక ఆత్మరక్షణధర్మ మనిపించుకోగలదా యని యెవరేని శంకింపవచ్చును. ఏసుక్రీస్తు తనప్రాణమును పోగొట్టుకొనినాడు. రోమకరాష్ట్రాధికారియే కృతకృత్యుడైనాడుగదా యని వాదింపనగును. అటు లనుట సరిగాదు. అందు ఏసుక్రీస్తుదే విజయము. ప్రపంచ చరిత్రయే దానిని సంశయమున కెడములేకుండ రుజువుచేయుచున్నది. కార్యాచరణమున శరీరము భగ్నమై పోయిన నేమి? ఏసు పూనిన అప్రతీకారదీక్షవలన సమాజమున సహస్రప్రభావము అప్రతిహతమై ప్రజ్వరిల్లనైనది.

"నరుడు ప్రాణము నర్పించుటమూలమున దాని ప్రభావమును సుస్థిర మొనరింపజాలుట యనెడు యథార్థాత్మరక్షణోపాయమును లలితకళగా వ్యక్తులు అభ్యసించి ఆదర్శపురుషులై వెలసిరి. ఆ పద్ధతి విశాలమానవసంఘము లవలంబింపజాలు తెరగున సుపరిష్కృతము చేయబడియుండలేదు. భారతదేశమందలి సత్యాగ్రహోద్యమము ఆదిశగా నడిచినది గాని, అసమగ్రమై యొప్పినది. కావుననే హిందూముసల్మాను పోరాటములందది తుదిని విఫలత గాంచినది.

ప్రొఫెసరు స్టూవర్టు నెల్సనుగారి సంశయమిది:—
శాంతియుత మార్గములద్వారా కొంచెము హెచ్చు తగ్గుగా స్వాతంత్ర్యమును సాధింపజాలినభారతీయులు ఇప్పుడుచెలరేగుచున్న అంతర్యుద్ధమును అదేమార్గము ననుసరించి అణచి వేయజాలకుండుటకు హేతు వేమి ?

ఈ ప్రశ్న కడు నిశితమైనది. దీనికి నేను సమాధానము చెప్ప వలసియున్నది. నేను సత్యాగ్రహ మనుకొనినది నిజముగా సత్యాగ్రహము కాదు. అది సాత్త్వికనిరోధము మాత్రమే యై యున్నది. సాత్త్వికనిరోధము దుర్బలురపాలిటి ఆయుధము. భారతీయులు మొన్నటివఱకు తమపై పరిపాలకులుగా నున్న వారిని దౌర్జన్యరహితముగా నెదిరించునటుల నటించిన సమయమున, వారియెడ ద్వేషమును, క్రోధమును వహించియే యున్నారు. కావున వారినిరోధము దౌర్జన్యప్రేరితమైనదియే గాని, యెవరియందు తాము సత్యాగ్రహము నాధారము చేసికొని పరివర్తనమును కల్పింపవలసియుండిరో అటువంటి బ్రిటిషువారియందలి మానవత్వమునెడ ఆదరణచే ప్రేరితమైనది కాదు.

"ఇప్పుడా బ్రిటిషువారు తమంతటతామే వెడలిపోవుచుండిరి గావున ఆబూటకపు సత్యాగ్రహము క్షణములో ముక్కలు చెక్కలై రాలిపోయినది. నేడు అధికారము పంచుకొను సమస్య బయలుదేరిన యీతరుణమున భారతజాతీయకాంగ్రెసు వారివలన నియమింపబడిన నిగ్రహమునకు భిన్నముగా మన హృదయములందు దాచుకొనియున్న దౌర్జన్యభావము మన నావహించివేసి ఒండొరుల కుత్తుకలను నఱకుకొనునటుల చేసినది. సాంఘికవిద్వేషరూపము దాల్చిన దౌర్జన్యబలమును వుసీతము చేసి ఆయాప్రయోజనముల సాధించునిమిత్తము, నిర్మాణాత్మక మగు శాంతిమార్గములోనికి మరలింపగలుగుచో అయ్యది పరమ శుభసమయముగ నెన్నదగును.

## 52. యుద్ధప్రసక్తి

హిందూస్థాను, పాకీస్థానులు పరస్పరద్వేషములు పెంచు కొనునెడల అంతర్యుద్ధము సంభవించునేమో యను పరితాప ముతో గాంధిజీ ఈక్రిందివిధమున వచించిరి :—

"నేనుసర్వకాలసర్వావస్థలందును అహింసాతత్వానేన్న నమ్ము తాను. అందువలన నే నెన్నడును యుద్ధమునకు సమ్మతింప జాలను. నేనే రాజ్యపాలన చేయునెడల, సైనికులుగాని, పోలీ సులుగాని యుండనేయుండరు. ఈనాడు భారతప్రభుత్వము నాయధీనములో లేదు. నేను నాప్రసంగాలలో సంభవములు కాగల విషయములగూర్చి సూచింతును.

"హిందూస్థానుపాకిస్థానులు పరస్పరచర్చలద్వారమున తమ వైరుధ్యాలవిషయములో ఒక సమాధానానికి రావలయును. అది సాధ్యపడనియెడల మధ్యవర్తిపరిష్కారముననైనను ఉభ యులు విధేయులు కావలయును. కాని పైరెండువిధానములను అంగీకరించక, తమలో నొకరు అక్రమమార్గము నవలంబిం చుచునుండినయెడల యుద్ధము అనివార్యమగును.

"నే నీసూచన చేయుటకు ప్రేరేపించిన పరిస్థితులను ప్రజలు తెలిసికొందురుగాక. ప్రజాళియే చట్టమును తమవశము చేసి కొని యథేచ్ఛగా వర్తించుట తగ దనియు, తాము న్యాయ మును సాధింపదలచినయెడల, ఆబాధ్యతను పరిపాలకులకు విడిచి వేయవలయు ననియు నే ననేకపర్యాయములు ఢిల్లీలోని ప్రార్థనానంతరప్రసంగమునందును హెచ్చరించియున్నాను. ఆ హెచ్చరికతోపాటు ప్రజలు రాక్షసకార్యములు గావించుటకు

పాల్పడినయెడల సక్రమపరిపాలన మెటుల భగ్నమైపోవునో మఱియు వివేకముతో ఆలోచించినయెడల రాబోవు అనర్థము లెటువంటివి వాటిలునో తెలుపవలసివచ్చినది. మఱియును, అహింసామహిమలో నావిశ్వాసము అణుమాత్రమైనను తగ్గినటుల భావింపవలదు.

శ్రీఆచార్యకృపలాని యిట్లు విన్నవించుచున్నాడు :— పరస్పరము నిందారోపణలు, ప్రత్యారోపణములు చేసికొనుట వలన మన కెంతమాత్రమును ప్రయోజనముండదు. క్షణక్షణము విచ్చలవిడిగా చెలరేగుచున్న హింస, విద్వేషము, అరాజక కృత్యము మొదలగునవి చేజిక్కిన స్వాతంత్ర్యమును వినాశము చేయును. ఆఘోరతరవిషసముద్రాలు ఎక్కడి వక్కడ నదృశ్యమైపోవుటకొఱకు సాహసముతో నుభయరాజ్యములవారు హృదయపూర్వకముగా తీవ్రప్రయత్నములు సాగించు టొక్కటియే మన ప్రస్తుతకర్తవ్యము.

"హిందూ, సిక్కు, ముస్లిమువర్గాలు మూడును మానవజాతికి తలవంపులు తెచ్చు భయంకరములగు నేరములను చేయుచుండెను. ఇట్టి మహాపాపకృత్యముల ఫలితములు భారతీయులను తరతరములుగా పీడింపక తొలగవలయు నని ఆశింతు మేని ఈమూడుమతసాంప్రదాయికసంఘములును దైవభీతి, మానవప్రేమ గలిగి సుహృద్భావము వహించి సత్కృత్యములు గావింతురేని అయ్యది సాధ్యము కాగలదు.

"దేశ మంతయు గాఢాంధకారమున మునింగిపోయినను, సుహృద్భావవిశ్వమానవప్రేమాదర్శము నెడల తన విశ్వాసము నణుమాత్రమైనను కోల్పోవక, దేశప్రజల చిత్తస్వాస్థ్యము

కొఱకై నిరంతరము కృషి సలుపుచు, అత్యల్పసంఖ్యాకులుగా నున్న సుహృద్భావసంఘమునకు పురోగామియై నిలుచు మహాత్మాగాంధీజీతో మన మండలమును సహకరించుట విధి. మన మండలము చేరి ఆయనను ఇతోధికముగ శక్తిసంపన్నుని చేయుదుముగాక. నవకాళీ, బీహారు, కలకత్తాలలోవలె తక్కిన భారతదేశములోనయితము ఆయన శాంతిసందేశము ఫలించ గలదు. ఈలోపున ఒండొరులు దూషించుకొనుటయు, ఎవరికి వారు వ్యక్తివర్గబాధ్యతల నుపేక్షించుటయు తగదు. చేసిన నేరమును స్వల్పముగ నెంచి వాదనల సాగించుట వేఱొకతీరున అత్యాచారము సలుపుటే కాగలదు.''

## 33. నెహ్రూ ఉద్ఘాటన

''ఈదేశములోనున్న సర్వసంపత్తిని సమీకరించి ఒకసాంఘిక ప్రజాస్వామ్యమును నెలకొలుపుటయే ప్రభుత్వపరమావధి. లక్షలకొలది ప్రజలకు జీవనోపాధికి దగిన పనులు దొరకుటలేదు. అనువైన వ్యక్తులు దొరకక అనేకనిర్మాణకార్యములు ఆగిపోవు చున్నవి. ప్రతిపనికిని సరియైనవ్యక్తిని ఎన్నుకొనుటకు ప్రభుత్వ మునకు అవకాశము కలుగవలయు నన్న దేశములో శాంతి యుండవలయును.

''హింస నామతానికి, నా ఆదర్శానికి విరుద్ధము. హత్యలవలన ఏకార్యమును సాధించలేము. బ్రిటిషువారితో జరిపిన పోరాట ములో మన మెన్నడును హింసాప్రయోగము చేయలేదు. ప్రపంచములోని కెల్ల మహావ్యక్తియగు గాంధీమహాత్ముడు మనకు శాంతియుతమార్గముననే స్వరాజ్యమును సాధించి పెట్టి

నాడు. ఒకరి నొకరు హత్యచేసికొనుచు ఆయన సాధించిన విజయమును మీరు కళంకితము చేసివేసెదరా? దేశస్వాతంత్ర్యముకొఱకు ధైర్యసాహసములతో పోరాడిన వీరు లెందఱో పంజాబుఢిల్లీలలో మరణించుట విని నే నెంతయో ఆవేదన జెందుచున్నాను.

“బ్రిటిషువారిని తఱిమివేయుటే కాంగ్రెసు ఆశయము కాదు. మన దేశపు ఆర్థికసౌభాగ్యము పెంపొందించి ప్రతివ్యక్తి జీవితమును సౌఖ్యమయము చేయుటకై కాంగ్రెసు తలపెట్టి యున్నది.

“విదేశముల ఆక్రమణస్థానమున అరాజకము, అల్లకల్లోలము స్థాపించవలయు నని కాంగ్రె సెన్నడు తలపెట్టలేదు. భారత దేశము అతిదరిద్రదేశము. ప్రజల కందఱకు దినమున కొకసారి యైనను చాలినంత తిండిపెట్టుటయే కష్టసాధ్యమైన పనిగా నున్నది. దేశమును పారిశ్రామికముగా వృద్ధికి తెచ్చి క్రొత్త ఆనకట్టలు కట్టి, ఎక్కువ భూమిని సాగుబడిక్రిందకు తెచ్చి ప్రజల జీవనపరిమాణమును హెచ్చింపవలయునని కాంగ్రెసు కోరుచున్నది. కాని యీ మతకలహాలవలన ఆ ప్రణాళిక లన్నియు తారుమారై పోవుచున్నవి. దేశమును సౌభాగ్యవంతము చేయుట కుపయోగింపబడవలసిన ప్రభుత్వశక్తి కల్లోలముల నివారణచేయు ప్రయత్నముననే వినియోగపడుచున్నది.”

---

# మన కర్తవ్యము

## మూడవభాగము

### 1. కాంగ్రెసుకర్తవ్యము (క్రమపరిణామము)

కాంగ్రెసుకర్తవ్యమునుగుఱించి, అనగా భారతీయుల మఁగు మనకర్తవ్యమునుగుఱించి గాంధీజీ పెక్కురీతుల బోధించి యున్నాఁడు. పత్రికలలో ప్రకటనలు చేసియున్నాఁడు. తన నడిగినవారి కెల్ల విసుగు, విరామము లేకుండ సలహోలిచ్చి యున్నాఁడు. ఇటీవల కాంగ్రెసుసంస్థయొక్క స్వరూపమును, లక్ష్యమును, సాధనావిధానములను మార్పుచేయుట అవసర మని నాయకులు గ్రహించిరి. ఇప్పటివఱకు కాంగ్రెసు గోత్రీకులు అవలంబించిన కార్యక్రమమునకు ప్రధానలక్ష్యము భారతదేశమును పరప్రభుత్వమునుండి విడిపించుటే. అయ్యది సిద్ధించిన దనియే చెప్పవచ్చును. ప్రపంచ మంతయు భారత దేశము స్వతంత్రమైనదనియు, సమస్త స్వతంత్రరాజసభ లందును భారతప్రతినిధులు సర్వస్వతంత్రప్రభుత్వప్రతినిధులుగ గూర్చుండ నర్హు లనియు అంగీకరించినది. ఇంతవఱకు భారతీ యులు కృతకృత్యులైరి. ఇది యంతయు గాంధీజీప్రసాదమే. కావున ఎల్లఱును మహాత్ముని వివరణను దెలియ నాతురపడుట సహజము. గాంధీజీ కాంగ్రెసుయొక్క ప్రస్తుతపరిస్థితులను పరిశోధించి భావిస్వరూపమును, దాని పరమలక్ష్యమును క్లుప్త ముగను, సమగ్రముగను నిరూపించుచు నొక సందేశమును భారతీయులకును, భారతీయులద్వారమున లోకమునకును ప్రక

టించియున్నాడు. 27_1_48 తేదీనా డొకవ్యాసమును రచించి హరిజనపత్రికకు బంపియున్నాడు. అందు కాంగ్రెసుకర్తవ్యము సువిదితము గావింపబడి యున్నది :—

మన రాజకీయప్రతిష్ఠాపనలలో నత్యంతపురాతనమైనది కాంగ్రెసు. అహింసామార్గము నవలంబించి పెక్కు పోరాటముల సలిపి కాంగ్రెసు దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించిపెట్టినది. అటువంటి మహాసంస్థను సమసిపోనీదగదు. మనజాతి యంతరించినప్పుడే అదియు నంతరింపదగును. సచేతనమగు సంస్థ సదా వికాసము నందుచుండవలయును. లేదా అది సమసిపోకతీరదు.

ఇప్పటికి కాంగ్రెసు రాజకీయస్వాతంత్ర్యమును సాధించినది. కాని ఆర్థికస్వాతంత్ర్యమును, సాంఘికస్వాతంత్ర్యమును, నైతికస్వాతంత్ర్యమును ఇంకను సంపాదింపవలసియేయున్నది. ఈస్వాతంత్ర్యములు రాజకీయస్వాతంత్ర్యముకన్న కష్టతరసాధ్యములు. ఏమన, ఇయ్యవి నిర్మాణాత్మక మైనవి. ఆడంబరప్రియుల దృష్టి నాకర్షించునవి కావు. ఉత్సాహజనకమైనవియు కావు, సర్వవ్యాపకము కాగల నిర్మాణాత్మకకార్యక్రమము కోటానుకోట్ల జనముల శక్తిసామర్థ్యముల వినియోగమున కవకాశ మొసగగలిగియుండును. నిరాడంబరముగా, శాంతముగా జరుగవలసియుండును.

కాంగ్రెసు తనకు ప్రాతిపదికమును, అవసరమును నగు స్వాతంత్ర్యమునుమాత్రము గడించినది. కష్టపడి ప్రజాస్వామ్యమును సాధించు నుద్యమనమునందు, అనివార్యములగు కొన్ని ముఱికిగుంటలను త్రవ్వుకొనినది. అందుండి అవినీతి పుట్టుకొని వచ్చి

నది. పేరునకుమాత్రము ప్రజాధికారసమన్వితములును, ప్రజాను మోదకములు నగు సంస్థలను సృష్టిచేసినది. పెరికివేయ దుస్సాధ్య మగునట్టియు, చెత్తగ పెరిగినట్టియు ఈకలుపును తొలగించు నుపాయ మేది ? ఎన్నడును కోటికి మించియుండనట్టియు, సులభముగా గుర్తుపట్ట వీలుగానట్టియు విశిష్టసభ్యుల ఇప్పటి పట్టికను రద్దుచేసివేయవలయును. ఎన్నడును తెరుగనున్నది లేని కోట్లాది పేరులుగల అజ్ఞాతసభ్యుల జాబితా కలదు. ఇకమీదట కాంగ్రెసు సభ్యులజాబితాలోని పేర్లును, దేశములోని వోటరులజాబితాల లోని స్త్రీపురుషులపేర్లును సమానము కావలసియుండును. కృత్రిమపు పేరేదియు అందు జొరబడకుండను, న్యాయమగు పేరేదియు విడిచివేయబడకుండను చూచుట కాంగ్రెసుకు విధి. తన స్వంతపట్టికలో ఎప్పటికప్పుడు, తమకు విధింపబడు పనిని నిర్వహించు కార్యకర్తలా జాతీయసేవకుల వర్గ మొకటి యుండవలయును. ప్రస్తుతము అట్టి కార్యకర్తలు ముఖ్యముగా నగరవాసులనుండి తీసికోవలసియుండుట దేశముయొక్క దుర దృష్టమే యగును. వీరిలో ననేకులను భారతదేశపు పల్లెలలో అచ్చటి ప్రజలక్షేమముకొఱకై పనులు చేయ నియమింపవలసి యుండును. ఈవర్గమును క్రమేణా గ్రామవాస్తవ్యులనుండి పూర్తిచేయవలసియుండును.

ఈసేవకులు శాసనప్రకారము వోటరుల చేర్చు పనుల నిర్వ హింపుచు, వోటరులకు సేవ లొనర్చువారుగా నుండగలరు. చాలమంది ప్రజలును సంఘములును వారియెడ నభిమానము జూపుచుండగలరు. వీరిలోని శ్రేష్ఠులగువారి ప్రాపును సంపా దించుకో జూచుచుందురు. దేశములో నడుగంటి పోవుచున్న తనప్రతిష్ఠను కాంగ్రెసు తిరిగి సంపాదించుకోగల్గును. వేఱు

మార్గము లేదు. ఇటీవలివఱకు కాంగ్రెసు తనకు తెలియకుండనే జాతీయసేవకవర్గముగ పరిగణన గాంచినది. 'ఖుదే ఖిద్మత్గార్' అనగా దైవసేవకగణముగా వెలసినది. ఇకమీఁదటను తాను దేవుని భటవర్గమే యనియు, అందుకు తీసిపోవుట లేదనియు తనకును, లోకమునకును చాటుకోఁగల్గును గాక.

అధికారప్రాభవమునకై అసహ్యముగా ప్రాకులాడునెడల హఠాత్తుగా నేదోయొకదినమున తనప్రతిష్ఠ తుడిచిపెట్టుకొని పోయినటుల గ్రహింపవలసిన దగును. నేఁడు దైవానుగ్రహము వలన కాంగ్రెసు సాక్షాత్తే యేకైక అధికారసమితిగా గణనగాంచుట లేదు. ఇటుల దూరస్థరంగము నొకదానినిమాత్రము నేను మీయెదుట ప్రదర్శించుచున్నాను. వయోధికులగు స్త్రీ పురుషు లందఱి దృష్టిలోను తమగౌరవమును, ప్రతిష్ఠను పెంపొందించుకొనుటకొఱకై జాతీయసేవకు లేమి చేయవలసి యుందురో తెలుపుటకు దగిన ఆరోగ్యమును, అవకాశమును లభించెనేని హరిజనపత్రికాముఖమున వివరింప ప్రయత్నింతుగాక.

## 2. నిరశనదీక్ష

ఈపై వ్యాసమునుబట్టి మహాత్ముని మనస్సు పరితాపపడుచుండె నని తెలిసికొనగలము, భారతదేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించుటకును, అందు ప్రజాస్వామ్యపరిపాలనమును నెలకొలుపుటకును, సకలజనులును సమానగౌరవప్రతిష్ఠలు గలిగి సుఖజీవు లగునటుల పలువిధసంస్కరణాల గావించుటకును అఖిల భారతకాంగ్రెసుపై బాధ్యత పెట్టి తదనుకూలమగు శిక్షణ నొసగుటకు గాంధీజీ యుద్యమించియుండెను. స్వాతంత్ర్యసమర కాలమున వసలేని త్యాగములు చేసిన కాంగ్రెసుగోత్రీకులు

స్వాతంత్ర్యము సిద్ధించగానే నీతిమాలి స్వైరవృత్తికి బూని స్వార్థ పీడితు లైరి. కంచెయే చేను మేసిన దైనది. జాతిమతవర్ణవర్గ వైరములు పెచ్చుపెరిగి దేశము అల్లకల్లోలమున మునుంగ నయ్యెను. గాంధిజీ దిక్కుదోచక దైవముంగూర్చి మొఱలిడ సాగెను. 1948 సం. జనవరి 13 తేదీని మహాత్ముడు పూనిన నిరశనదీక్ష వానికి గత్యంతరము తోచకపోవుటచేతనే సుడీ!

ఢిల్లీలో మతకలహములు హద్దుమీరిపోవుచుండెను. అనుక్షణము కొట్లాటలు, దోపుడులు, ఇండ్లు తగులబెట్టుటలు, ఆడువారిని ఎత్తుకొనిపోవుట, మగవారిని చంపుట, పసివారి ప్రాణములుతీయుట మున్నగు ఘోరాతిఘోరకృత్యములంగూర్చిన వార్తలే చెవిని బడుచుండెను. ఎంత కఠినాత్మునకైనను మనసు కలుగకపోదు. ఢిల్లీలో శాంతి యనునది శూన్యమయ్యెను. ఇక కరుణాజలధియగు గాంధీజీస్థితి వేఱుగ చెప్పవలయునా? దిన దినము ప్రార్థనానంతరము తన యుపన్యాసములలో కడు దీనముగా ఆర్తులపక్షము పూని ప్రజలంగూర్చి విన్నపములు చేయుచునేయుండెను. ఫలము కాన్పింపలేదు. గాంధీజీకి తెలిసిన కార్యసాధనలలో తుట్టతుదిది, అమోఘమైనది నిరశనవ్రతము. తద్వారమున సర్వేశ్వరుడును, సర్వభూతాంతరాత్ముడును, పరమేశ్వరుడు నగు పరమాత్మను గూర్చి తాను పూనిన గాఢతర తపస్సే అది!

మహాత్ముని వయస్సునుబట్టియు, వాని ఆరోగ్యస్థితినిబట్టియు మిత్రు లాతురపడుచుండిరి. అనేకులు స్వయముగ వచ్చి దీక్షను చాలించు డని బ్రతిమిలాడుచుండిరి. దూరమున నున్నవారు లేఖల వ్రాయుచుండిరి. తంతుల బంపుచుండిరి. దేశదేశముల

నుండి యుపవాసవ్రతము నుజ్జగింపుడను వేడుకోలులు లెక్కకు మించి వచ్చిపడుచుండెను. కొందఱు తీవ్రతర్కములు సాగించిరి. మహాత్ముడా కోరికను ప్రత్యుత్తర మొసగుచుండెను:—

“మీ ఆరాటము, మీ తర్కవాదము వ్యర్థము. మీరు నా మిత్రులే. మఱియును మహోదారులగు సుహృదులే. మీ ఆతురపాటు సహజము. నే నెంతయు మెచ్చుకొందును. కాని మీ వాదనలును, మీ అశాంతియు మీరు లోతుగా విచారించుటలే దని తెలుపుచున్నది. ... పురుషసాధ్యమగు సకలోపాయములను చేసిచూచితిని; నిరాశాహతుడ నైతిని. భగవంతుని యొడిలో తలనుదూర్చి మొఱలిడ నిర్ణయించుకొంటిని. నా నిరశనదీక్షయొక్క లక్ష్యమును, అంతరార్థమును నిదియే. మీరు గజేంద్రమోక్షణకథను జదివి నెమ్మదిలో సమాలోచనము చేసితిరేని, నేను పూనిన దీక్ష యెట్టిదో మీ కర్థము కాగలదు. లోకమున చావుబ్రతుకులను నంటిపట్టుకొని మనము ప్రాకులాడుచుండునంతకాలము, మన మేదోయొక యుద్యమము నిమిత్తముమాత్రమే ప్రాణము నిలుపుకొన వలసి యుండు నని యర్థము. ‘నీవు జీవించియుంటివా గట్టిగ శ్రమపడి పనిచేయుము’ అనెడు నుడి కడు రమ్యమైనది. అందొక అగాధమగు రహస్య మిమిడియున్నది. అటుల శ్రమపడి చేయు పని నిష్కామప్రేరిత మైనదిగా నుండవలయును.

నిరశనదీక్ష మాను డను మీ సలహాను నే నెందులకు అంగీకరింప జాలకుంటినో మీ కిప్పు డర్థమై యుండును. భగవంతుడే నానిరశనవ్రతమును నిశ్చయించినాడు. అతడే దీనిని అంతమొందింపగలడు. అదియు వాని యిచ్ఛానుసారమే జరుగును. ఈలోపుగా ఆ దేవుడే నాప్రాణములను నిలుపుగాక !

రాల్పుగాక! అంతయు సమముగా మేలుకొఱకే జరుగును. తదనుగుణ్యముగా మనము నడుచుకొనవలసియుండును. అటుల విశ్వాస ముంచుటే ధర్మము.

'సాహసచర్యయేగాని, విలాపము వలదు' అనునది మన ప్రమాణవచనముగా నుండవలయును...... నేను నాయుపవాసమును వైద్యుల సలహా నడిగి ప్రారంభించియుండలేదు. వారు గొప్ప సమర్థులే కానోపును......

నాకు ఏకైకమార్గదర్శి, నియామకుడు, అల భగవంతుడే! ఆయన సర్వశక్తిమంతుడు; ఎన్నడు పొరబడువాడు కాడు. ఈనాదుర్బలతనువుతో వాని కేమేని ప్రయోజనము కలదేని, వైద్యనిపుణులగు స్త్రీపురుషు లెట్టి నిదానములు చేసిన నేమి, దీని నతడు కాపాడగలడు. నేను వానిచేతిలో నున్నాడను. నేనొకవేళ తెప్పరిలి బ్రతికినను, మరణముంగూర్చిగాని, యేదేని శాశ్వతాపకారము కలుగునేమో యనిగాని భీతిలువాడ గానని చెప్పుచో మీరు నన్ను విశ్వసింపగల రని నాయాశ.

భారతదేశమున ఏయితరసంస్థలందుగాని, పాకిస్థానునందుగాని తమచుట్టును పెనుమంటలు రేగినప్పటికిని, తెగిపోజాలనంత బలతమమైన స్నేహబంధమును ఢిల్లీలోని హిందూముసల్మాను శిఖ్ఖు లెల్లఱును సమకూర్చుకొనినయెడల మాటమాత్రమునకైనను నాప్రతిజ్ఞ చెల్లినట్లే యగును.

వేఱొకసందర్భమున గాంధీజీ యిట్లనిరి:—

నాకు ముసల్మానులపైననే అభిమానము గలదనియు, నేను ఉపవాసదీక్ష బూనుట అందుమూలములనే యనియు, కొందఱు

నన్ను హేళన చేయుచున్నారు. వారిమాట అర్థమైనదే. ప్రతి వాడును చేయవలసియేయుండుతీరున, నాజీవితకాలమం దంత టను అల్పసంఖ్యాకులయు, ఆర్తులయు పక్షమున నిలుచువా డనే...... తమహింందూశిఖ్ఖుసోదరుల పక్షము పూని ముస ల్మానులు నిలబడజాలునటుల చేయుట కుద్యమింపబడిన దనెడు భావమున నాయుపవాసవ్రతిన ఆముసల్మానులయెడనే నేను చూపు ఆక్షేపణయు కాగలదు. ఈనిరశనదీక్షసందర్భములో నాహింందూశిఖ్ఖుసోదరులకు తీసిపోకుండ నాముసల్మానుసోదరు లును పాటుపడవలసినవారే యగుదురు......"

ఇటుల తా నుపవాసదీక్ష బూనుట యేయొక్కనిని గాని, యేయొక్కసంఘమునుగాని, వర్గమునుగాని నిరూపించి యాక్షే పించుకొఅకైన పని కాదనియు, భారతీయు లెల్లఱు పూర్ణ సఖ్యతను పునఃసంస్థాపించుకొనునటుల ప్రేరేపించునిమిత్తమే జరిగిన దనియు గాంధీజీ సుస్పష్టము చేసియున్నారు. కాని హిందువులపైని పక్షపాతబుద్ధితో బూనబడినదని యాక్షేం పించు ముసల్మానులును, ముసల్మానులపైని పక్షపాతబుద్ధితో పూనబడిదని యాక్షేపించు హిందువులును లేకపోలేదు.

## ౬. ఢిల్లీనాయకుల ప్రమాణములు

గాంధీజీనిరశనవ్రతము సాగినకొలదిని వారి ఆరోగ్యముం గూర్చి భయోత్పాతము లేర్పడుచుండెను. ఐనను మహా త్ముడు చలింప డయ్యెను. వాని యుత్సాహాము నెుక్కవో దయ్యెను. ప్రాణాపాయము వాటిలు నని దిగులుచెందుచు ననేకులు మహాత్ముని వ్రతము చాలించుడని ప్రార్థింపసాగిరి. కాని మహాత్ముడు వారికి మహోపదేశముల గావించుచుండెను.

స్పష్టముక యెట్టిదో గిట్టుట యు నట్టి సహజసంఘటనయే. సకల జీవులును మరణింపక తీరదు. మన కున్న ధర్మసాధనములలో మొదటిదగు తనువు ధన్యత గాంచునటుల ధర్మనిర్వాహణమున నది జీర్ణించిపోవుట సంతసప్రదము కావలయు ననుచు ప్రసంగించుచుండెను.

గాంధీజీ కృశించి పోవుచున్నా డనువార్త దశదిశలను ప్రపంచమున ప్రాకినది. సమస్తభూప్రజయు ఆతురపాటుతో నేమి జరుగునో యని ఢిల్లీవైపునకు చెవుల ద్రిప్పి నిరంతరాయముగ రేడియోవిచారణల చేయ మొదలిడిరి. స్వదేశ విదేశ వార్తాపత్రిక లన్నియు వానికే ప్రాధాన్యము నొసగి యాందోళన సాగించెను. ఢిల్లీలోని అన్ని పక్షముల నాయకులును తహతహపడుచుండిరి. ఉపవాసవిరమణమునుగూర్చి యొత్తిడి చేయుచుండిరి. సర్వపక్షశాంతిసంఘము నొకదానిని నెలకొలిపిరి. తమలో తాము వైరముల మాని సఖ్యతతో మెలంగగల మని వాగ్దానముల చేయసాగిరి. మహాత్ము డంతట సప్తాంగములతోగూడిన ప్రతిజ్ఞాపత్రము నొకదానిని వారి కిచ్చి తమకు సమ్మత మగునేని దానిపైని సంతకములు చేయుడని తెలిపెను. ఆ నాయకులు తమలో తాము సంప్రదించుకొని మహానందముతో దానిపైని సంతకములు చేసి తెచ్చి గాంధీజీకి సమర్పించిరి.

ఆప్రతిజ్ఞా పత్ర మిది:—

1. హిందువులు, ముసల్మానులు, శిఖ్ఖులు, తదితరసంఘముల వారును ఢిల్లీలో పూర్వరీతిని సోదరులవలె పూర్ణసఖ్యభావముతో జీవించుట మా హృదయపూర్వకవాంఛితార్థ మని

ప్రకటింపగోరుచున్నాము. మఱియు ముసల్మానుల ప్రాణములను, సొత్తును మతవిశ్వాసములను గాపాడుదు మనియు, ఢిల్లీలో నిటీవల జరిగియున్న సంఘటనల బోలునవి యిక మీాదట జరుగబో వనియు ప్రమాణము చేయుచున్నాము.

2. 'ఖ్వాజా కుటబ్ ఉడ్డీన్ మాజారు' తిరుణాళ్ళు యథా ప్రకారము ఈ యేడును జరుపబడు నని గాంధీజీకి హామీ యిచ్చుచున్నాము.

3. సబ్జీమండి, కరోల్బాగు, పహార్గంజ్ మున్నగు ప్రదేశములందు వెనుకటివలెనే ముసల్మానులు నిరపాయముగా తిరుగగల్గుదురు.

4. ముసల్మానులచే విడిచి వేయబడి హిందువులచేతను శిఖ్ఖులచేతను ఆక్రమించుకోబడిన మసీదులు ముసల్మానులకు మఱల స్వాధీనము చేయబడును. ముసల్మానులకొఱకై ప్రత్యేకింపబడియున్న ప్రదేశములు బలాత్కారముగా ఆక్రమించుకో బడవు.

5. ఢిల్లీనుండి ప్రవాసము పోయియున్న ముసల్మానులు ఇక్కడికి తిరిగివచ్చివేయ నిచ్చగింతురేని, ఏలాటి అభ్యంతరములు నుండవు. ముసల్మాను లిక్కడ తమతమ వ్యాపారములను యథాప్రకారము సాగించుకోగల్గుదురు.

6. ఈకార్యము లన్నియు పోలీసువారియొక్కగాని, మిలిటరీవారలయొక్కగాని ప్రమేయము లేకుండ మాస్వంత ప్రయత్నములద్వారా సాధింపబడు నని ధృవపఱచుచున్నాము.

7. మాపైని విశ్వాసముంచి నిరశనవ్రతమును విరమించి యథాప్రకారము నాయకత్వము వహించి మమ్ము నడుపుచుండు డని గాంధీమహాత్ముని వేడుకొనుచున్నాము.

ఈప్రమాణపత్రమును చూచుటతోడనే గాంధీజీ ముసల్మాను పక్షపాతి యైపోయి, వారికి సకలసదుపాయములను సమకూర్చుచు సర్వవిధముల హిందువులను అధోగతికి బడద్రోసి, శిఖ్ఖుల నణంచివేయు పన్నాగము పూనెనని అలసమతులకు తోచు టబ్బురము కాదు. ఐనను లోతునకు దిగి విచారణచేయు వారికి ఢిల్లీపరిస్థితులు చక్కబఱచుటకు తాత్కాలికముగ నదొక్కటే మార్గమని తెలియగలదు. ఢిల్లీపరిస్థితి చక్కబడు నెడల భారతదేశపరిస్థితులు వానియంతనవియే చక్కబడగలవు.

## 4. వ్రతవిరమణము

ఒకముసల్మానునాయకాగ్రణి నారింజరసమును సమర్పింపగా స్వీకరించి గాంధీమహాత్ముడు తన నిరశనవ్రతమును జనవరి పదునెనిమిదవ తేదీనాడు చాలించినాడు. అప్పటికి సరిగ మధ్యాహ్నము పండ్రెండుగంటల నలుబదియైదు నిముసము లైనది. ఢిల్లీప్రజల హృదయములనుండి కొండంత బరువు దిగిపోయినది. ఈసంతోషవార్త భారతదేశమునం దంతటనేగాక సకలదేశదేశాంతరములకును, మూలమూలలకును గొనిపోయి ఆకాశవాణి మారుమ్రోగించినది. భూమండల మన్నిదిశల నుండి అభినందనవర్షధార లవ్యాహతిగ వచ్చిపడినవి. భారతభూమి ధన్యత గాంచిన దైనది.

నిరశనవ్రత సమాప్తికి పూర్వము, సర్వజాతిమతసంఘ వర్గప్రాతినిధ్యము వహింపగల నాయకులు సంతకములు చేసి

యిచ్చిన ప్రమాణపత్రిమును జూడ గాంధీజీకన్నులు ఆనంద బాష్పపూరితము లైనవి. శరీరమెల్ల కరుణారసపూరిత మైనది. ఢిల్లీలోని హిందూముసల్మాను శిఖుపౌరులును, కాందిశీకులును సోదరప్రేమతో ఒండొరులను తమగృహముల కాహ్వానించి ఫలప్రిదానములతో సత్కరించుకొని రను వార్త వానిని తృప్తిపఱచినది. తనదాపున జేరియున్న నూర్గురునాయకులను వీక్షించి నెమ్మదిగ మహాత్ము డిటుల పలికెను:— నే నర్థించిన దానికంటె మీరు హెచ్చుగనే యొసగియున్నారు. ఐనను ఢిల్లీలోమాత్రమే సాంఘికశాంతిని కాపాడుటకు మీారు బాధ్యు లగుదురనియు, మఱియితరస్థలములం దేమి సంఘటిలినను మీా కేమియు బాధ్యత లేదనియు మీావచనముల కర్థ మగునని భావింతురా మీా రిప్పుడు పూనెద మనిన బాధ్యత కంతగా విలువ యుండదు. మఱియు నే నిప్పుడు నిరశనదీక్షను విడిచి వేయుట గొప్ప పొరబా టగునని నాయభిప్రాయము. ఏదో యొకనాడు హాత్తుగా మీారును నటులనే గ్రహింపగలరు. ఉదాహరణమ పత్రికలలో ప్రకటింపబడిన అలహాబాదు సంఘటనలవిషయము గాంచుడు. రాష్ట్రీయసేవాసంఘసభ్యులును హిందూమహాసభాసభ్యులును గూడ ఈప్రమాణపత్రముమీాద సంతకములు చేసినవారిలో కలరు. వారు చెప్పుమాటలు విశ్వస నీయము లగునెడల, ఢిల్లీవెలుపల జరుగు ఘోరఉరోన్మాద చేష్టలంగూర్చి నిర్లక్ష్యముగ నుండజాలరు. వా రటుల నుదాసీను లగుదురా, వారు దైవమునే మోసగించ నెంచినవా రగుదురు. ఈఢిల్లీనగరము ఇండియనుయూనియనుకు కేంద్రము. మీా రాఢిల్లీలో ప్రముఖులు. భారతభూమిలో నెచ్చట నుండినను హిందువులు, ముసల్మానులు, సిక్కులు నెల్లఱు సోదరులే యని

గ్రహించునటుల చేయజాలరేని (ఇండియనుయూనియను పాకీస్థానములను) మీ అధినివేశములు రెండును అనర్థములపాలే యగును. మీరు పరస్పరము కీచులాడుకొనుచుండునెడల హిందూస్థానమున కేమి మూడునో మెఱుంగుదురా ?

(గాంధిజీ యిటుల బలుకునప్పుడు ఆసంకల్పమే దుర్భరము కాగా గద్గదకంఠుడై మాటాడ లేకపోయెను. ఆయన నెమ్మదిగా పలికిన మాటలను సుశీలానాయరును, ప్యారీలాలును అందఱికి వినవచ్చునటుల అనువదించిరి.)

మీ హృదయముల నిష్కపటముగా పరిశోధించుకొనుడు. పిమ్మట పరితాపపడు పని చేయకుడు. గొప్ప ధైర్యసాహసముల జూపవలసియుందురు. మీ ప్రమాణపత్రముయొక్క అంతరార్థమును పునః స్మరింపుడు. ఢిల్లీలో నెలకొనిన శాంతి దేశమునందెల్లెడలను నెలకొనవలయును. ఈలక్ష్యము ఒక్కదినములో సాధింపజాలునది కాదు. ఇట్లనుటచేత, గతకాలమున సైతానువకభిముఖముగా నడచిరనియు, ఇప్పుడు మారి దైవమునకభిముఖముగా నడువనుండిరనియు అర్థము కాదు. నేను మీ యెదుట తెలిపినదానిని హృదయపూర్వకముగా మీరందఱు ఆమోదింపజాలనిచో లేక అంతపని చేయుట మీ కలవిగాని కార్యమని భావించుచో, మీరు విస్పష్టముగా నాకు చెప్పివేయుడు.

హిందూస్థానము హిందువులదిమాత్రమే యనియు, అందు ముసల్మానులకు తావు లేదనియు వాదించుటను మించిన దోష ముండబోదు. మఱియు పాకీస్థానము ముసల్మానులది మాత్రమేయనియు, అందుహిందువులకును, సిక్కులకునుస్థానము లేదనియు వాదించుటను మించిన దోషమును నుండబోదు.

ఇక కాందిశీకులకు నేను తెలుపున దిది:—

ఢిల్లీలోని పరిస్థితులను నేను తెలిపినతీరున సరిచేయునెడల, పాకిస్థానులోకూడ పరిస్థితులు బాగుపడుటకును అదియే సాధన మగును. తొందఱపడి నేను నిరశనదీక్షను మానుటలో నన్ను నేను మోసగించుకొంటిననిగాని, మీరు నన్ను మోసగించిరని గాని, నే నెప్పుడు గ్రహించినను మఱల ప్రాయోపవేశము పూనుటకు లేశమైనను వెనుదీయబోను. కాబట్టి మీరు పూర్ణ విచక్షణతో నిప్పుడే విచారించుకొనుడు. నూటికి నూరుపాళ్ళు నిష్కపటముగా వర్తించుడు.

## 5. ముసల్మానులకు సలహా

తదుపరి తనదాపున జేరియున్న ముసల్మాను ప్రతినిధుల నుద్దేశించి తాను నిరశనదీక్షను విడిచివేయుటకు దగినంతగా ఢిల్లీపరిస్థితులు చక్కబడె నని వారికి తృప్తిగలిగినదా యని గాంధీజీ ప్రత్యేకముగా విచారించినాడు. భారతదేశమును వారు తమ మాతృభూమిగా పాటింతు రనుటలో సంశయ ముండునా యని ప్రశ్నించినాడు. సంశయ ముండియు విధిలేక హిందువులతో కలిసి జీవించుచు, అవకాశము చిక్కినతోడనే విడిపో గోరుదురా యని యడిగెను. అటువంటి సంశయమున కవకాశము లేదనియే తా నాశించుచున్నా ననెను. అదేతీరున ముసల్మానులు యవను లనియు, అసురు లనియు, తత్కారణ మున దైవసాక్షాత్కారమున కనర్హు లనియు నమ్ము హిందు వెవండైన నున్నచో అతడు దైవద్రోహకు డగుననియు, ఆనాటి ప్రమాణపత్రముపైని సంతకము పెట్టుట కనర్హు డగుననియు నొక్కి వక్కాణించియున్నాడు.

మఱల గాంధిజీ యిట్లనిరి:—

పాహ్నానుండి యొక ముసల్మానుమిత్రుడు నా కొక పుస్తకమును ప్రేమపురస్సరముగా బంపియున్నాడు. ఆగ్రంథకర్త హిందువులు అనగా కాఫరులు విషపుపురుగులకన్న అధములనియు, కావున హతమార్పదగినవా రనియు ఖురాను తెలుపుచున్నదని వ్రాసినాడు. అటుల హిందువుల హతముచేయుటలో ఎటువంటి దౌర్జన్యమునైనను, మోసమునైనను చేసినయెడల పాపము లేకపోగా, అల్లాదృష్టిలో అదెంతయు పుణ్యకార్యమగునట! దైవభక్తిగల ముసల్మాను లెవరును నిట్టిది మత బోధ యని అంగీకరింప రనియు, అటువంటిభావమునెడ సానుభూతి చూపరనియు నాయభిప్రాయము. హిందువులు బొమ్మల పూజించువారని కొందఱు ఈసడింతురు. కాని వారు పూజించునది రాతిబొమ్మను కాదు. అంతర్యామున పఱగు దైవమునే! ఆ దైవములేని యొక్కనలుసైనను లేదు. ఏ భక్తుడైనను రాతిలో దైవమును దర్శింప జాలునెడల అది దూష్యమన నర్హముకాదు. ఒకవేళ వానివిశ్వాసము భ్రాంతిజనకమనినను, ఆతని భ్రాంతిఫలము నతడే యనుభవించునుగాని యితరులకు హానికరము కాదు. పరుల మతవిశ్వాసములను, మత సాధనలను తెలిసికొనుటకును, మెచ్చుకొనుటకును ఉదార భావనాశక్తియు, విశాలదృష్టియు అవసరము లగును. ముసల్మానుల ఖురానునుగాని, సిక్కుల గ్రంధసాహెబానుగాని దైవభావముతో జూచువిషయమునను ఈసూత్రమేఅనువర్తించును.

## 6. నాయకుల ప్రసంగములు

గాంధీజీ ప్రసంగానంతరము మౌలానా అబ్దుల్ కలాం ఆజాదుగారు "సాంఘిక శాంతిభద్రతల విషయములో ఢిల్లీ ప్రజాప్రతినిధులే పోషింపవలె నన్నారు. పాటియాలనుండి ముసల్మాను మిత్రుడు వ్రాసెనను వాక్యములు ఇస్లాముమతమున కవమానకరము లని నేను నొక్కివక్కాణింపగలను. సర్వమానవజాతియు, జాతిమతవర్గవివక్షత లేకుండ సోదరులగుదురని ఖురాను బోధించుచున్నది." అనుచు కొన్ని ఖురాను వాక్యముల పఠించి నిదర్శనములను జూపిరి. గాంధీజీకి పంపబడిన పుస్తకములోని వాక్యములు నేడు కొందఱు ప్రజలను పట్టి పీడించుచున్న మతోన్మాదదురావేశఫలమును మాత్రము రుజువుచేయు ననిరి.

మౌలానా హిఫ్జూరు రహమాన్‌సాహెబుగారు తన ముసల్మానుసోదరులు భారతభూమిని తమ మాతృదేశము కాదనుకొనుట గాని, పూర్ణమును, అవిచ్ఛిన్నమును నగు తమభక్తికి లక్ష్యముగ నెంచకుండుటగాని,గత్యంతరములేక తామందు నివసించుచున్నా మనుకొనుటగాని ఎంతయు గర్హ్యమనిరి. భారత జాతీయోద్యమములలో గడచిన ముప్పదియేండ్లనుండి తమవారు పాల్గొనుచు సలిపిన సేవయే ఆరీతి దురారోపణలను ఖండింపజాలు ననిరి. ఇటీవల ఢిల్లీలో నల్లరులు చెలరేగినప్పుడు, అందొకానొకసందర్భమున ముసల్మానులను ఢిల్లీవెలుపల నొక ప్రత్యేకస్థలమునకు జేర్చి భద్రముగ కాపాడుదు మని తన తోడికాంగ్రెసుమిత్రులును, దేశారాధకులును తెలిపిన సందర్భమున ముసల్మాను లాసదుపాయమును నిరాకరించి,

పోలీసువారి సాహాయ్యమునుసయితము అంగీకరింపక అల్లా మీాదనే భారమువైచి ఢిల్లీలోనే నిలిచిపోవుట వారి అభిప్రాయ మునకు నిదర్శనముగదా యనిరి.

ఇంకను కొందఱునాయకులు సందర్భోచితముగ గావించిన ప్రసంగములయందు గాంధీజీ నిరశనవ్రతారంభ మైనపిమ్మట ఢిల్లీలోను, హిందుస్థానుపాకీస్థానములందును పెక్కుచోట్ల గొప్ప మార్పు కలిగిన దనిరి. అన్నిమతముల ప్రతినిధులును వంద మందికిపైగా, గాంధీజీనిరశనవ్రతసమాప్తికి అదను వచ్చెనని నిర్ణయించిరి. మౌలానా సాహెబుగా రందిచ్చిన నారింజరస మునుగ్రోలి వ్రతసమాప్తి గావించిన మహాత్ముని ఎల్లఱు నభినందించిరి.

దీక్షావిరమణానంతరము గాంధీజీ యిటుల బలికిరి :—

ఇయ్యది నా కెంతయు నానందప్రదమగు సమయము. సిక్కుగురువగు గోవిందసింగుయొక్క జన్మదిన మిది. ఈదిన మున నాదీక్ష ఫలించుట సంతోషదాయకము. ఢిల్లీపౌరులేగాక పాకిస్థానునుండి వచ్చియున్న కాందిశీకులు; మంత్రులు మొద లగు ప్రభుత్వోద్యోగులు, నాయుపవాసపుదినములలో నాపైని వర్షించిన కరుణారసమును విస్మరింపజాలను. కలకత్తాయందు నిటులనే జరిగియున్నది. అందఱియెడ మైత్రి గలిగియుండి యెవరి మీాదను శత్రుభావము లేక జీవించుట ఉత్తమధర్మము. కొందఱు మంచివారును, కొందరు చెడ్డవారును అన్నిసంఘము లందు నుందురు. దోషులయెడసయితము మనలో స్నేహభావ మమరియుండవలెను. ముస్లిములు ప్రపంచమం దెల్లెడల కలరు. వా రందఱియెడ సుహృద్భావముతో మెలగదలచు పాకిస్థా

నపుముసల్మానులు హిందూస్థానపుముసల్మానులయెడను మైత్రీభావము నేల చూపరాదు? అటులకానిచో ప్రపంచమందలి ముసల్మానులందఱును పాకిస్థానపుముసల్మానులకు విరోధులేయగుదురుగదా! లోకములోని యెల్లజాతియెడ స్నేహభావము కలిగియుండగోరు భారతీయులు హిందూస్థానమునందలి ముసల్మానులతోడను స్నేహము నెఱపవలయునుగదా. అటులగానిచో హిందూస్థానపాకీస్థానములు రెండును చెడును. విదేశపరిపాలనము తిరిగి వచ్చిపడగలదు. తామందఱు సోదరులవలె బ్రతుకుదుమనియు, తమలో తాము పోరాటములకు దిగమనియు, ఢిల్లీలోని అన్నిమతములవారును, పాకీస్థానపు కాందిశీకులును నాకభయ మిచ్చియుంటిరి. చాల మంచిసంగతి.

అందఱు సహకరించనియెడల నేను నిరశనవ్రతమును చాలించుట వ్యర్థమగును. ఢిల్లీలో సంభవమైన యీసాంఘికమైత్రి భారతదేశమం దెల్లెడలను సంభవమే కాగలదు, అంతట ప్రపంచశాంతి యేర్పడును. సైతానుకు ఉద్వాసన చెప్పి దైవము నాహ్వానించి హృదయపీఠమున ప్రతిష్ఠించుడు. హిందువులు సిక్కులు ఖురానును, ముసల్మానులు గీతను గ్రంథసాహెబును చదువుట మంచిది. ఆచదివినదానిని అర్థముచేసికోవలయును. సర్వమతములయెడను సమానాదరణను చూపవలయును.

నేను విగ్రహపూజకుడను కాను. కాని అట్టివారియెడ నాకు అసహనభావము లేదు. సర్వత్ర వెలయు దేవుని కొందఱు విగ్రిహమున దర్శింతురు. అది తప్పగుచో గీతలోను, ఖురానులోను, గ్రంథసాహెబులోను నున్నాడనుకొనుటయు తప్పే. అదియు విగ్రహారాధనమేగదా! సహనమును ఆదరణ

భావమును అలవఱచుకొనునెడల సమస్త ప్రజలనుండియు మనము జ్ఞానము నార్జింపగల్గుదుము. అప్పుడు మీ రందఱు సాంఘికభేదములను విస్మరించి శాంతితోడను, మైత్రితోడను కలిసిమెలిసి జీవింపగల్గుదురు. అప్పుడు పర్విడిపోవుచున్న రైళ్లలో నుండి స్త్రీపురుషులు బైటికి త్రోసివేయబడునంతటి లజ్జాకరదుష్కార్యములు సంఘటిలజాలవు.

నేను సత్యము పేరిట నిరశనవ్రతమును పూనితిని. సత్యము యొక్క పర్యాయనామమే భగవంతుడు. ఈవే రందఱకును పరిచయమైనదియే. సజీవమగు సత్యము కొఱవడినచోట దేవుడు లేడు. కటా! దేవుని పేరిటనే మనము దబ్బఱలాడుచుంటిమి. దోషులా? నిర్దోషులా? యను విచక్షణ లేకుండ పురుషులను, స్త్రీలను, బిడ్డలను, పసికూనలను సయితము హత్యచేయపాల్పడు చుంటిమి. స్త్రీల నపహరించుచుంటిమి! బలాత్కారముగ మతాంతరుల గావింపుచుంటిమి. లవలేశము సిగ్గుమాట లేకుండ నిట్టిపనుల చేయుచుంటిమి. యథార్థముగా నెవరేనియిట్టిపనులను సత్యముపేరిట చేయగల్గుట నేనెఱుగను. సత్యము నాపెదవులపై తాండవించుచుండ నిరశనదీక్షను ముగించితిని. సోదరప్రజల వ్యాకులము నాకు భరింపరాని దైనది. రాష్ట్రపతి రాజేంద్ర బాబు హిందువులకును, శిక్కులకును, ముసల్మానులకును ప్రతినిధులగువారిని, పంజాబుసరిహద్దుసింధురాష్ట్రములనుండి వచ్చిన కాందిశీకుల ప్రతినిధులను నూరుమందిని తోడ్కొనివచ్చినాడు. ఈసమిష్టి ప్రతినిధిసమావేశములో జాహీద్‌హుస్సేనుసాహెబు, పాకిస్థాను హైకమిషనరు, ఢిల్లీచీఫ్‌కమిషనరు, డెప్యూటీకమిషనరు, ఆజాద్‌హింద్‌ఫౌజును ప్రాతినిధ్యమువహించు షానవాజ్ఖాను చేరియున్నారు. అట శిలాప్రతిమనుబోలి నెహ్రూపండితుడు

ఆసీనుడై యున్నాడు. మౌలానాపాహెబును నీట నున్నాడు. ఈ ప్రతినిధు లందఱిచేతను సంతకములు చేయబడి తమ నింకను వ్యథపెట్టక నానిరశనదీక్షను చాలించు మని అర్థించు ప్రమాణపత్రమును రాజేంద్రబాబు చదివి వినిపించినాడు. పాకి స్థానునుండియు, అటులనే చేయుమని యితరస్థలములనుండియు తంతివార్తలమీద తంతివార్తలుగా వచ్చిపడుచున్నవి. ఇంత మంది సుహృదుల సలహాను కాదనజాలనుగదా! ఏమి రాను న్నను సరియే, హిందువులు, ముసల్మానులు, శిక్కులు, క్రైస్త వులు, పారశీలు, యూదులు మున్నగువారిమధ్య మైత్రి నిలుపు కొందు మనియు, ఎన్నడును భగ్నము కానీయ మనియు మీరు చేయుప్రమాణమును నేను త్రోసిపుచ్చజాలను.

పిచ్చిగా నటనలను సాగించు నిక్కాలమున, ఈలాంటి ఫలి తార్థమును ఇంతస్వల్పకాలమున సాధింపగల మనెడు పేరాశతో నిటువంటి యుపవాసవ్రతముల నెవరును పూనదగ దని నా మందలింపు. ఎవరేని అటుల చేయుదురా, హతాశు లయ్యెదరు. ప్రాచీనమును, అప్రతిహతమును నగు నొక పవిత్రో ద్యమమునకు అపచారము కూర్చినవా రగుదురు. దుస్సాధ్య ములగు అర్హతలు రెండు యిందు కవసరములై యున్నవి: భగవంతునియెడ సజీవమగు విశ్వాసము, మఱియు వానినుండి వచ్చు ఆదేశము. మూడవదానికి నొండు వీని చేర్చుటకు కుతూహలపడుచున్నాను. ఈ మూడవది అంత అవసరము కాకపోవచ్చును. పూనిన నిరశనదీక్ష ధర్మసమ్మతమును, సమ యోచితమును, న్యాయమగు నొకయుద్యమముకొఱకై ప్రేరే పింపబడినదియు నైనప్పుడే, అయ్యది అంతర్యామినుండి వచ్చు భగవదాదేశముగా దానిని నిరూపించవలయును. కావున,

అందుకొఱకు చిరకాలము ఆయత్తపడుచుండుటయు అగత్య మని తెలుసు. ఎవరుగాని అలసభావముతో అటువంటి దీక్షకు పూనకుందురుగాక.

## 7. దైవాసురశక్తులు

ఇటుల శుభాకాంక్షలతో ముగింపునకు వచ్చిన గాంధీజీ నిరశనవ్రతము అనేకసత్ఫలముల నొసగినది. సత్యాహింసల మహిమను లోకమునకు చాటినది. దైవశక్తిప్రతాపమును పలువురు గుర్తింపగల్గిరి. సర్వమును పురుషుని యధీనమునందే యున్నదని వాదించువారు పురుషప్రయత్నమునకు దైవము తోడు కావలయునని గ్రహించిరి. గాంధీజీ యెన్నెన్ని ఘన కార్యముల సాధించినను నవెల్ల తనలో నుండిన యొకానొక మహాశక్తిమహిమ సాధించినవేగాని యల్పుడగు తాను సాధించినవి కావని నిరంతరము పలుకుచుండెను. తనపనియెల్ల ఆశక్తిచేతిలో నుపకరణముగ నుండుటే యని తెలుపుచుండెను. ప్రార్థనాపూర్వకముగ తా నాశక్తిచర్యల కనుకూలమగు పని ముట్టుగా నుండుటే తన వాంఛితార్థ మని వాకొనుచుండెను. కావున నిర్మలహృదయులకు,భక్తితత్పరులకు జయాపజయములు రెండును సమముగ జయములేయై గోచరించును. రెంటి యందును అఖిలకర్మదేవతయొక్క లీలయే గాన్పించును. ఇది దైవభక్తుని దృష్టి. నిరంతరశాంతిప్రదము. విశ్వలీలయందు మఱొకశక్తియు పనిచేయుచుండును. దైవశక్తికి అసురశక్తి యెదురై నిలిచి లీల సలుపుచుండును. ద్వంద్వరహితమగు చర్యయే లోకమున లేదు. ధర్మాధర్మములు రెండును ఒకే నాణెముయొక్క యిరుప్రక్కల దర్శనములే. ఎవ రేదర్శనము

నభిమానింతురో వారి కయ్యదియే గోచరించును. "కష్టము, మృత్యువు ఏకవస్తువునకు ఒకవైపును, సుఖము, జీవనము మఱొకవైపునను వెలయుచుండును. ఒకటి పుల్లా, రెండవది సీదా. నాకు రెండవదియే హితవు. దానియందు నాకానందము గోచరించును.'' అనెడువాడు గాంధీజీ.

డిల్లీలో జరుగు సంఘటనలకు వ్యతిరేకముగ దోచు సంఘటనలకు దగిన సన్నాహములు పూనా, బొంబాయి మొదలగు ప్రాంతములందు జరుగుచుండెను. దీర్ఘకాలమునుండి పెచ్చు పెరుగుచువచ్చిన మతవిద్వేషములు పరిణతిగాంచినవి. కొందఱు ద్వేషోన్మాదావేశములకు లోనైరి. మతముపేరిట సాంఘికవైరములు పెనువృక్షములై పెరిగియున్నవి. వానిజాడలే గాంధీజీకి తీవ్రావేదనకు గారణము లైనవి. దైవముంగూర్చి యామహాత్ముడు మొఱలిడుటకును, నాయకులంగూర్చి హెచ్చరికలు చేయుటకును హేతువు లైనవి. గాంధీజీకి ఒకయువకుడు వ్రాసిన లేఖుం జూడుడు. అట్టి వనేకము గాంధీజీకి చేరియున్నవికూడను. అందలి ముఖ్యాంశము లివి:—

1. మీ రైదారుదినాలు తిండిమానినంతమాత్రాన హిందూ ముసల్మానులమధ్య హృదయపూర్వకమగు సఖ్యత యేర్పడగలదని ఆశించుట వెఱ్ఱితనము. ఒకరీతి బూటకపు ప్రదర్శనములు సాగవచ్చును. పెద్దపెద్ద బహిరంగసభలు, ఉత్సవములు, ఊరేగింపులు జరుగవచ్చును. వీనిం గాంచి మీరు భ్రమపడరాదు. కలకత్తాలో జరిగిన దింతమాత్రమే.

2. మీ తపఃఫలితముగా ప్రజానీకముయొక్క హృదయములో మీ కొక నిరుపమానమగు స్థానము లభించినది నిజమే.

కాని, ఆత్మ నాశరహితమై పఱగు నను విశ్వాసము వారికి కుదురలేదు. మీ ప్రాణముల నిప్పుడు కాపాడవలయునను ఆతుర పాటుతో తమ కోపోద్రేకములను కానరాకుండ అణచిపట్టు కొనుచున్నారు. ఎప్పుడో అవి బ్రద్దలగును.

3. వారి కోపోద్రేకములు నిజముగా సమసిపోవలయు ననిన వారిదృష్టిని దొరతనమువారు నిర్మాణకార్యక్రమముపైన హత్తు కొనునటుల చేయవలయును. జీవితావసరాల నన్నిటిని అన్న వస్త్రాలలోనే యిముడ్చు టెలనో ప్రజల కర్థ మగుటలేదు.

4. మీకడకు వచ్చి విలపించు ముసల్మానులను కరుణా దృష్టిలో నాదరింపుచున్నను, హిందూస్థానుపాకిస్థానములమధ్య యుద్ధమే వచ్చునెడల వారు విద్రోహులుగా మారువారే!

5. భారతముసల్మానులు తమపక్షమునకు తిరుగుదు రనెడు ఆశయే పాకిస్థానువారల చిఱ్ఱుబుఱ్ఱుతనానికి మూలము. స్వార్థ పరులగు ప్రభుత్వోద్యోగులు వారికి తోడ్పడుదురు. ఇట్లుండ హిందువుల యుద్రేకముల నణంచుటే మీ ప్రధానోద్దేశముగా గాన్పించు చున్నది.

6. హిందూముసల్మానుల తగవులు తీరుటకు రెండే మార్గ ములు కలవు. ఒకటి, హిందువులు పూర్తిగా పవిత్రహృదయులు కావలయును. కాని ఆ ఆశలు వమ్మై పోయినట్లే. కాంగ్రెసు పోరాటము దుర్బలుల నిరాయుధనిరోధమని మీ రెఱుగుదురు. అదను దొరకినప్పుడు వారు హింసాచర్యలకు పూనక మానరు. రెండు, కేంద్రప్రభుత్వమును నిర్వీర్యము చేయుటకు మీరు కారకులు.

గాంధీజీజవాబు చూతము :

1. నానిరశనదీక్షాఫలితములు స్థిరతరములుగాక తాత్కాలికములే యగుగాక. సాంఘికఐకమత్యము నాకు నూతనాదర్శము కాదు.

2. ఢిల్లీసఖ్యతాప్రయత్నములు నా ప్రాణరక్షణకుగాక, స్వాతంత్ర్యరక్షణోపాయముగా స్థిరపడుగాక.

3. నిర్మాణకార్యక్రమము ఐకమత్యమునకును, స్వాతంత్ర్యరక్షణకును నాధార మనెడు ప్రచారము సాగవలయు ననుట నిజమే.

4. పాకీస్థానుస్థాపనతో భారతసమ్మేళనములోని ముసల్మానులకు చిక్కేర్పడినది. వారికి న్యాయము గలిగించి పోషించుట వారివిశ్వాసమును చూఱగొనవలసిన అధికసంఖ్యాకులయొక్క ముఖ్యధర్మము.

5. ఎల్లఱును పవిత్రహృదయు లగుటే నా నిరంతరాశయము. అందఱు నిష్కపట వర్తనులే కాగోరెదను.

6. అహింసాప్రభావము రుజు వగుటకు ఇదియే అదను. విశ్వవ్యాప్తమై పఱగు సైనికసిద్ధాంతమనెడు సుడిగుండములో ప్రజలు పడిపోవుచున్నారు. సబలులే అహింసాయుధమును తాల్పనర్హులు. వారలే ప్రథమసైనికవర్గముగా గణనగాంతురు. అనుభవమే రుజువు చేయగలదు. ధైర్యస్థైర్యములతో స్వరాజ్యప్రభుత్వము వర్తింపవలసియుండును. నావలన వారెన్నడును నిర్వీర్యులు చేయబడరు.

ఈరీతిగా నెన్నెన్ని యాక్షేపణలకో గాంధీజీ సమాధానముల నొసగుచునేయున్నాడు. ప్రార్థనానంతరబోధనలందు పెక్కండ్రిసందేహములు తీర్చుటకును, వారివారియుద్రేకముల జల్లార్చుటకును, త్యాగసహనభావముల బూను కర్తవ్యమును దెలుపుటకును నెంతగనో ప్రయత్నించియున్నాడు. ఐనను చిరకాలముహృదయమున జీర్ణించియున్నవిద్వేషభావములనుండి కొందఱు విడివడజాలరైరి. తమ మతోన్మాదమును నడంచుకో జాలరైరి. గాంధీజీ హిందూపక్షపాతియని క్రోధించు ముసల్మానులును, ముసల్మానుపక్షపాతియని ధుమధుమలాడు హిందువులును తీవ్రవాదముల సాగించు కొందఱు పరివర్తనము చెందనోడిరి. హిందూముసల్మానుసఖ్యతకొఱకై మహాత్ముడు చేయు ప్రయత్నములు ఫలించునేమో యనియు, తమ తమ పౌరుషములు వ్యర్థములు కాగా అవమానములపా లగుదుమనియు దురపిల్లసాగిరి. మహాత్ముని నేవిధముగను నిర్జించుటకుగాని, నిగ్రహించుటకుగాని వారికి త్రోవ దొరకదయ్యెను. వాని నెట్లైనను హతము గావించుటకన్న గత్యంతరము తోచదయ్యెను.

నథూరామ్‌వినాయక్ అనుసతడును, మఱికొందఱు మిత్రులును పూనానగరమున కూడి మహాత్ముని హత్యగావించుటకే నిర్ణయించిరి. ప్రార్థనలు చేసికొనుచుండుసమయమున నిరాఘాటముగ గాంధీజీని సమీపించుట సులభముకావున, అట్టియెడనన చేతిబాంబును ప్రయోగింప నిశ్చయించుకొనిరి. అందుకై పంజాబునకు బోయి మదన్లాలుగుప్త యను నొక కాందిశీకుని గొనివచ్చిరి. అతనికి లంచము లిచ్చి, బాంబును గాంధీపైకి విసరుట కొప్పించి ఢిల్లీకి దోడ్కొనిపోయిరి. 1948 సంవత్సరము జనవరి 20 తేదీసాయంతనము ప్రార్థనసమావేశస్థలమునకు

దాపున గోడవెనుక గుప్తముగ దాగియుండి ఆగుప్త బాంబును విసరినాడు. అది మహాత్మునికి 15 గజముల దూరమున పడి ప్రేలినది. గొప్పశబ్దము వినవచ్చినది. చుట్టును పొగ క్రమ్మినది. కాని యెవరికిని అపాయము సంభవించలేదు. ఒక గోడ మాత్రము పగులువారినది. గాంధీమహాత్ము డాధ్వని సైనిక శిక్షణమునొందుచున్న భటు డెవడో బాంబులు విసరుట నేర్చుకొనుచుండ వినవచ్చినదని భావించి నిశ్చలుడై యుండెను. సభలో కొంత యలజడి కలిగినది. అయినను త్వరలోనే మఱల శాంతి యమరినది. ప్రార్థనలు సాగిపోయినవి. బాంబువిసరిన వానితోగూడి మఱియిద్ద రొక జీపుకారులో వచ్చియున్నారు. వారు వెంటనే పారిపోయిరి. మదన్‌లాలుగుప్తమాత్రము పట్టువడినాడు.

మరునా డీయుదంతమునుగుఱించి మహాత్ము డిటుల నుడివియున్నాడు :

“నేను దుర్మార్గుడ ననియును, హిందూమతవిధ్వంసకుడ ననియును, తాను హిందూమత సంరక్షకు డనియు భావించి, హిందూమతసంరక్షణార్థము నన్ను చంపివేయుటకు ప్రయత్నించి నటుల అతడు పోలీసువారితో చెప్పెనట. నా కాతనిపైన నీష న్మాత్రము క్రోధము పుట్టుటలేదు. ప్రజలును వానిపై జాలిజూపుదురుగాక. నాప్రాణములు భగవంతునిచేతిలో నున్నవి. కావున నా కేలాటి భయమును లేదు. ......ఈతనికి తోడుగ మఱి కొంద ఱున్నారనియు, వారి చేతులలో నీత డొకయుపకరణ మాత్ర మనియు తెలియవచ్చినది. ......హిందూమతసంరక్షణ కిది మార్గము కాదని నేను వారికి చెప్పగోరుచున్నాను.

ప్రజలకు నే నేమి చేయుడని బోధించుచున్నాడనో అటుల చేయుటే మతమును రక్షింపజాలును........నా యోగక్షేమ మును విచారించుచు చాలమంది తంతుల బంపుచున్నారు. మఱియు నితరవిధాలను విచారించుచున్నారు. బాంబుప్రేలు డునకును నేను చలింపలేదని నన్ను ప్రశంసించుచున్నారు. అసలు నే నది సైనికశిక్షణకు సంబంధించిన పని యనియు, అందునుగుఱించి మన మంతగా యోచింపవలసిన దేమియు లేదనియు అనుకొంటిని. ప్రార్థనలు పూర్తియగువరకు అది బాంబుప్రేలుడనిగాని, ఆబాంబు నాపై ప్రయోగింపబడినదని గాని నాకు తెలియనే తెలియదు. నాకై యుద్దేశింపబడిన బాంబని యెఱిగి అది నాముందు ప్రేలినచో నే నెటుల ప్రవర్తింతునో భగవంతునకే యెఱుక. ఇప్పుడు నే నెవరి ప్రశంసలకును అర్హుడను కాను. బాంబుచే హతుడనై దాని ప్రయోగించినవానిపైని ఏలాటి ద్వేషము లేక మందస్మితవదన ముతో మరణింతునేని అప్పుడు నే నీప్రశంసలకు పాత్రుడ నగుదును.''

ఈబాంబును విసరిన మదన్లాలునిద్వారా జరుపబడు విచార ణలవలన, గాంధీజీనేగాక నెహ్రూ మొదలగు ముఖ్యనాయకులను గూడ సంహారము చేయుటకై కుట్ర జరుగుచుండినటుల పోలీసు వారికి తెలియవచ్చినది. కాని వారిపరిశోధనలు పూర్తికాక మునుపే కుట్రదారు లందఱు చిక్కకపూర్వమే, వారిలో దిట్ట యగువాడు నథూరామ్‌వినాయక్‌గాడ్సే యనువాడు మఱల జనవరి 30 వ తేదీనాడు ఢిల్లీకి వచ్చి, రివాల్వరు కాల్పులతో మహాత్ముని ప్రాణముల హరించివేసినాడు.

## 8. ఘోరహత్య

గాంధీజీ ఆదినమున సాయంతనము ఐదుగంటల ఐదునిమిషాలకు బిర్లాభవనమునుండి తన యిర్వురు మనుమరాండ్రభుజములపై చేతులూని ప్రార్థనాస్థలికి పయనమై పోవుచుండిరి. వేదికను సమీపించుతరిని అచ్చటిప్రజలు అటునిటు తొలగి మహాత్మునికి దారిచేయుచుండగా, ఆజనులలోనుండి హంతకుడు ముందునకు వచ్చి వాని కెదురుగ నడువసాగెను. అతడు గాంధీజీ పాదములు తాకి నమస్కరింపబోవుచున్నాడని కొందఱు తలచిరి. గాంధీజీకి ఊతగానుండి వానిని నడిపించుచుండిన మనుమరాండ్రు ఆహంతకుని వారింప యత్నించిరి. హఠాత్తుగా నతడు జేబులోనుండి రివాల్వరును దీసి ప్రేల్చినాడు.

మొదటిగుండు మహాత్ముని కడుపులో జొరబడినది. మఱి రెండు గుండెలో తగిలినవి. మహాత్ముడు హేరామ ! హేరామ ! యనుచు నొరగినాడు. దిగ్భ్రాంతిచెందిన మనుమరాండ్రు విలపించుచునే, వానిని ఆపిపట్టుకొజూచుచుండిరి. మహాత్ముని పవిత్రగాత్రము భూదేవిపై బడినది.

ఈసంఘటనకు దాపుననుండి కండ్లారజూచిన అసోసియేటెడ్ప్రెస్ ప్రతినిధి ఇట్లు తెలుపుచున్నాడు:

గాంధీమహాత్ముడు సాయంకాలప్రార్థన సమావేశమునకు విచ్చేయుటకు పూర్వమే సుమా రైదువందలమంది అచ్చట సమావేశమై, ఆయనకొఱకు ఎదురుచూచుచుండిరి. ఆయన బిర్లాభవనమునుండి బయలుదేరి రావలసినవేళకు ఐదు నిమిషాలు ఆలస్యముగా బయలుదేరిరి. ఆయన తన మనుమ

రాండ్రగు ఆవాగాంధి, మనూగాంధి భుజములమీద చేతులా నించి ప్రార్థనాస్థలమున వేదికకడకు నడచివచ్చుచుండెను. ఆయనకు త్రోవయిచ్చుటకై ప్రజలు రెండుపాయలై తొలగు చుండిరి. మహాత్ముడింకను వేదికకు పదిహేనుగజముల దూర మునయుండిరి. నేను నిలువబడియున్న చోటునకు రెండుగజముల దూరములో రివాల్వరుప్రేలుడు వినవచ్చినది. రివాల్వరుకాల్చిన వానిని స్పష్టముగా చూడగలిగితిని. అతని చేతిలోని రివాల్వ రునుకూడ చూచితిని. సరిగా గాంధీజీకి ఎదురుగా గురిపెట్టి కాల్చినాడు. వెంటవెంటనే నాలుగుప్రేలుడుశబ్దములు వినవచ్చి నవి. మహాత్ముడు వెనుకకు పడిపోవుటను చూచితిని. వారి కడుపులో గుండుదెబ్బ తగిలినట్టుగా కాన్పించినది. వారి శరీ రమునుండి రక్తము ప్రవహించి కట్టుకొనిన ధోవతి ఆరక్త ముతో తడిసి పోవుటను గాంచి నిర్ఘాంతపోతిని. జనసమూహ ములో సంక్షోభము బయలుదేరినది. ఒక్క నిమిషముసేపు వఱకు నేను దిగ్భ్రాంతిలోనే పడియుంటిని.

హంతకుని వెనుక నిలువబడియున్నవారు అతని ముంజేతు లను బట్టుకొని కదలకుండ నిలిపివేసిరి. అతనిచేతిలోని రివా ల్వరు క్రిందపడిపోయినది. అతడు మిలిటరీదుస్తులవంటి కాకీగుడ్డ లను ధరించియున్నాడు. ప్రార్థనాస్థలముకడ పహరాయున్న పోలీసువారు హంతకుని స్వాధీనము చేసికొనిరి. మహాత్ముడు పడిపోయినచోటునకు నేను పరుగెత్తిపోతిని. వారి శరీరము నుండి సంతతధారగా నెత్తురు కారుచుండెను. ఆయన కండ్లు మూసికొని తలవంచుకొని, భగవంతుని ప్రార్థించుచున్నటుల రెండు చేతులను జోడించియుండెను. ఇంతలో నలుగురైదు గురు మనుష్యులు గాంధీజీని బిర్లాభవనములోనికి దీసికొని

పోయిరి. ఆయనను పరుండబెట్టిన గది బయటితలుపులు మూసి వేయబడెను. ప్రేక్షకుల నెవరిని లోనికి పోనీయలేదు. బిర్లా భవనము ఎదుట అత్యాతురముతో నిలువబడియున్నవారిలో నేనును నిలుచుండియుంటిని. సాయంతనము 5 గంటల 35 నిమిషాలకు దివాను చమన్లాలుగారు వెలుపలికివచ్చిరి. "గాంధీజీ కెటు లున్నది "అని ప్రశ్నించితిని." ఆయన యింకను సజీవుడై యున్నాడు" అన్నారు చమన్లాలుగారు. మఱొక అయిదునిమిషాలకు విచారగ్రస్తుడై పాలిపోయిన ముఖముతో నొకవ్యక్తి బయటికివచ్చి 'బాపూజీ దివంగతు డైనాడు' అని చెప్పినాడు.

## 9. అంత్యస్మరణ

మహాత్ముని శరీరములోనికి రివాల్వరుగుండు జొఱబడిన తోడనే 'హేరామ, హేరామ' అని స్మరించుచు నేలకొరగిరి. అట్టి స్మరణ స్థితప్రజ్ఞులకు మాత్రమే ప్రాణావసానకాలమున సాధ్యము కాగలదని శాస్త్రము.

అంత్యకాలే చ మా మేవ స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః॥
(గీత)

తా. అంత్యకాలమునందు నన్నే స్మరింపుచు దేహాము నెవడు విడుచుచున్నాడో వాడు నాస్వరూపమును పొందు చున్నాడు.

యం యం వాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరమ్
తం త మేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ॥ (గీత)

తా. అర్జునా! మనుష్యుడు నిత్యము ఏయేస్వరూపముల ధ్యానించుచుండునో ఆయాస్వరూపములనే స్మరింపుచు మరణ కాలమున దేహమును విడుచును. ఈకారణముచేత నతడా యాస్వరూపములనే పొందును.

తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ
మ య్యర్పితమనోబుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః॥ (గీత)

తా. కాబట్టి అన్నికాలములయందును నన్ను స్మరింపుము. యుద్ధము చేయుము. నీవు నీమనస్సును, బుద్ధిని నాయందే నిలుపుదువేని తప్పక నన్ను పొందుదువు.

నిరంతరగీతాపఠనోత్సుకు డగు మహాత్ముడు గీతాబోధానువర్తనుడై తనయిష్టదైవమగు నాత్మారాముని స్మరింపుచు దేహత్యాగము చేసియున్నాడు. కావున ఆరామునే పొందియుండుట నిస్సంశయము.

## 10. జ్యోతి ఆరిపోయినది — లేదు!

మహాత్ముని మరణవార్తను లోకమునకు దెలుపుచు భారత ప్రధాని పండితనెహ్రూ యిట్లనెను:

మన జీవనజ్యోతి ఆరిపోయినది. నలుదెసల గాఢాంధకారమలముకొనినది. మనప్రియనాయకుడు, అత్యంతప్రేమతో 'బాపూజీ' అని మనము పిలుచుకొనుచుండిన మహనీయుడు, భారతజాతిజనకుడు—మన కిక లేడు.

కటా ! పొరబాటు. నే ని ట్లనరాదు. కాని యిన్నిసంవత్సరములుగా మురిపెముతో మనము చూచుకొనుచుండినతీరున తిరిగి మన మిక వానిని చూడలేము. సలహా లిమ్మనుచు సదుపదేశము లొసగు మనుచు వానికడ కిక పర్వులువెట్టలేము. మనశ్శాంతిని ప్రసాదింపు మనుచు వాని సన్నిధిని చేరలేము. ఇదొక అశనిపాతము. నా కొక్కనికే కాదు. కోట్లకొలది మన దేశీయుల కందఱకును.

దివ్యజ్యోతి ఆరిపోయిన దంటిని. అది పొరబాటే. ఆజ్యోతి— మనదేశమునుండి ప్రకాశించిన ఆతేజస్సు సామాన్యమైన వెలుగుకాదు. ఇన్నిసంవత్సరములుగా భారతదేశముమీద అసమానశాంతకాంతులతో ప్రకాశించిన ఆదివ్యజ్యోతి ఇకమీదటగూడ పెక్కేండ్లవఱకు అలా వెలుంగుచునే యుండగలదు. వేయిసంవత్సరాలపిమ్మటను ఆదివ్యజ్యోతియొక్క ప్రకాశమును ప్రపంచమం దెల్లెడల నుండు ప్రజలు వీక్షింపగలరు. వేలకొలది హృదయాల కది శాంతి చేకూర్చుచునేయుండును. కేవలము వర్తమానకాలమునకు చెందినదే కా దాదివ్యజ్యోతి. అది శాశ్వతమై నిలిచి సత్యస్వరూపమును మనకు దెలుపుచు, మనలను తప్పుదారులనుండి మరల్చుచు సవ్యమార్గమున నడిపింపగలదు. మనప్రాచీనజాతికి స్వాతంత్ర్యమును చేకూర్చిపెట్టినది.

మనమందఱ మింకనైనను కలిసి కట్టుగా నుండవలయును. ప్రస్తుతపు మహావిపత్సమయమున మనలోని కక్షలను, మన మనుభవించుచున్న కష్టములను, మన తగాదాలను, మన కుతంత్రాలను సమయింపజేసికొందముగాక ! ఇప్పట్టున గాంధీజీని

గూర్చియు, ఆయనదివ్యస్మృతినిగూర్చియు మనము చేయగల ఉత్తమప్రార్థన ఒక్కటే! ఏపరమలక్ష్యమును సాధించుకొనుటకై ఆమహానుభావుడు తనజీవితము నంతటిని ధారవోసి కృషిసలిపెనో, తుదకు తనప్రాణమునుసయితము బలిగా నర్పించెనో, ఏపరమగమ్యమును సాధించుకొనుటకై ఆయన తనతుదిశ్వాసము విడుచువఱకు నిర్విరామముగా పాటుపడెనో ఆసత్యాహింసలకు మనము మనసర్వస్వమును అర్పణముచేసికొని సమర్థుల మగుదుముగాక. అటుల ప్రమాణము గైకొనుటే ఉత్తమప్రార్థన యగును. అయ్యదియే మనకర్తవ్యము.

ఇండియాపార్లమెంటులో నెహ్రూ మఱల నిట్లు పలికెను:— బాపూజీహత్య యెవడో యొకయున్మాదుని చిలిపిపని కాదు. అనేకమాసములుగా, అనేకసంవత్సరములుగా మనదేశమున రగులుకొనుచుండిన ద్వేషాగ్నికిని, కల్లోలమునకును విషాదపరిణామమే మనబాపూజీ హత్య. మఱియు కొన్నినెలలుగా ఆవిషపూరితవాతావరణము హెచ్చుపెరిగిపోయినది. బాపూజీ మనకు విధించిన కర్తవ్యమును సక్రమముగా నిర్వహింపవలయు ననిన మన మావాతావరణమును నెదిరింప వలయును. దానితో పెనుగులాడవలయును. ఆవిద్వేషానికి, కల్లోలానికి మూలాధారములను వెదకి పెకలించివేయవలయును. మనకు సంబంధించినంతవఱకు భారతప్రభుత్వము సర్వశక్తులను సమీకరణ మొనరించి కృషిచేయగలదు. మాచేతగానితనమువలనగాని, మనసా వాచా కర్మణా లవలేశమేని యెయ్యెడ చూపట్టినను, అట్టి విద్వేషమును, కల్లోలమును నణంచివేయుటకై తక్షణము చర్య దీసికొనలేక యీకృషిలో కృతకృత్యులముగాక యోడిననాడు మే మధికారములో నుండదగము. ఆమహాత్ముని అనుయా

యులమని చెప్పుకొనుటకు మా కర్హతయుండదు. మఱియు ఆమహాపురుషుడు మావాడని నోరెత్తి పలుకుటకైనను తగిన యోగ్యత మాకు నిలువదు. కాని, రాబోవుతరములవారు బహుశః కొన్నిశతాబ్దములు దాటినపిమ్మట, మే మెంతటి అల్పులమైనను, ఈప్రవక్త నడిచిచూపిన బాటను నడిచిన వారముగదా యని మనలను కీర్తింతురు. అందువలన మన మాయన యాదేశముల ననుసరించి వ్యవహరించి, ఆయనసమ కాలికులమై జన్మించుటకు పాత్రులమే యని నిరూపించుకొన యత్నింతుముగాక!

## 11. సర్దారుని హెచ్చరిక

"... మహాత్మాజీ ప్రార్థనకు పోవుసమయాన నేను బిర్లా భవనమునుండి వెడలితిని. ఇల్లుచేరునప్పటికే యీఘోరవార్త వినవైనది. పర్విడివచ్చి ఆయన భౌతికదేహమును దర్శించితిని. ఆయన శాంతమూర్తివలె పరున్నాడు. దివ్యతేజస్సుతో వెలుంగుచున్నాడు. క్షమ, దయ ఆయనముఖమండలమున నిండియుండెను.

"ఇటీవలి దేశపరిస్థితులు మహాత్ముని మనస్సును గాఢముగా గాయపఱచినవి. అందువలననే యిటీవల ఆయన నిరశనవ్రతము పూనినాడు. ఆయుపవాసములోనే ఆయనతనువు బాసినయెడల నెంత యుక్తముగా నుండెడిదో! ఈమధ్య నొకమందబుద్ధి ఆయనపై నొకబాంబు విసరినాడు. ఆముప్పు దప్పినది. నేడు మాత్రము మహాత్ముడు మనకు దక్కలేదు.

"ఇది దుఃఖమున కదనుగాదు; కటులకు సమయము కాదు. ఇప్పుడు మన మాగ్రహావేశుల మైనచో, గాంధీజీ మన కిప్పటి

వటి కుపదేశించుచువచ్చిన బోధల నన్నింటిని జాఱవిడిచినట్లే. ఆయనమరణానంతరము మన మాయుపదేశములను పాటింపలేదనెడు లోకనిందకు పాత్రులము గాకుందుముగాక. అట్టినిందలు మన కరిష్టము లగును.

"ఇది మనకు పరీక్షాసమయము. మనలోమనకు విభేదములు లేకుండ నైకమత్యముగలిగి మెలగుదుముగాక. ఈనాడు భారతభూమి వహింపవలసివచ్చిన కార్యభారము మహత్తరమైనది. మహాత్ముని చేయూతయే లేనియెడల ఈ భారమును భరించుట మనకు దుర్ఘటమే. ఆచేయూత మనకు లభించుటెట్లు? గాంధీజీ నిరంతరము మనలోనే యుండగలడు. ఏమన ఆయన ధర్మబోధలు, ఆయనయున్నతాదర్శములు శాశ్వతముగ మనయెదుట నుండగలవు. ఆయన స్థూలస్వరూపము మన కికె కాన్పింపదు. కాని ఆయన పవిత్రాత్మ యుగయుగాంతములవఱకు మనతోడనే యుండగలదు. దానికి నాశముండదు. ఆయన తనజీవితకాలములో సాధింపక విడిచిన దానిని ఇప్పుడైనను సాధింపవచ్చునని నా యాశ.

"నేడు జరిగిన దారుణకృత్యము భారతయువకుల హృదయములను కలంచివేయగలదు. కాన వారందఱు తమ విధ్యుక్త కర్తవ్యమును మఱవకుందురుగాక. మన మందఱము నేకమై మహాత్ముడు ప్రారంభించిన మహాయజ్ఞమును జయప్రదముగా పూర్తిచేయుదుముగాక."

## 12. సరోజినీదేవి వీరాలాపము (రేడియో ప్రసంగాంశములు)

మహాత్మాగాంధీ పట్టిన మొట్టమొదటి నిరశనవ్రతము హిందూముసల్మానుసఖ్యతకొఱకు. ఆ దినాలలో యావద్భారత

జాతి ఆనిరశనదీక్షపట్ల సానుభూతిచూపినది. ఆయనతనజీవితమున అంత్యకాలమునను హిందూముసల్మానుసఖ్యతకొఱకే కడసారి నిరశనవ్రతము పూనినాడు. కాని యీసారి యావద్భారత జాతియు ఆయన ననుసరించ సనలేము. భారతావనిలో అనుశ్రుతమయ్యేడు వివిధధార్మిక సిద్ధాంతములకు విరుద్ధముగా నుండేటంతగా భారతీయులలో పరస్పరవిద్వేషములు, అనుమానములు హెచ్చిపోయినవి. చివఱకు గాంధీజీ బోధలను అవగాహన చేసికోవలసిన అత్యంతసన్నిహితులుకూడ ఈ నిరశనదీక్షయొక్క అర్థమును పూర్తిగా గ్రహింపజాలకపోయిరి. హిందూజాతిలో నింతటి యుత్తమోత్తముడైన వేఱొంకు హిందువు ఎన్నడును పుట్టియుండలేదు. హిందూమతముయొక్క సర్వసిద్ధాంతములకును, మహాదర్శములకును సమ్మతముగా తన జీవితమును నిర్వహించుకొనిన యీ మహనీయుడు, ఒక హిందూహంతకుని చేతిలో నిర్యాణము నందుట హిందూజాతి కంతకును కళంకము.

మాలో కొంతమంది గాంధీజీకి అత్యంతసన్నిహితులము. మాయుభయుల జీవితములును అవినాభావసంబంధముగలవై యున్నవి. నిజమునకు మాలో కొంతమంది ఆయనతోబాటు నిర్యాణము చెందినట్లే. మాలో కొందఱియొక్క ప్రతిఅణువు, ప్రతినరము గాంధీజీజీవితముతో ముప్పిరిగొనిపోయినవి. ఆలాటి మా కందఱకును ఆయనమృతివలన నడుము విరిగిపోయినది. నరాలు తెగిపోయినవి. గాంధీజీ మరణించినాడుగదా యని, అందువలన సర్వము నాశనమైపోయిన దని నిరాశాహతులమై పోతిమా మేము గాంధీజీకి దూరులమై పోదుము. ఆయన భౌతికకాయము మనమధ్యనుండి అంతర్ధానమై పోయినంత

మాత్రాన సర్వము నశించిపోయెనని మనము విశ్వసించు పక్షమున గాంధీజీపట్ల మన కున్న భక్తివిశ్వాసముల విలువ యే మంతటిది ? ఆయన మహాదర్శములకు, మహత్తరకృషికి ఆధ్యాత్మికసామర్థ్యమునకు మన మందఱము వారసులమై యింకను బ్రతికియుంటిమిగదా ? వ్యక్తిగతముగా విచారపడుచు కూర్చుండుకాలము గతించిపోయినది. రొమ్ములు బాదుకొనుచు జుట్టు విరియబోసికొని రోదనముచేయుచు నుండుకాలమును గతించిపోయినది. మహాత్ముని మహాదర్శములను తిరస్కరించువారు వంతనులాడుచో మనము ధైర్యముతో నెదిరించి నిలువబడగల మని ప్రకటింపవలసిన తరుణ మిది.

మన మందరము గాంధీజీ మహాశయములకు చేతనమూర్తులము. మనమందరము ఆయన సైనికులము. యుద్ధసంక్షుభితమై యున్న యీ ప్రపంచములో ఆయనజయపతాకమును చేబూని ముందుకు సాగిపోవువారము, పోగలవారమును మనమే. మన పతాకము సత్యము. మన కవచము అహింస. రక్తపాతము లేకుండ సర్వప్రపంచమును జయించు ఆత్మయే మనఖడ్గము. మన గురుదేవుని అడుగుజాడలలో నడుచుట, మనజనకుని ఆజ్ఞలను శిరసావహించుట మనవిధి కాదా ? ఆయనపోరాటమును విజయసంసిద్ధివఱకు సాగించవలసిన వీరసైనికులము మనమే కాదా ! ... ... గాంధీజీ రాజాధిరాజులకుసయితము మహారాజు. ఢిల్లినగరములో ప్రాచీనచక్రవర్తుల సమాధులమధ్య ఆయన భౌతికకాయమునకు దహనసంస్కారము జరుపుట యెంతయు సముచితము. ప్రపంచములో మహాయుద్ధములను నిర్వహించిన వీరాధివీరులందఱికన్న గాంధీజీ సాటిలేని ధైర్యసంపన్నుడు; ఎల్లఱకును ఆ ప్తమిత్రుడు, ప్రపంచశాంతిప్రవక్త

యగు నీబహుగుమానిసి భౌతిక కాయమును మహావీరోచితగౌర వములతో స్మశానవాటికకు తీసికొని పోవుటయు సముచితమే.

## 13. కే. ఏ. అబ్బాసు ధృవవచనము

ముస్లిములకును, ఇస్లాముమతమునకును పరమశత్రువని మతోన్మాదులు వర్ణించు గాంధీజీ ఖురాను శ్లోకములనుండి ఉత్తేజనమును గ్రహించుటేమి ?

విధిప్రభావము పరిఢవిల్లగా ఆ (1942) ఆగస్టు 9 ఉదయము పోలీసువారు తనను పట్టుకొనిపోవుసమయాన ప్రార్థనలు చేసికొను వ్యవధిని గాంధీజీ కోరుకొనెను. ప్రార్థనలో ఖురానుకీర్తనలు పాడెను. ఆయన వేంటదీసికొనివెళ్ళిన ఐదారు పుస్తకములలో ఖురాను ఒకటి!

ఇదేమి ? మాయయా ? వంచనయా ? ముస్లిములను తనవైపు త్రిప్పుకొనుటకైన రాజకీయతంత్రమా ? కాదు, కాదు. ముమ్మాటికిని కాదు. గాంధీజీయొక్క ఇస్లాం అభిరుచియు, అభిమానమును ఈనాటివి కావు. ఆయన రాజకీయనాయకత్వముకన్న ప్రాచీనమైనవి. ఏబదేండ్లనాటివి! ముస్లిముమిత్రులయొక్కయు, ముస్లిముసహచరులయొక్కయు విశ్వాసప్రేమలకు ఆయన పాత్రుడు కానట్టిసమయము ఆయన జీవితవిధానములో ఇంతవరకు లేదు. ఆయనయొక్క మతవిషయమై ఎవరేమన్నను ఆయనది ఛాందసమైన, స్వపరాయణమైన సంకుచితమత మని నిందింపగలవారు లేరు. ... ...

గాంధీజీ ఇస్లాముకును, ముస్లిములకును గాదిలి నెచ్చెలి. 1922 లో ఇస్లాంకోసమై కారాగారవాసమున కేగిన గాంధీజీ

ముస్లిముల న్యాయమైన హక్కులను నెన్నడును భంగపఱచు వాడు కాడు. ఇస్లామునకు ఉపద్రవము కలుగనీయడు. ఏమం దురా, ఆయన జాతిమతవర్ణకులక్షుద్ర విభేదములకు అతీతుడు. సత్యముకన్న వేఱు దైవము లేదను నొక్కవాక్యములో తన మతము నంతను ఆయన క్లుప్తముగ వివరించువాడు.

## 14. విదేశీయుల జోహారులు

గాంధీజీ మరణించె ననువార్త విని రాణియును, నేనును నివ్వెరపోతిమి. వారిమృతివలన మానవకోటికి కలిగిన తీరని నష్టముంగూర్చి మేమిరువురము హృదయపూర్వకసంతాపమును తెలుపుచుంటి మని భారతదేశప్రజలకు తెలియజేయుడు.

—జార్జిరాజు

బాధితప్రజలకు శాంతిని చేకూర్చునిమిత్తము తనప్రాణము లను ధారపోయుటకు దీక్షవహించినవాడు గాంధీజీ! ఆప్రయ త్నములోనే ఆయన కడకు తనప్రాణములను కోల్పోయినాడు. ఈదారుణవిషాదసంఘటనతో భారతదేశమునందు ఈసారి మతోన్మాదము పూర్తిగా నశించి, దానిఆత్మ పరిధూతము కాగలదని విశ్వసించుచున్నాను.

—జనరల్ స్మట్సు

హృదయభారముచే మాట వచ్చుటలేదు. గాంధీజీమరణము ప్రపంచమునకే గొప్పనష్టము. ఆమహానాయకుడు బోధించిన నీతుల ననుసరించుటే మనకర్తవ్యము.

— మౌంటుబాటను సతి.

గొప్పత్యాగియై జీవించుచు, కోట్లకొలంది ప్రజలచేత అవతారపురుషుడుగ పూజింపబడుచున్నాడు. మతకలహాలతో విచ్ఛిన్నమై పోవుచున్న దేశములో తన మతస్థులకే గాక భారతీయుల కందఱకుగూడ మనసు కలిగింపగల ప్రతిభ వారికి గలదు.

భారతీయసమస్యాపరిష్కారమునందు గతపాతికేండ్లుగా నీతడే ప్రధానపురుషుడుగ నుండెను.

భారతీయుల స్వాతంత్ర్యాశయముల ప్రవక్తగా నుండెను. కాని పట్టి జాతీయవాదిమాత్రమే కాడు. భారతీయులు విదేశీయులచే పాలింపబడరా దని ఆయన వాదించినమాట నిజమే. కాని ప్రాక్పశ్చిమవిభిన్నాదర్శములను విశదీకరించువాడు. పాశ్చాత్యుల భౌతికప్రాధాన్యమును నిరోధించుచు నిరాడంబర జీవితవిధానమును ప్రబోధించువాడు. —అట్లీ ప్రధాని

గాంధీజీ భారతజాతీయనాయకుడుమాత్రమే కాదు; ప్రపంచ నాయకుడుకూడ. అనేకజాతులు ఆయనదివ్యసందేశమును గ్రహించి, శాంతిసౌభ్రాత్రాలకై పాటుపడగలవు. శాంతి సౌభ్రాత్రాల సాధనములలో మఱొకమహావీరుడు కూలిపోయినాడు. —అధ్యక్షుడు ట్రూమన్

......గాంధీజీ ఒకమహాపురుషుడుమాత్రమే కాదు. ఆయన సర్వలోకానికి ప్రేమాస్పదుడైన వ్యక్తి. ఆయనస్మృతివలన నా ఆప్తబంధు వొకడు మరణించినట్లుగా నాహృదయము భగ్నమైనది. ప్రపంచములో ఆయనను చూచినట్టిగాని, లేక ఎఱిగినట్టిగాని ప్రతివ్యక్తియు, నాయంతగా గాఢవియోగదుఃఖమును అనుభవించుచున్నా డని నే నెఱుగుదును.

ప్రపంచములో ఆయన జీవించియుండగా మానవజాతిపై ఎంతటి ప్రభావము, ప్రాబల్యము ప్రసరింపజేయుచుండెడివాడో, మరణానంతరము అంత కనేకమడుంగు లధికముగా ఆయన తన ప్రాబల్యమును విస్తరింపజేయగల డనెడు విశ్వాసము నాకు గలదు. సర్వమానవకోటిని ప్రేమసౌభ్రాత్రములతో నేకీభవింప జేయవలయు నను నొక ఉదాత్తలక్ష్యముకొఱకు తన ప్రాణముల నర్పించినాడు. గాంధీమహాత్ముడు మానవకోటికి మోక్షదాత అని ప్రజ లాచంద్రతారార్కముగా ఆయన పేరును సంస్మరించు కొనుచుందురు ......... మనకు ఆత్మవిశ్వాసమును గల్పించి ముందుకు నడిపించుకొఱకు గాంధీజీ యింకా మనలోనున్నాడను భావము నాకనేకవిషమసమయములలో కేలూఁత నొసగుచు వచ్చినది. ఈ పెన్నిధానమును కోల్పోయినతరువాత మనము దినముల నెలా వెళ్లదీయగలమా యని నామనస్సు సంక్షోభము చెందుచున్నది. —డాక్టరు హోమ్సు

పాకీస్థానుపార్లమెంటు ప్రథమబడ్జెటు సమావేశములో “మహాత్మునిమరణమునకు సంతాపాతిశయమును వెలిబుచ్చు వాక్యములను నేను వినియున్నాను. ఇతరులతోబాటు ఈ మహాపురుషునికి నేనుగూడ జోహారు లర్పించుచున్నాను. తాను ధర్మ మని నమ్మినదానిని నిర్వర్తించుచు ఆయన మరణించెను. ఆయన నియమములుకలవాడు. సిద్ధాంతములకు కట్టుబడియుండువాడు. ఒకపని చేయుట తనకు ధర్మమని రూఢి యైనయెడల నాపనిని చేయుచుండెడివాడు. ఆయన మరణము నకు మన మెంతసంతాపపడినను, ఆయనహత్యను మన మెంత

ఖండించినను ఆయన మరణము ఉదాత్తమైనది. ఎందువలన నన, ఆయన తనధర్మమును నిర్వర్తించుచు మరణించినాడు." అని కాయిదేఆజామ్ జిన్నాగా రుపన్యసించిరి.

ఈనష్టము కేవలము భారతదేశమునకు మాత్రమేకాదు. ప్రపంచమే యొకగొప్పనాయకునికోల్పోయినది. ఈమహాత్ముని ప్రతిభ అజరామరణమై యుండిపోగలదు.

—ఈమన్ డివేలరా

# మన కర్తవ్యము

## నాలుగవ భాగము

### 1. నిర్మాణకార్యక్రమము

భారతదేశము స్వాతంత్ర్యమును సంపాదించుకొనుటకును, ఆ స్వాతంత్ర్యమును నిలుపుకొని చిరకాల మనుభవించుటకును భారతజాతి యంతయు నొకానొకరీతి కార్యక్రమము నవలంబించి జీవించవలయును. మనజాతి బానిసయై బ్రిటిషుజాతి పాలనక్రింద యున్నంతకాలమును ఆ ప్రభుత్వబంధముల ద్రెంచుకొనుటయే ముఖ్యకర్తవ్యముగ నుండెను. అందుకొఱకై సంఘమునకు భంగకరముకానట్టియు, నైతికపతనహేతువు కానట్టియు చట్టముల నెదిరించి యాప్రభుత్వమును సడలగొట్టి నిర్మూలము గావించుటకై కొంతకార్యక్రమము నవలంబించితిమి. ఈకార్యక్రమము సాగించుపట్ల ప్రజలు చాల నుత్సాహమును గనుబఱచిరి. స్వాతంత్ర్య మొకరీతిగా లభించినది. బ్రిటిషుపాలకులు భారతదేశమును విడిచిపెట్టిరి. కాని ఆ స్వాతంత్ర్యమును గట్టిపఱచుకొని చిరకాలము సాగించుకొనుట కాకార్యక్రమము చాలదు. పనికిరాదుకూడను. ఇప్పు డవశ్యము భారతీయు లవలంబింపవలసిన కార్యక్రమమునుగూర్చి మహాత్ముడు పదమూడు సూత్రములను తెలిపియున్నాడు. ఈ నిర్మాణ కార్యక్రమము భారతజాతి యెదుట గాంధీజీ పెట్టి చాలకాలమైనది. కాని ప్రజలెల్లరకును అది పరిచయమైయుండలేదు. కావున ఆ సూత్రములను మఱల సంస్మరించుట నిరంతరము జ్ఞప్తిలో నుంచుకొని అనుదినజీవితమున నాచరణలో బెట్టుట మంచిది!

1. మతసఖ్యత:— మతసఖ్యత అనగా రాజకీయవిషయము లలో మాత్రము వివిధమతస్థుల మధ్య సఖ్యతయుండిన చాలు నని అర్థము కాదు. అవిచ్ఛిన్నమగు హృదయసఖ్యత అవ సరము. కాంగ్రెసువాదులు అన్యమతస్థు లందఱితోడను మనః పూర్వకమైన స్నేహసామరస్యభావములను పెంపొందించుకో వలెను. తన మతమును తా నెంత గాఢముగా విశ్వసించి యభిమానించునో, అన్యమతములను సయితము అంతగాఢ ముగా విశ్వసించి అభిమానించుట నేర్వవలయును. బడుల లోను, కళాశాలలలోను. వైద్యాలయములలోను, తదితర ప్రదేశములలోను హిందువుల కనియు, తదితరుల కనియు వేర్వేఱుగా నీటిపాత్రలుంచతగదు. ఇట్టి స్నేహసఖ్యతలవలన పర్యవసానముగా రాజకీయసఖ్యత దానంత నదియే సిద్ధించును.

2. అస్పృశ్యతానివారణ :— హిందూమతమునందు అస్పృశ్యతాచారము అనునది మహామారివంటిది. హిందూ మతమున కదొక తీరని కళంకము. సంఘదూరులై దుర్భర జీవితముల గడుపుచున్న హరిజనులతో ప్రతిహిందువును పరి చయము పెంపుచేసికోవలయును. వారి కితరులతోపాటు సమా నమైన ఆర్థికావకాశములను గౌరవప్రతిపత్తులను కల్పించి ఉద్ధ రించవలెను.

3. మద్యపాననిషేధము:— లక్షలకొలది స్త్రీపురుషులు మత్తుపదార్థముల దినుటవలనను, త్రాగుటవలనను దుర్భరజీవిత ముల గడపుచున్నారు. మద్యపానపిశాచమును సర్వసాధన సంపత్తిని ప్రయోగించి, నిర్మూలించిననేగాని సంఘమునకును, దేశమునకును ముక్తి యుండదు. ప్రమాదము లేనట్టియు,

ఆరోగ్యకర మైనట్టియు పానీయములను కష్టపడి అలసిపోవు కార్మికులకు చొకధరలకు దొరకునట్టి సదుపాయములను కల్పించుటకై కాంగ్రెసుకమిటీలు సాయపడవలెను.

4. ఖద్దరు:— దేశీయులందఱికి సమత్వమును సాధించుటకును, ఆర్థికసమత్వము సమకూర్చుటకును ఖద్దరు ప్రప్రథమసాధనమగును. పూర్ణమగు స్వదేశాభిమానముతో, స్వదేశదీక్షతో ఖద్దరుధారణము, ఖద్దరుత్పత్తి పూనవలయును. బ్రిటనులోని యేడజనునగరముల క్షేమముకొఱకు భారతదేశమునందలి యేడులక్షల గ్రామములను ఆర్థికముగా ద్రోపుడులుచేయుట కంటె ఏగ్రామమున కాగ్రామమునే ఖద్దరుద్వారమున స్వయంపోషకము చేయుట అత్యంతము శుభకరము. అప్పుడు గ్రామములు నగరములపై ఆధారపడుటకంటె, నగరములే గ్రామములపై ఆధారపడియుండగలవు.

ఖద్దరు భారతప్రజాకోటియొక్క ఐక్యమునకును, ఆర్థిక స్వాతంత్ర్యమునకును, సమానత్వమునకును ప్రధానచిహ్నము. ప్రతిస్త్రీయు, ప్రతిపురుషుడును దినమున కొక గంటచొప్పున సూత్రయజ్ఞమునకు అనగా నూలువడుకుటకు పూనినమొడల చాలును.

6. గ్రామపారిశుద్ధ్యము:— ఆరోగ్యప్రదములు, సర్వసౌఖ్యప్రదములునై గ్రామసీమలు వెలయుటకు మారుగా పేడకుప్పలతో నసహ్యము గొలుపుచున్నవి. ఈ మనగ్రామములును కాంగ్రెసువాదులును ఆదర్శప్రాయముగా సిద్ధముకావలయును. జాతీయముగను, సాంఘికముగను పవిత్రభావములను గ్రామవాసులకు విరివిగ నేర్పవలయును.

7. ఆధారవిద్య:—లక్షలకొలదిగ్రామములతో నిండియున్న భారతదేశముయొక్క వాస్తవికావసరాలను పాటింపకుండినట్టి ప్రారంభవిద్యావిధానము హాస్యాస్పదముగ నున్నది. బాల బాలికలయొక్క దైహికమానసిక ఆరోగ్యస్థితిని వృద్ధిపొందింప చేయునదిగా మనవిద్యావిధానము మార్పుచెందవలసియున్నది.

8. వయోజనవిద్య:— వయోజనవిద్యావిధానప్రచారము నాచేతులలో నున్నయెడల మనదేశముయొక్క ఔన్నత్యమును, వైశాల్యమును వారికెఱుకపఱచుటద్వారా నావిద్యావిధానమును వయోజనములలో మున్ముందుగా నోటిమాటలద్వారమున సాగించెదను. ఆపిమ్మట వ్రాయుట, చదువుట నేర్పవచ్చును.

9. స్త్రీజనోద్ధరణ:—అహింసాత్మకజీవనవిధానములో తన భవిష్యత్తును తాను నిర్ణయించుకొనుహక్కు పురుషుని కెటులో స్త్రీకిని అటులే యుండవలయును. పరస్పరామోదముతోడను, సహకారముతోడను సమాజప్రవర్తనానిబంధనల నేర్పాటు చేసికోవలయును. స్త్రీజనోద్ధరణకార్యక్రమమును సాగించుట కాంగ్రెసుగోత్రికుల కొక మహాభాగ్యమే యనదగును. భర్తలు భార్యలను గౌరవనీయలును, ఆత్మీయలును నగు సహచారిణులనుగా భావించవలయును.

10. ప్రజారోగ్యము :— ఆరోగ్యనియమముల నెఱుగక అజ్ఞానాంధకారములో బడియుండి ప్రజలలో ననేకులు వ్యాధిగ్రస్తు లగుచున్నారు. దైహికమానసికఆరోగ్యస్థితులు పరస్పరాధీనములుగాన, ఆరోగ్యధర్మాలను సాధారణప్రజలలో విరివిగా ప్రచారము చేసి ఆచరణలో పెట్టునటుల కృషిచేయవలయును.

11. దేశభాషలు:— ఆంగ్లభాషమీద మనకున్న వ్యామోహామువలన మన దేశభాషలపైని ఆదరణ వమ్మైపోవుచున్నది. శాస్త్రసంబంధమగు పదజాలమునకు మనభాషలలో ప్రత్యాయ పదములు దొరకవను కారణమున నవనాగరికాభివృద్ధి మన ప్రజాసామాన్యమునకు అందుబాటులో లేకున్నది. దీనికి పరిహారము మనదేశభాషలను సరిదిద్దుకొని వృద్ధిచేసికొనుచేయగును.

12. జాతీయభాష:— మనకు జాతీయభాషగా హిందీని (హిందూస్థానీభాషను) నిర్ణయించి అభివృద్ధిచేయవలయును. ఈభాష మనదేశములోని అసంఖ్యాకప్రజలు మాటలాడుచునే యున్నారు.

13. ఆర్థికసమత్వము:— పెట్టుబడిదారునకు, కార్మికునకు మధ్య చిరకాలమునుండి వచ్చుచున్న సంఘర్షణను తొలగించి ఆర్థికసమత్వమును సాధించవలసియున్నది. ధనవంతులు తమ సంపదలను స్వబుద్ధిపూర్వకముగ త్యాగముచేసి ప్రజాక్షేమము కొఱకు వినియోగించి సహాయపడనియెడల భయంకరవిప్లవము చెలరేగక తప్పదు.

ఇయ్యవి గాంధీజీ తెలిపిన సముచితనిర్మాణకార్యక్రమ సూత్రములు. వీనిని శక్తికొలది భారతప్రజ యెల్లఱును అనుష్ఠించుట ముఖ్యకర్తవ్య మగును.

## 2. మహాత్ముని మరణశాసనము

మహాత్ముడు కాంగ్రెసును సంస్కరించి నూతనస్వరూపముతో నిర్మాణముచేయు ప్రణాళికను తెలుపుట కుద్యమించి యుండెను. ఉపవాసదీక్షవలన ఆయనకు అనువగు తీరికగాని,

బలముగాని లేనికారణమున ఆలస్య మగుచుండెను. ఈ జనవరి ముప్పదియవదినమున దానిని రచించి కాంగ్రెసువారి కిచ్చుటకై గాంధిజీ ఆతురపాటు చెందిరి. నాడు దానిని త్వరపడి సూత్రప్రాయముగ రచించిరి. అవకాశ మున్నచో దీనికి దగిన వివరణను వ్రాసెద ననిరి. అట్టిఅవకాశము లభింపనే లేదు. కావున దీనిని మహాత్ముని మరణశాసన మనదగియున్నది. లోకములో మరణశాసనములు అంతకుపూర్వము చేసిన నిర్ణయములను రద్దుచేయుటసామాన్యము. కాని యీపత్రము గాంధిజీ తన అనుయాయులకు కొంతకాలమునుండి ప్రకటించుచువచ్చిన భావముల సంపుటియే. అఖిభారతకాంగ్రెసుకార్యదర్శి యగు శ్రీశంకరరావు దేవుగారు, ఆచార్య జుగుల్ కిషోర్ గారు దీనింగూర్చి యొకింత మహాత్మునితో చర్చించిరటగాని, చర్చ సావధానముగ జరిగి పూర్తికాలేదు.

కాంగ్రెసు 'లోకసేవకసంఘము' గా మారిపోవలయు నని మహాత్ము డిందు సూచించియున్నాడు. లోకసేవ యనినను, దైవసేవ యనినను గాంధీజీభావములో నొక్కటే. "మానవ సేవయే మాధవసేవ". కాంగ్రెసు ప్రజాళిపైని అధికారము వహించి పరిపాలనము చేయుసంఘముగగాక ప్రజాళియొక్క ఉత్తర్వులచొప్పున కార్యభారము వహించు సేవకామండలియై యొప్పగావలయును. కాంగ్రెసులో నిటీవల తలజూపిన అధికారవ్యామోహము, అవినీతి మహాత్ముని చాలగా వ్యధపాలు చేసినవి. ఇందుకుతోడుగా హిందూముస్లిమువిభేదములు, పరస్పరహత్యలు వాని హృదయమును వ్యధపెట్టినవి. కావున కాంగ్రెసుదృక్పథమును, కార్యక్రమమును, నిర్మాణాధారములను మార్చివేయసంకల్పించినాడు.

## 3. పంచాయతీలు - వర్గములు

యుక్తవయస్సువచ్చిన యైదుగురకు తక్కువగాని సభ్యులతో గూడిన ప్రాథమికపంచాయతీలు ఆధారసంఘములుగా నుండవలయును. ఇందు స్త్రీలు, పురుషులు చేర నర్హులే. వీరే వర్కర్లు. వీరు గ్రామవాసులైనను, నగరవాసులైనను కావచ్చును. కాని గ్రామీణదృక్పథముగలవారుగా నుండవలయును.

దాపుగానుండు రెండు ప్రాథమికపంచాయితీలు చేరి ఒక కార్యవర్గముగా నేర్పడి తమలోనుండి యొక నాయకుని ఎన్నుకొందురు. ఇట్టివి వందపంచాయితీ లేర్పడగా వానిలో 50 మంది ప్రాథమికశ్రేణినాయకు లుందురు. ఈ యేబదిమందిచేరి తమనుండి యొకద్వితీయశ్రేణినాయకుని ఎన్నుకోవలయును.

ఈవిధముగా 200 పంచాయితీలు కలిసి ఒకనాయకవర్గము నేర్పాటుచేయుచు పోగా దేశమంతటను పంచాయితీవర్గా లేర్పడును. ఈ వర్గాలన్నియు ద్వితీయశ్రేణినాయకులను పై విధమున ఎన్నుకొనును.

ద్వితీయశ్రేణినాయకు లందఱును కూడి అఖిలభారతవ్యవహారములను, విడివిడిగా స్థానికపంచాయితీవ్యవహారములను నడుపుచుందురు. అవసరమని తోచునెడ వారు తమలోనుండి యొక అగ్రనాయకుని ఎన్నుకొని వాని నియమానుసారము నడుచుచుందురు.

రాష్ట్రాలయు, జిల్లాలయు నిర్మాణముల నిందు ప్రస్తుతము నిశ్చయింపలేదు. ఈ సేవకవర్గాలను ముందుముందు తగురీతిని విభజింపనగును.

దేశమునకంతకు విచక్షణపూర్వకముగను, ఐచ్ఛికముగను తాము చేయు సేవలనుబట్టి యీ వర్గముల పలుకుబడియు, ప్రభావమును వర్ధిలును.

## 4. వర్కర్ల యోగ్యతలు

1. ప్రతివర్కరు ఖద్దరు ధరించునభ్యాసము గలవాడై యుండవలెను. ఆఖద్దరు తాను స్వయముగ వడికి తయారు చేయించుకొనినదిగగాని, అఖిలభారతచర్ఖాసంఘమువారి అనుమతిపొందినదిగగాని యుండవలెను. తానుగాని, తనకుటుంబముగాని అస్పృశ్యత నేవిధముగను పాటింపదగదు. సాంఘికసామరస్యమును కోరువాడుగాను, సర్వమతములను సమానముగ గౌరవించువాడుగాను, జాతిమతలింగభేదములు లేకుండ యెల్లరకును సమానావకాశము లుండనిచ్ఛగించువాడుగను నుండవలయును.

2. తనప్రాంతములోని ప్రతిగ్రామస్థునితోడను పరిచయము గలిగియుండవలయును.

3. గ్రామస్థులలోనుండి వర్కర్లను తయారుచేయుచు వారిజాబితా నొకదాని తనకడ నుంచుకోవలయును.

4. ప్రతినిత్యము తాను చేసినపని ఎప్పటికప్పుడువ్రాసిపెట్టిన పుస్తకము నుంచవలయును.

5. వ్యవసాయమును, చేతిపనులను పెంపొందించుట మూలమున గ్రామములను స్వయంసమృద్ధముగను, స్వయంపోషకముగను తయారుచేయువలయును.

6. గ్రామస్థులు ఆరోగ్యసూత్రములను పాటించునటులచేసి అనారోగ్యమును గ్రామాలనుండి పారద్రోలుటకు ప్రయత్నాలు చేయవలయును.

7. నయీతాలిమీపద్ధతుల ననుసరించి, గ్రామవాసులలో పిన్నలకు పెద్దలకుకూడ విద్యను గఱపువిధానములను అనుసరింపజేయవలయును.

8. వోటర్ల జాబితాలలో అర్హులగు నందఱిపేరులును సక్రమముగా చేరునటుల శ్రద్ధవహించవలయును.

9. చట్టప్రకారము యోగ్యత సంపాదించుకొనియుండని వారిని అటుల సంపాదించుకొనునటుల ప్రోత్సహించవలెను.

10. ఈపనులన్నిటిని నెరవేర్చుటకు సంఘనియమముల ననుసరించి సుశిక్షణగలిగి వర్తించవలయును.

అఖిలభారత చర్ఖాసంఘము, అఖిలభారత గ్రామోద్యోగ సంఘము, హిందూస్థానీ తాలిమీసంఘము, హరిజన సేవా సంఘము, గో సేవాసంఘము అనునవి యన్నియు లోకసేవా సంఘముతో చేర్పబడవలయును.

సంఘమునకు వలయు ధనమును వర్కరులనుండియే గాక యితరులనుండియు వసూలుచేయవచ్చును. పేదలవలన వసూలు చేయ వీలుగల కానీలకు ప్రాధాన్యము హెచ్చుగా నుండవలయును.

25-2-1948 నాడు అఖిలభారతకాంగ్రెసుకమిటీకార్యదర్శి శ్రీ శంకరరావు దేవు చేసిన ప్రకటనలోని అంశములు:—

అఖిలభారతకాంగ్రెసుకమిటీసమావేశము పూర్తి యైనది. గాంధీమహాత్మునిహత్యపట్ల లజ్జను సంతాపమును, ప్రకటించుచు

తీర్మానించినది. అంతటితో తన విధ్యుక్తధర్మము నెరవేరి నట్లుగా తలచుట యుక్తముకాదు. బాపూజీవిషాదమరణమునకు దోహదమిచ్చిన నేటిపరిస్థితికి తనబాధ్యతను ఒక్క కాంగ్రెసు వాదియైనను అలక్ష్యము చేయజాలడు. మనపైబడిన బాధ్యతను కొంతవఱకైనను భరించుటకు బాపూజీ నేడు లేడు. కావున కాంగ్రెసుబాధ్యత గురుతరమైనది. కాంగ్రెసు ఈబాధ్యత నెలా నిర్వహించగలదు ? ...... ఇంకను కాంగ్రెసు రాజకీయ సంస్థగా వ్యవహరింపవలసిన దేనా? ఇప్పుడు దానిలక్ష్య మేమిటి? కాంగ్రెసుపైనపడిన క్రొత్తబాధ్యతను నిర్వహించుట కనువగు తీరున దాని నొకపవిత్రమైన సంస్థగా పునర్నిర్మించుట యెలా సాధ్యము ! అఖిలభారతకాంగ్రెసుకమిటీ అన్నిసమస్యలను పూర్తిగా చర్చించుటకు వ్యవధి చాలినదికాదు. కాని తనపై నిప్పుడుపడిన బాధ్యతను నిర్వహించుటకే తీర్మానించినది. ప్రతి పౌరునకును సమానావకాశములతో సమానరాజకీయార్థికార్హత లతో ప్రపంచశాంతియే ప్రధానలక్ష్యముగా కోఆపరేటివు కామన్వెల్తుసంస్థాపనకై కాంగ్రెసు కృషి చేసితీరవలయు నని సభ్యులలో అత్యధికసంఖ్యాకులు తమ అభిప్రాయమును వెల్ల డించియున్నారు.

## 5. ఆర్థికకార్యక్రమము

కాంగ్రెసు భావినియమావళిని సూచించుటకై వర్కింగు కమిటీ చేసిన ప్రతిపాదన అంగీకరింపబడినది. కాంగ్రెసు "లోకసేవకసంఘముగా" వ్యవహరింపవలయు నని గాంధిజీ సూచించిన తుదిప్రణాళికనే ప్రాతిపదికగా అంగీకరించినది. ...... కాంగ్రెసునియమావళియు, ఆర్థికకార్యక్రమమును ఎంత

నిర్దుష్టముగా నున్నను, కాంగ్రెసులక్ష్యములకు అనుగుణముగా కాంగ్రెసువాదులు వ్యవహరింపజాలకపోవునెడల, అవన్నియు నిరర్థకము లగును. కాంగ్రెసువాదులలో కానవచ్చిన నైతిక పతనముతో తా నెంతగా బాధపడెనో నిరాహారదీక్షాసమయమున గాంధీజీ స్పష్టముగా వివరించియున్నాడు ... మనపాపాలను పరిహరించుకొనునిమిత్తము ఆత్మశుద్ధికొఱకు మనము తీవ్రకృషి చేయవలసియున్నది. అందుకు తగు అర్హత మనకు సిద్ధించినప్పుడే, కాంగ్రెసును శక్తిమంతము చేసి నేటి విషమపరిస్థితి నుండి దేశమును రక్షించి, అందఱకు సమానహక్కులు; సమానావకాశములు కలుగుట ప్రధానసూత్రముగా మతముతో సంబంధములేని ప్రజాస్వామికరాజ్యమును మనము నిర్మించగలము.

తనజీవితకాలములో గాంధీమహాత్ముడు నిర్వహించిన నిర్మాణకార్యక్రమమును, ఆయన ప్రచారము చేసియున్న లక్ష్యములను ఇకముందుకూడ ప్రచారముచేయునిమిత్తము "గాంధీజాతీయస్మారకనిధి" ని సేకరించుటకు అఖిలభారత కాంగ్రెసుకమిటీ నిర్ణయించినది. ఈనిధికి విరాళములను సేకరించుటలో సాహాయ్యము చేయుట ప్రతికాంగ్రెసువాదికిని, ప్రతికాంగ్రెసుసంఘానికిని విధ్యుక్తధర్మమైయున్నది. ఈసందర్భములో అఖిలభారతకాంగ్రెసుసంఘము చేసిన తీర్మానాంశము గమనింపదగియున్నది. గాంధీజీనిగుఱించి స్థానికముగా అందందు స్మారకచిహ్నముల నిర్మించుటకై ప్రజలయొద్ద విరాళములు వసూలుచేయబడవచ్చు ననియు, అందువలన ప్రజలీయగలిగిన దంతయు స్థానికనిధులకే యిచ్చివేయుప్రమాదమును ఎదుర్కొనవలసియుండు ననియు హెచ్చరించియున్నది.

ప్రతికాంగ్రెసువాదియు, కాంగ్రెసువాదు లేగాక, ప్రతిభారతీయు డును తా నీయగలదానిని గాంధీజీజాతీయస్మారకనిధి కొసగుటే గాక, ఈనిధికై విరాళముల సేకరణలో శక్తికొలది తోడ్పడ వలయు నని విజ్ఞప్తి చేయుచున్నాను.

## 6. గాంధీజీ లక్షించిన భారతస్వరూపము

మహాత్ము డిట్లు ప్రవచించియున్నాడు :—

"ఇది నా మాతృదేశ మనియు, దీని భవిష్యత్కాలరూప కల్పనలో నాకును తగినంత ప్రాతినిధ్యము కలదనియు నిరు పేదలు సయితము భావించుటకు అవకాశ ముండునట్టి, ఉచ్చ నీచవర్గముల నెడు తారతమ్యములకు తావు లేనట్టి, వివిధమతముల ప్రజలు సంపూర్ణసామరస్యముతో అన్యోన్యానురాగముతో జీవింపగలుగునట్టి నవభారతనిర్మాణమునకు నేను కృషి చేసె దను. నేను లక్షించిన నవభారతములో అస్పృశ్యతాదోషము నకుగాని, మద్యపానదురాచారమునకుగాని తా వుండదు. పురుషులతోపాటు స్త్రీలును సమానమైన హక్కులను అనుభ వింతురు. ఇతరులదోపిడికి బలిగాకుండ, ఇతరులను దోచుకొను ఘోరు స్వభావము లేకుండ యావత్ప్రపంచముతోడను మనము శాంతి సహనములుగలిగి సంచరింతుముగాన స్వల్పాతిస్వల్ప మైన సైన్యమునే మన మేర్పాటు చేసికొందుము. కోటాను కోట్లుగాగల నోరులేని ప్రజాబాహుళ్యముయొక్క యోగ క్షేమములకు విరుద్ధముకానట్టి యేప్రయోజనమునైనను అది స్వదేశీయమైనను, విదేశీయమైనను గౌరవించెదము. నేను కలలు గనుచున్న నవభారతవర్ణము ఇట్టిది! ఇది వినా మఱే దియు నన్ను తృప్తిపఱుప జాలదు.

"నామాట చెల్లుబడియగునెడల మన గవర్నరు జనరలు, మనప్రధానియు రయితులుగా నుందురు! రయితులు భూలోక స్వర్గరాజ్యమునకు వారసులని చిన్నతనములో నేను చదువుకొనిన పుస్తకములో చదివినాను. భూమిలో కష్టపడి పనిచేసి, తాము పండించుదానిని తిని బ్రతుకువారి కిది అనువర్తించును. అట్టి రయితులు ఉన్నతోద్యోగములకు, నిరక్షరాస్యులైన కారణమున అనర్హు లందురేని, మంచి వ్యావహారిక జ్ఞానము, ధైర్యము, అనింద్యమగు న్యాయబుద్ధి, అకలంకమగు దేశభక్తి గలిగియున్నచో వారర్హులే యని వాదింతును. దేశసౌభాగ్యమును ఉత్పత్తిచేయువా రగుటచేత నిజముగా యజమానులు వారే! కాని అట్టివారినే మనము బానిసల జేసినారము. సెక్రటేరియేటునందలి ఉన్నతపదవులలోగూడ రయితులే యుండవలయు నని నేను సూచింతును. వారు తగినవారైనచో, పని గ్రహించగలవా రగుచో అట్టి రయితులకు తా వొసగవలయు నని మంత్రులు మున్నగువారికి బాహాటముగా నేను సలహా నిత్తును".

**గాంధీజీ 1948 సంవత్సరము జనవరి 29 వ తేదీ సాయంతనము ప్రార్థనానంతరప్రసంగములో తుదిసారిగా పలికిన అమరవాక్కు లివి :**

ఇట్టి నవ్యభారతరాజ్యము ఆటముబాంబులకు సయితము వెఱువ నగత్యములే దనుటకు రెవరెండు హోమ్సు సాక్ష్యము చాలును:—

" మీకు కావలసినది గాంధీజీయా లేక ఆటముబాంబా ? ఈసమస్యను ఈదినమే తేల్చుకొనుట అవసరము. మీరు ఆటముబాంబును అనుసరించెదరా ? లేక గాంధీగారిని అనుస

రించెదరా ? ఆత్మ నిత్యమని మహాత్ముని విశ్వాసము. ఖడ్గ బలముకన్న ఆత్మ అధికసామర్థ్యముకల దని ఆయన నమ్మకము. ద్వేషానలమధ్యమున పవిత్రప్రేమమూర్తివలె, క్రోధజ్వాలమధ్యమున క్షమామూర్తివలె, దౌష్ట్యమధ్యమున సాధుమూర్తివలె గాంధీజీ వర్తించి జీవించినాడు. 'మానవుని ఆత్మ' అనిన, మానవునిలో నుండు భగవత్స్వరూపమే యన్నమాట. ఈమానవాత్మ ప్రపంచాతీత మైనది. లోకమును అధిగమింపగలది. గాంధీజీప్రబోధములో నున్న రహస్య మంతయు నిందే యున్నది. దీనికే ఆయన 'సత్యము' అని నిర్వచించినాడు. తన విశ్వాసముద్వారా, ఆవిశ్వాసముయొక్క అనుష్ఠానముద్వారా ఇదే 'సత్యము' అని ఆయన రుజువుచేయగలిగినాడు. మనము జీవించదలచుకొనుచో ఈ "సత్య" నిర్వచనమును ఆమోదింపగావలయును !

(2—2—1948 రేడియోప్రసంగము. న్యూయార్క్).

ఈతీరున మనకర్తవ్యమును విజ్ఞులగువా రెందఱో నిరూపించియున్నారు. భారతీయు లెల్లఱు ఈతమకర్తవ్యమును గుర్తించి శిరసావహింత్రుగాక!

జై హింద్!

2·1·53
Rs·1-4-0




ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి, కో. శా. జి. 1 ఏ, శా, 1000. 4/48.